# అపరాధ పరిశోధన

సం. ౩ జనవరి 75

## సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—13

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## సుడిగుండంలో సుందరాంగి!

రచన: సుజనశ్రీ

## దేశద్రోహులు

రచన: ఏ. వీ. మోహన్రావ్

## పేయింగ్ గెస్ట్

రచన: కంచర్ల రమణ

## బలికోరిన డబ్బు!

రచన: ముళ్ళపూడి నాగేశ్వరరావు

"ఖైదీ" సీరియల్ - 8 వ భాగము

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—13**
జనవరి, 1975
వెల: రు. 3_00
ఏడాది చందా 39 రూపాయలు
30_3_'75 లోగా పంపితే 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామ దామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**కంచర్ల రమణ**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాద్_29
ఫోన్___36959

ముద్రణ:
**క్రాంతి ప్రెస్**
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు___1

# సుడిగుండంలో సుందరాంగి!

సుజనశ్రీ

మద్రాసు ఎయిర్ పోర్టు, మీనంబాకంనుంచి విమానం రన్ వేలో పరుగెత్తి గాలిలోకి లేచింది.

కిటికీ ప్రక్కసీట్లో కూర్చున్న సునీత దూరంగా సముద్రంలో బొమ్మలాగ కనబడే స్టీమర్లవంక చూస్తూండి పోయింది.

ఆమె ఒంటరిగా ప్రయాణించడం ఇదే మొదటిసారి. లోగడ చాలాసార్లు విమానం యెక్కింది. అయితే ప్రతిసారీ ఆమెవెంట తల్లిదండ్రులిద్దరూ వున్నారు. ఇప్పుడు తనొక్కతే బయలుదేరింది.

సునీత తండ్రి రాజేశ్వరరావు లక్షాధికారి. మద్రాసులో పెద్ద గుడ్డలషాపు వున్నది. ఎలక్ట్రికల్ సామాన్లమ్మే మరో

దుకాణం వుంది. ఇవిగాక మరికొన్ని పెద్దపెద్ద కంపెనీల్లో షేర్లు వున్నయ్ ఆయనకు. రెండు మేడలు, మూడు కార్లు వున్నయ్. ముగ్గురు మగపిల్లలూ, ఒకే ఒక ఆడపిల్ల సునీత వారి సంతానం.

సునీత కాలేజీలో బి. ఏ. ఫైనల్ ఇయర్ చదువు తోంది. కలం స్నేహితులంటే ఆమెకు ఎంతో ఉత్సాహం. దేశీ, విదేశీ కలం స్నేహితులతో ఆమె ఉత్తర ప్రత్యుత్త రాలు జరుపుతూండేది.

అలాంటి కలం స్నేహితురాండ్రలో ఉష ఒకామె. ఆమె తండ్రి రేణిగుంటలో ఎయిర్ లైన్స్‌లో పని చేస్తుండే వాడు. చాలారోజుల ఉత్తర ప్రత్యుత్తరాల అనంతరం ఉష ఆమెను తమ ఊరు రమ్మనీ, అక్కడనుంచి తిరుపతి వెళ్ళి శ్రీ వెంకటేశ్వరస్వామిని దర్శించుకుని, ఇంకా చుట్టు పట్ల వున్న అనేక పుణ్యక్షేత్రాలు చూడవచ్చనీ ఆహ్వా నించింది.

నిజానికి ఆ ఉత్తరం వచ్చిన చాలా నెలల వరకూ సునీత ప్రయాణమవటానికి వీల్లేకపోయింది. ఆమె తల్లిదండ్రు లకు ఆమెను ఒంటరిగా పంపటం ఇష్టంలేక పోవటమే దీనికి కారణం. కాని సునీత పదే పదే ఒత్తిడి చేయటం వలన వాళ్ళు చివరకు అంగీకరించారు.

బస్‌లోగానీ, రైల్లోగానీ, లేదా విమానంలో నయినా సరే అతిగా వాగకూడదనీ, తనో పెద్ద లక్షాధికారి కుమార్తెనని చుట్టూ వున్నవాళ్ళకు తెలిసేలా అహంభా వంగా ప్రవర్తించవద్దనీ ఆమె తల్లి బోధ చేసింది. ఈ ప్రపంచంలో అనేక రకాల వ్యక్తులు – మంచివాళ్లూ, దొంగలూ, హంతకులూ వుంటారనీ, దుర్మార్గుల దృష్టిలో తను పడకుండా వుండాలంటే, వీలైనంతవరకూ మితభాషి గాను, ఎవరితోనూ కలవకుండా వుండటమే మేలని

ఆమె తల్లి ఉవాచ.

కిటికీలోంచి క్రిందకు చూస్తూ, బొమ్మరిళ్ళలాగున్న ఇళ్ళను చూస్తున్నదేగాని, నిజానికి ఆమె ఉషని గురించే ఆలోచిస్తున్నది.

తనీ ఫ్లైట్‌కి వస్తున్నానని ఆమెకు ముందుగానే తెలియజేసింది తను. ఆమెగూడ తన తండ్రిని వెంటబెట్టుకుని విమానాశ్రయానికి తనను రిసీవ్ చేసుకోవటానికి వస్తానని వ్రాసింది.

ఉత్తరాలద్వారా ఒకరి అభిరుచుల్ని మరొకరు తెలుసుకుని ఆ తర్వాత వ్యక్తిగతంగా కలుసుకోవటం అదో సరదాగా వుంటుంది.

ఉష తనను ఆదరంతో ఆహ్వానిస్తుందనీ, వుత్తరాల్లో వ్రాసినంత చలాకీగా మాట్లాడుతుందనీ ఊహించుకుంటోంది సునీత. అలాగనుక వాస్తవంగా లేదో, తనకు బోర్ కొట్టి చచ్చిపోవాల్సిందే అనుకుంది.

ఎయిర్ హోస్టెస్ కంఠం ఎనౌన్సర్‌లో వినబడింది. విమానం పంక్చువల్‌గా రేణిగుంట చేరబోతోందనీ, అక్కడికి దగ్గరలోనే హిందువులకు అతిపవిత్రమైన కళ్యాణ వెంకటేశ్వరుడు విచ్చేసిన పుణ్యక్షేత్రం వుందనీ చెప్పింది. ఆ తర్వాత సీటు బెల్ట్సు కట్టుకోవలసిందని చెప్పడం విని సునీత సీట్ బెల్టుని తన నడుముచుట్టూ బిగించుకుంది.

ఆమె ప్రక్క సీట్లో కూర్చున్న మరో వయసు మళ్ళిన వ్యక్తి సీటుబెల్టు తగిలించుకోకుండా అలానే కూర్చున్నాడు. పైగా సునీతవంక చూసి "విమానం ఎక్కడం ఇదే కొత్తా?" అని అడిగాడు నవ్వుతూ.

సునీత బదులివ్వకుండా అలాగే వుండిపోయింది.

విమానం రేణిగుంట విమానాశ్రయంలో దిగుతూండగా సునీత అనుకుంది మనసులో, నాకోసం ఉష ఎయిరో

డ్రోమ్‌కి వస్తుందో రాదో, ఆమె రాకపోతే నేనేం చేయాలి, ప్లేన్ దిగీ దిగంగానే తనామెను గుర్తు పట్టగలదో లేదో అని అనుమానించింది. ఉష ఫోటో తన దగ్గరుంది. తన ఫోటోను ఉషకి పంపింది. వాటి సాయంతో ఒకరినొకరు తేలిగ్గా గుర్తించుకోవచ్చు అనుకుంది మళ్ళీ.

ప్లేన్ నుంచి దిగుతూనే దూరంగా గేటు వెంబడే బారులు తీరివున్న జనంవంక చూసింది.

ఎవరో అమ్మాయి తనవంకే చేయి వూపుతూండడం గమనించింది. ఆమె హృదయం ఆనందంతో వురకలు వేసింది. సందేహంలేదు! ఆమే ఉష.

గేటుదాటి లాంజ్ లోకి అడుగు పెట్టంగానే ఉషవచ్చి ఆమెను కౌగలించుకుంది.

"ఫోటోలోకన్న ఎంతో అందంగా వున్నదే!" ఎవరిదో కంఠం వినిపించి సునీత అటుచూసింది.

"నాతోపాటు మా అమ్మా, నాన్న, మా బావ వచ్చారు నిన్ను రిసీవ్ చేసుకునేందుకు. నీవు రాసే వుత్తరాలు మా నాన్న అభిమానాన్ని చూరగొన్నయ్. అంత బాగా రాసే అమ్మాయిని ముఖాముఖి చూడాలని ఆయన ఆరాటం!" అంటూ సునీతకు వారిని పరిచయం చేసింది.

"నీరాక మాకు చాలా ఆనందాన్ని కలిగించిందమ్మా!" అన్నాడు ఉష తండ్రి నీలకంఠం.

"థాంక్స్ సార్!" సునీత ఆనందంగా అంది. "నేను ఇదివరలోనే వచ్చి వుండాల్సింది. ఏదీ మా నాన్నగారు ఒక పట్టాన నాకు పర్మిషన్ ఇవ్వలేదు!"

"పిల్లలంటే అలా వుండాలి! అందం, ఐశ్వర్యంవున్నా తల్లిదండ్రులమాట పాటించే వినయంగూడ వుండాలి పిల్లలకు" ఉష తల్లి కమలాదేవి తన కూతురివంక చూస్తూ అంది.

"ఆమె ఇంటికి ఫోన్ చేస్తుందేమో కనుక్కోండి!" ఉష బావ కరుణాకరం నిదానంగా అన్నాడు.

"అవునమ్మా! నీవు క్షేమంగా చేరినట్టు వాళ్ళకు తెలియ జేస్తే మంచిది. లేకపోతే నీ గురించి వాళ్ళు గాభరా పడ తారేమో!"

ఎయిర్‌పోర్ట్ నుంచి మద్రాసుకు ట్రంక్ కాల్ చేసి మాట్లాడింది సునీత.

"అమ్మా! సునీతా! సురక్షితంగా చేరావా తల్లీ!" సునీత తల్లి కాంతం అడిగింది.

"క్షేమంగానే చేరానమ్మా! ఉష, ఆమె తల్లిదండ్రులూ నన్ను రిసీవ్ చేసుకోను వచ్చారు ఎయిర్‌పోర్టుకు!"

"అలాగా! రేణిగుంటలో వారి ఇల్లు చేరాక ఒక వుత్తరం గూడ వ్రాసిపడెయ్. వాళ్ళనేం అల్లరి పెట్టక ఈ రెండు మూడు రోజులూ జాగ్రత్తగా మసలుకో! వాళ్ళందర్నీ అడిగానని చెప్పు!"

"అలాగేనమ్మా! ఇక వుంటాను!" అంటూ ఫోన్ పెట్టేసింది సునీత.

"ఇక్కడనుంచి మనిల్లు యెంతదూరమండీ!"

"ఉంటుంది మూడుమైళ్ళు! కానీ ఈ విషయం నీకు చెప్పడానికి చాల విచారంగావుంది! ఇక్కడికి పదిమైళ్ళ దూరంలో తొండవాడ అనే గ్రామంలో మా అమ్మ జబ్బుగా వున్నదని కబురు వచ్చింది. మేం నిన్ననే అక్కడకు వెళ్లాల్సిన వాళ్ళం. కాని నీ రాకగురించి ఆగిపోయాం. మనం నేరుగా ఇప్పుడు మా అమ్మని చూడటానికి వెడుతున్నాం. అక్కడ రెండురోజులుండి, మళ్ళీ మన ఊరు వచ్చేద్దాం!"

"అయ్యో! అలాగాండి! నేను రాకుండా ఆగిపోయినా బాగుండేదేమో! మిమ్మల్ని చాల ఇబ్బందిలో పడేసి

నట్టున్నాను!'' అంది సునీత నొచ్చుకుంటూ.

"ఫర్వాలేదులేమ్మా! ఒక్కొక్కప్పుడు అన్ని అవసరాలు అలా కలిసొస్తుంటయ్. మనం చేయగలిగేది ఏమీ ఉండదు, అటువంటప్పుడు!'' అన్నాడు నీలకంఠం.

"ఇక బయలుదేరుదామా?'' అని అడిగాడు కరుణాకరం లగేజిలోంచి సునీత బ్రీఫ్ కేసుల్ని పికప్ చేసి తెచ్చి.

"పోనీ రాత్రికి తిరుగు ప్లేన్ వుందేమో కనుక్కొని వెళ్ళిపోతాను! లేదా ఏదన్నా హోటల్లో ఈ రాత్రికి వుండిపోయి తెల్లారిన తర్వాత ఫ్లైట్ కన్నా తిరిగి మద్రాసు చేరతాను!''

"అబ్బెబ్బె! ఎందుకండీ! మా ఉష మీ రాకకోసం చాలకాలంనుంచి ఎదురుచూస్తోంది. మీ కలయికను వృథా పుచ్చటం మాకెవరికీ ఇష్టంలేదు!''అన్నాడు కరుణాకరం.

"ఆమె తల్లి వయోవృద్ధురాలు!వృద్ధాప్యంవల్ల ఆరోగ్యం సరిగా వుండదు. అప్పుడప్పుడు ఆమె కిది పరిపాటే! అంతగా అవసరమైతే ఆమెను అమెరికన్ హాస్పటల్లో చేర్పించి, మనం తిరిగి రేణిగుంటకు వచ్చేయచ్చు రెండు రోజుల్లో!'' నీలకంఠం ఆమెను వారించాడు.

కమలాదేవి తల్లి చావుబ్రతుకుల్లో వుంది. తనుగూడ ఇప్పుడే వచ్చి దిగింది. తనంటే ఎంత అభిమానం వుండకపోతే వాళ్ళంతా తనకోసం విమానాశ్రయానికి వచ్చి రిసీవ్ చేసుకుంటారు! కనీసం ఆ అభిమానం గురించైనా వాళ్ళను చిన్నబుచ్చటం మంచిది కాదనిపించింది ఆమెకు.

వెనక్కు తిరిగి వెళ్ళిపోతానని మరోసారి అంది సునీత.

వాళ్ళందరూ ఏకగ్రీవంగా ఆమె అంత పని చేయటానికి ససేమిరా వీల్లేదని వారించారు. సునీత చేసేదేమీ లేక వాళ్ళతో బయలుదేరింది.

సునీత, ఉష, ఉష తల్లీదండ్రీ, ఆమె బావ అందరూ

కారులో కూర్చున్నారు. కారు బయలుదేరింది.

తారు రోడ్డుమీద నున్నగా సాగిపోతోంది కారు. రోడ్డు కిరువైపుల ఎర్ర నేల బీళ్ళూ, దూరంగా సినిమాలో సెట్టింగ్ లా పచ్చగా ఎర్రగా కనుపించే కొండలూ తప్ప మరేం కనుపించలేదు సునీతకు. అక్కడక్కడా పాడుబడి పోయిన బ్యారెన్ బిల్డింగ్ లూ, నీళ్ళులేని చెరువుకట్టలూ గూడ ప్రత్యక్షమయినయ్.

"వచ్చే సెంటర్ లో ఆపు మామయ్యా!" అన్నాడు కరుణాకరం.

"ఓ! నీకు వచ్చేవారమే కదూ కాలేజీలో పరీక్షలు! బాగా చదువుతున్నావా?" నీలకంఠం అడిగాడు.

"బాగానే చదువుతున్నాను!" అన్నాడు కరుణాకరం.

"బావ ఎంత బాగా చదువుతున్నా డనుకున్నావ్!" అంది ఉష కళ్ళు త్రిప్పుకుంటూ.

ఆమె మాటల్లో ఆదరకమైన ఈసడింపు ప్రతిధ్వనించింది.

"నువ్వేం సిఫార్సు చేయనక్కర్లేదులే!" కరుణాకరం ఉష వంక చిలిపిగా చూస్తూ అన్నాడు.

తారు రోడ్డుమీదనుంచి మలుపు తిరిగి డొంక రోడ్డు మీద కారు ఆగింది.

కరుణాకరం కారులోంచి దిగాడు.

"మీ బావ మనతో రావటం లేదా ఏం?" సునీత అడిగింది.

"లేదండీ! ఇవాళ కాలేజీ వుంది. రేపు ఆదివారంనాడు కలుస్తాను" అంటూ కరుణాకరం బయలు చెప్పాడు.

"ఇదిగో కరుణాకరం! మా ఆఫీసులో మా అసిస్టెంట్ వుంటాడు. నేను అవతల పేషెంట్ ప్రమాద పరిస్థితుల్లో వుంటే చూడటానికి వెళ్ళానని అతగాడికి కబురు చెబు

తావు కదూ!" నీలకంఠం అడిగాడు.

"అలాగే మామయ్యా! మీ డైరెక్టర్‌తో గూడ చెబుతానులే! తొందరపడి తిరిగి రాకుండా, ముసిలావిడకి నెమ్మదించేదాకా వుండి తర్వాతనే రండి!"

"ఆ విషయం నీవు చెప్పాలటరా!"

కరుణాకరం రోడ్డు కవతలగా నిలబడ్డాడు. కారు ముందుకు సాగింది.

"ఆంధ్రప్రభ వీక్లీలో సీరియల్ గురించి మన వుత్తరాల్లో చర్చించుకున్నాం గదూ? వాటిగురించి నీతో ముఖాముఖి మాట్లాడాలని ఆ వుత్తరాలు గూడా తెచ్చాను" అంది సునీత.

ఉష ఆదోలా ముఖం పెట్టింది. "ఓ! అదా! ఆ సీరియల్ రానురాను ఒట్టి చెత్తక్రింద తయారవుతోంది. అందుకే తర్వాత చదవటం మానేశాను!" అంది.

"అదేమిటి? సీరియల్ రానురాను ఎంతో ఇంటరెస్టింగ్‌గా వుంటే, బాగాలేదంటూ వేమిటి!"

"ఏమో నాకు నచ్చలేదు! అంతే!" అంది ఉష.

ఉత్తరాల్లో ఎంతో సౌమ్యంగా, వినయంగా రాసే ఉషేనా ఈమె అనుకుంది సునీత.

ఉష కనుపించగానే తనతో వసపిట్టలాగే వాగేస్తుందని ఆశించిన సునీతకు చాలా ఆశాభంగం కలిగింది. తను పది అడిగినా ముభావంగా జవాబు చెబుతున్నది. ఈమెకు తను రావటం ఇష్టంలేదా? పైగా తన వంక ఈర్ష్యగా చూస్తున్నది.

"మా ముసలమ్మకు జబ్బుచేయకుండా వుంటే నేనూ మా బావతో వెళ్ళాల్సినదాన్ని!" అంది ఉష.

ముసలిది మంచాన పడటం వలన తన ప్రేమ ప్రయాణం వాయిదా పడిందని ఉషకి విచారంగా వుంది కాబోలు,

లేకపోతే తనతో ఇంకా కలుపుగోలుతనంగా వుండేది అనుకుంది సునీత.

"అలాగా!" అంది నవ్వుతూ సునీత.

"మా అమ్మకు తన తల్లి అంటే ఎంత అభిమానమో చెప్పలేం అనుకో. ఆవిడ అసలు తల్లికాదు. సవతి తల్లి. అయితేనేం, ఆమె మా అమ్మను ప్రేమగా చూసి వుంటుందేమో, ఆమెకు ఏదన్నా కాస్త బాధ కలిగితే మా అమ్మ విలవిల్లాడిపోతుంది."

"వెనకటి వాళ్ళ ప్రేమలు అలాగే వుండేవి!"

"కాని ఆమెను చూస్తే నాకుమాత్రం భలే మంట అనుకో. ఆమెదగ్గర బోలెడంత డబ్బు వుండాలి! కాని పిసినారి. తనుగూడ సరిగా తిండి తినదు. ఆమె ఇల్లు నీవే చూద్దువుగాని! భూతాల కొంప అనుకో! ఆ పాడబడ్డ ఇల్లు కాస్త రిపేరు అన్నా చేయించదు. కనీసం సున్నం కొట్టించిన పాపాన పోలేదు" ఉష చెప్పుకుపోతోంది.

"అలా అనకు! వెనకటివాళ్ళు ఎంతో కష్టపడి సంపాదించి దాన్ని కూడబెట్టి వుంటారు. మనం ఖర్చుపెట్టినంత దుబారాగా వాళ్ళు డబ్బు ఖర్చుబెట్టలేరు. ఖర్చుచేయబోయే ప్రతి పైసాకు ప్రాణం తీసుకుంటారు!" సునీత పెద్ద ఆరిందాలా అన్నది.

"బాగా చెప్పావమ్మా!" అని మెచ్చుకుంది కమలాదేవి.

తల్లి వంక కొరకొర చూసింది ఉష. "వాళ్ళమ్మని అన్నానని ఎంత వుక్రోషమో చూశావా? ఆ ముసలావిడ ఎంత పిసినారో నీవే చూస్తావుగా. ఆమె తాలుకు డబ్బు యాభైవేల రూపాయలు ఇంట్లో ఎక్కడో దాచిపెట్టిందట. ఇంట్లో వున్న ఫర్నిచర్ మొత్తం అమ్ముకుంది; తనకు జరగటం లేదని! నీ కళ్ళతో నీవే చూద్దువు, ఇల్లు ఎంత బోసి పోతున్నదో ఫర్నిచర్ అదీ లేకపోవటం మూలాన్న!"

"పాపం! డబ్బంటే ఆమెకు అంత ప్రాణం అన్న మాట!" సానుభూతిగా అంది సునీత.

## 2

కారు చిన్నపల్లె దాటి మైలుదూరం వచ్చింది. చీకటి పడడం మూలాన, కారు హెడ్ లైట్ వెలుగులో కనబడే రోడ్డు మినహా మరేం కనిపించడం లేదు. చుట్టూ కమ్ముతున్న చీకటిలో సుదూరంగా అక్కడక్కడా ఒకటీ రెండు దీపాలు మిణుకు మిణుకు మంటూ కనిపించీ కను పించకుండా ఉన్నాయ్.

"మీ అమ్మమ్మ తన ఇల్లు ఊరికి దూరంగా కట్టుకుం దేమిటి?" సునీత అడిగింది.

"ఇది ఆమె తాతలకాలం నాటిది. అప్పుడే యింటి చుట్టూ పొలాలు వుండేవి. క్రమేపీ వానలు పడక, రైతు లందరూ ఈ భూముల్ని బీడు పెట్టేసారు. మా అమ్మ గత మూడు నెలలుగా అమెరికన్ హాస్పిటల్ లో ట్రీట్ మెంట్ తీసుకుంది. తనింకా ఎక్కువకాలం బ్రతకనేమో అని భయం. తన ప్రాణం తన స్వంత యింట్లో పోవాలని ఆమె కోరిక. అందుకే హాస్పిటల్ నుంచి యింటికి తెచ్చే దాకా ఒకటే పోరు పెట్టిందనుకో!"! కమలాదేవి నిదా నంగా చెప్పింది.

"పాపం!" అంటూ సానుభూతి చూపింది సునీత.

కారు లైట్ల వెలుగులో రెండంతస్తుల పాత మేడ కనుపించింది సునీతకు. దాన్ని చూస్తుంటే, ఆమెకు సిని మాల్లో చూపే దయ్యాల మేడలు గుర్తుకు వచ్చినయ్. ఈ మేడగూడా వాటికి తీసిపోదు అనుకుంది. మేడ గోడలనుంచి సున్నపు పెళ్ళలు విరిగి పడిపోయి ఉన్నయ్. సున్నం కొట్టి ఎన్నేళ్ళు అవుతుందో, గోడలు నల్లబడి ఉన్నయ్.

ఇంటిచుట్టూ పొదలూ, తీగెలూ దట్టంగా పెరిగి ఉన్నాయ్. లాన్‌లో గడ్డిని ఈ మధ్యనే కత్తిరించినట్టుగా కనుపించినా, దుబ్బలు దుబ్బలుగా గడ్డి పెరిగింది. ఆ యింటికి మైలుదూరం లోపల ఎక్కడా ఇల్లు అనేది లేదు.

మేడకు ఒకప్రక్క గ్యారేజ్ వుంది.

ఆ దృశ్యానికి తగ్గట్టుగానే ఆ యింట్లో దీపాలు ఏడుస్తూ వున్నాయ్. ప్రతిగదికీ మెర్క్యురీ లైట్లు పెడితే కొంచెంగా యింటికి శోభ వచ్చేది. కాని ఆ యింటిలో భీభత్స వాతావరణానికి సాయపడేందుకే అన్నట్టుగా నలభై క్యాండిల్స్ బల్బులు మందకొడిగా వెలుగుతున్నయ్.

కారు దిగి వెనుక డోర్ తెరిచాడు నీలకంఠం.

లోపల్నుంచి ఒక పనిమనిషి బయటకు పరుగెత్తుకు వచ్చింది.

"హమ్మయ్య! వచ్చారా అమ్మగారూ! ఆ పెద్దామెతో వేగలేక ఛస్తున్నాను!" అంది ఆమె, డిక్కీనుంచి లగేజ్ అందుకుంటూ.

"మీరు అమ్మాయిని లోపలకు తీసుకురండి. నేను అమ్మకెలా వుందో చూసి వస్తాను!" అంటూ కమలాదేవి లోపలకు నడిచింది ఆత్రతగా.

నీలకంఠం సునీత, ఉషలు తన వెనుకే రాగా యింట్లోకి వెళ్ళాడు. క్రింది భాగంలో అటు రెండుగదులూ, ఇటూ రెండుగదులూ, మధ్యలో పెద్ద హాలు వున్నది.

హాల్లో పాతబడ్డ కుర్చీలు అయిదున్నయ్. వాటి మధ్యగా గుండ్రటి స్టూలు వుంది.

ఆ ఫర్నిచర్‌ని చూస్తూనే ఉష చెప్పినట్టుగా, ముసలిది చాలా పిసినారి అయివుంటుంది అని అనుకుంది సునీత.

కుడివేపుగా వున్న గదుల్లో ఒకటి సునీతకు కేటాయించబడింది. ఆమె గదిలో మంచం, పరుపూ, టేబుల్‌కి బిగించబడిన అద్దం వున్నయ్.

మిగతా గదుల్లో మాత్రం ఫర్నిచర్ కూడ లేదు.

"ఈ గది మా అమ్మమ్మది. ఆమె వయసులో వున్నప్పుడు దీన్నే వాడుకున్నదట. మళ్ళీ ఆ గదిని వుపయోగించే అదృష్టం నీకు కలిగింది" అన్నది ఉష, సునీత వంక చూస్తూ.

సూట్‌కేస్ తెరచి తన గుడ్డలను కొన్నిటిని తీసి బయట పడేసింది సునీత.

అంతలో పనిమనిషి వచ్చింది. "అమ్మగారికి వేన్నీళ్ళు కాచాను. స్నానం చేద్దురు కాని రండి!" అంది సునీత నుద్దేశించి.

విమాన ప్రయాణం ఎంతో సుఖంగా సాగినా, చాలా సేపు పట్టిన కారు ప్రయాణంతో సునీత డస్సిపోయింది.

వేడినీళ్ళ స్నానం తరువాత ఆమె బడలిక కొంచెం తగ్గింది.

నీలకంఠం కారు గ్యారేజీలో పెట్టి దానికి తాళం వేసి లోపలకు వచ్చాడు.

"పాపం! ఆ అమ్మాయి ప్రొద్దుననంగా తిన్నదేమో భోజనం! త్వరగా వడ్డించమను మీ అమ్మతో" అన్నాడు ఉషతో.

"వంట అంతా రాములు చేసే వుంచింది నాన్నా!" ఉష సమాధానం విని నీలకంఠం కుర్చీలో జారగిలబడి, ట్రాన్సిస్టర్ రేడియోని ఆన్ చేశాడు.

సునీత తన దుస్తులు మార్చుకుని హాల్లోకి వచ్చేసరికి కమలాదేవి మేడమెట్లు దిగుతూ కనుపించింది.

"ఎలా వుందండి మీ అమ్మగారికి?" సునీత అడిగింది.

"ఇప్పుడే నిద్రపుచ్చి వస్తున్నానమ్మా! ఉషా! పని మనిషి రాముల్ని వడ్డించమను త్వరగా!"

హాలు తర్వాత వంటగది, ప్రక్కనే వరండా వుంది. అక్కడో పాతపడిన టేబుల్ వుంది. రాములు టేబుల్ చుట్టూ కుర్చీలు వేసి భోజనం వడ్డించింది.

"మమ్మీకి స్లీపింగ్ టాబ్లెట్స్ అయిపోయాయి. రేపు టౌన్‌కి వెళ్ళి పట్టుకురండి, మర్చిపోకుండా! అలాగే డాక్టర్ నరసింహంగార్ని గూడ వెంట తీసుకురండి. మరో సారి ఆమెను ఎగ్జామిన్ చేయిద్దాం!" కమలాదేవి భర్త నుద్దేశించి అన్నది.

"ఇవాళ్టికన్నా వున్నాయా స్లీపింగ్ పిల్స్! లేకపోతే ఈ రాత్రంతా నానాగోల చేసి యింటిని ఒక కొలిక్కి తెస్తుంది!" నీలకంఠం ఆదుర్దాగా అడిగాడు.

"ఈ రాత్రికి సరిపడా వున్నయ్‌లెండి!"

"పాపం! ఈ పాడుబడ్డ కొంపలో సునీతను ఇబ్బంది పెట్టాల్సి వచ్చింది!" కమలాదేవి నొచ్చుకుంది.

"ఫర్వాలేదులెండి! నా గురించి మీరేం శ్రమపడద్దు. ఆమె బాగోగులు చూడండి ముందు!"

కిటికీలోంచి నల్లటిపిల్లి "మ్యావ్!" అంటూ క్రిందకు దూకి వంటగదిలోకి పరుగెత్తింది.

"అది మీ పెంపుడు పిల్లా?" సునీత అడిగింది.

"ఛీ! కాదు! ఎక్కడిదో వచ్చినట్టుంది. నాకూ మా అమ్మకూ పిల్లులంటే అసహ్యం! రాములమ్మా! వంట యింట్లోకి పిల్లి దూరింది. దాన్ని తరిమెయ్!" కమలాదేవి అసహ్యంగా అరిచింది.

సునీతకు పిల్లులన్నా, కుక్కపిల్లలన్నా ఎంతో యిష్టం. ఆ పిల్లిని తన ఒళ్ళోకి తీసుకుని దాని తల నిమురుదామనుకున్నది. కాని ఇక్కడ వీళ్ళకెవరికీ పిల్లిని చూస్తే

పడదు కాబోలు అనుకుని తన ప్రయత్నాన్ని విరమించుకుంది.

భోజనాలయ్యాక నీలకంఠం, ఉష, కమలాదేవి హాల్లో కూర్చుని ఆరోజు పేపర్లోని విషయాల గురించి పిచ్చాపాటీ మాట్లాడుకోసాగారు. సునీత తనకు నిద్రవస్తున్నదని అందరికీ 'గుడ్ నైట్' చెప్పి తన గదిలోకి వెళ్ళింది. తలుపులు మూయబోతూండగా మేడమీదనుంచి కీచుగొంతుతో పెద్దగా కేక వినిపించింది, సునీత గుండెలవిసిపోయేలా.

"ఏమేవ్ కమలా! యెక్కడ చచ్చావే! త్వరగా రావే! నా ప్రాణం పోతోందే!"

మంచంలో తీసుకుంటున్న ముసలమ్మ అరుపు కాబోలు అనుకుంది సునీత, తలుపులు మూయకుండా అలాగే ఆగిపోయి.

కమలాదేవి గాభరాగా కుర్చీలోంచి లేచి మెట్లకేసి పరుగెత్తింది.

"చచ్చాం పో! ఇక ఈవిడ అరుపులతో మనం నిద్రపోయినట్టే!" ఉష విసుగ్గా అంది.

సునీతకు ఒంటరిగా గదిలో పడుకోవటానికి భయం వేసింది. పడుకునే ప్రయత్నం విరమించుకుని, ఆమెగూడ హాల్లోకి వచ్చి కుర్చీలో కూర్చుంది.

పదినిముషాలు గడిచాక కమలాదేవి కొయ్యతో చేసిన మెట్లమీదనుంచి దిగి వచ్చింది.

"ఇక ఫర్వాలేదు. మిగిలిపోయిన స్లీపింగ్ టాబ్లెట్స్ అన్నీ మందులో కలిపి త్రాగించాను. తెల్లారేదాకా లేవదు" కమలాదేవి అనునయంగా చెప్పింది.

కాసేపు న్యూస్ పేపర్ తిరగేసి మళ్ళీ తన గదికి చేరుకుంది సునీత. తలుపు గడియపెట్టి, బెడ్ మీద వాలిపోయింది.

ఒక క్షణం క్రితం అలసటగా ఫీలయిన సునీత నిరాశతో నిట్టూర్చింది. ఆమెకు నిద్రరావటంలేదు. తను ఎంతో సరదాగా, తన కలం స్నేహితురాలితో గడుపుదామనుకుని వచ్చింది. కాని ఇక్కడ మరో విచారకరమైన దృశ్యం యెదురయింది.

బెడ్ మీద అసహనంగా అటూ యిటూ పొర్లింది. కనీసం ఉష బావ అన్నా వుంటే కొంత కాలక్షేపం జరిగేదేమో! కమలాదేవి యెప్పుడూ వంటపనిలోనో, లేక తన తల్లికి సేవచేస్తూనో వుంటుంది. నీలకంఠం అ సమానమూ ఏవో పుస్తకం చదువుకుంటూనో లేక చెట్లకు పాదులు తీయటమో చేస్తూ వుంటాడు.

తను యెన్నో కబుర్లు చెప్పి అంతకు రెట్టింపు కబుర్లు ఉష నోటినుంచి విందామని తను ఆశిస్తే, ఉష మాటలు రాని మొద్దులా, అ సమానమూ తనకేసి అదోలా చూడటం తప్పితే, తన అమ్మమ్మను సాధించటం మినహా తనతో మాట్లాడనే మాట్లాడదాయె!

మరునాడు శనివారం అన్న సంగతి అప్పుడు గుర్తుకు వచ్చింది సునీతకు. శనివారంనాడు, వుదయమే తలారా స్నానంచేసి గుడికి వెళ్ళి రావటం ఆమె అలవాటు.

రేపు ఏదన్నా గుడికి వెళ్దామనుకున్నా గానీ, ఈ ఇల్లు నాగరిక ప్రపంచానికి సుదూరంగావుంది. మరి, చేరువలో ఏదైనా దేవాలయం వుందో లేదో! రేపు కమలాదేవిని అడగాలి. ఒకవేళ దగ్గరలో ఏదీ లేకపోతే కొంచెం దూరమయినా, కారు వేసుకుని వెళ్ళి తీరాలి. తనకు డ్రయివింగు వచ్చుగనుక, తనొక్కతే అయినా వెళ్లి రాగలదు అనుకుంది.

ఆలోచనల్లోనే ఆమె నిద్రలోకి జారుకుంది.

# 3

బాగా పొద్దు ఎక్కాక సునీత నిద్రలేచింది. దొడ్లోకి వెళ్లి బావి దగ్గర ముఖం కడుక్కుంది.

"ఏమండీ! ఇవాళ శనివారం! నేను తలనిండా స్నానం చేసి యేదైనా గుడికి వెళ్లాల్సివుంది. ఈ చుట్టుపట్ల యేదైనా గుడి వుందా?" అని కమలాదేవిని అడిగింది సునీత.

"గుడికి వెళ్లాలా? దగ్గరలో యేదీ లేదమ్మా! నాలుగు మైళ్ళు వెడితే మరో గ్రామం వస్తుంది. అక్కడ రామాలయం వుంది. కాని మీరు అంతదూరం యెలా వెళ్ళగలరు?"

"దానిదేముందండి! కాలున్నదిగదా! నాకు డ్రయివింగు వచ్చు. నేనూ ఉష కలసి వెళ్ళొస్తాం!"

కమలాదేవి ఒక నిముషం ఆలోచించింది. "మరేం లేదమ్మా! ఈ పల్లెటూళ్ళలో వుండే మగపిల్లలు ఒట్టిరౌడీ వెధవలు. ఒంటరిగా ఆడది, అందునా బస్తీ అమ్మాయి కనిపిస్తే అల్లరి చేస్తారు. అదీ నా భయం!"

"మీరు ఆ విషయంలో నిశ్చింతగా వుండండి. నేను త్వరగా స్నానంచేసి వస్తాను. ఉషనుగూడ రెడీ అవమనండి!"

"అదా! తొమ్మిదయినా దానికి తెల్లారదు. అది లేచి స్నానం చేసి ముస్తాబయేసరికి పొద్దు వాలిపోతుంది గూడాను."

"ఉష విషయం నాకు వదిలేయండి పిన్నిగారూ! దాన్ని నిద్రలేపి తీసుకువెళ్ళే పూచీ నాది!"

"సరేనమ్మా! ఏదో పెద్దదాన్ని నాభయం వెల్లడించాను. ఆపైన మీ ఇష్టం!"

సునీత వుషారుగా ఉష గదిలోకి వెళ్ళింది. ఎంతో శ్రమపడ్డమీదటగాని ఉష లేవలేదు. తను వెళ్ళి స్నానం

చేసివచ్చి, ఉషని రెడీ చేసేసరికి సునీతకు తలప్రాణం తోకకు వచ్చింది.

అనుక్షణమూ యేదో సాకుచెపుతూ సునీత ప్రయాణాన్ని వాయిదా వెయ్యాలని చూసింది కమలాదేవి. కాని సునీత ప్రతి వంకకు సరైన సమాధానం చెప్పి, ఆమె అభ్యంతరాల్ని త్రోసిపుచ్చింది. నీలకంఠం తను గూడ వాళ్ళతో వస్తానన్నాడు.

"మీకెందుకండీ శ్రమ! నేనూ, ఉష యిద్దరం వెళ్ళి వస్తాములెండి" అంది సునీత.

నీలకంఠం స్వతహా మెతక మనిషి. మరో మాట చెప్పకుండా కారుతాళాలు ఆమెచేతి కిచ్చాడు.

కారు కదిలిపోయింది. వాళ్ళు వెళ్ళిపోయాక కమలాదేవి భర్తమీద ఇంత యెత్తున లేచింది.

"మీరన్నా వాళ్ళని ఆపగూడదూ? సమయానికి వాడు గూడ లేడు! అమ్మాయి క్షేమంగా వెనక్కి తిరిగి వచ్చేదాకా ప్రాణాలు ప్రాణాల్లో వుండవు."

"మహంకాళిలాగ నామీద యెగరకపోతే, వాళ్ళని నువ్వే ఆపలేకపోయావ్!" నీలకంఠం నిదానంగా అన్నాడు.

"కారు చెడిపోయిందనో, టైర్లలో గాలి లేదనో చెపితే సరిపోయేది కదా!"

"ఆ మాత్రం తెలివి నాకేడిస్తే, యిన్నేళ్ళు నీతో కాపరం చేసేవాడ్నా!"

"ఇప్పుడు మాత్రమేం? ఈపని పూర్తికాగానే ఎవరి వాటా వాళ్ళు పుచ్చుకుని విడిపోదాం!" అంది కమలాదేవి.

"అంతా సాఫీగా జరగాలికదా? ఎక్కడన్నా కథ అడ్డం తిరిగిందంటే అందరం జైలులో కూర్చుంటాం!"

"చాల్లే! నోర్ముయ్! శుభం పలకరా పెళ్ళికొడకా

అంటే పెళ్ళికూతురు ముందేది అన్నాట్ట వెనకటికి నీలాంటి వాడే!''

వాకిట్లో మోటారుసైకిలు వచ్చిన శబ్దం వినిపించింది.

''కరుణాకరం వచ్చినట్టున్నాడు!'' అన్నాడు నీలకంఠం.

ఇద్దరూ మౌనంగా, భయంగా, బిక్కుబిక్కుమంటూ వాకిలివంక చూస్తూ వుండిపోయారు.

బూట్లు టకటక శబ్దంచేసుకుంటూ కరుణాకరం లోపలకు వచ్చాడు.

''ప్రతిమల్లాగు అలా కూర్చున్నారేం? సునీత ఏదీ? ఆమె కేమన్నా అయిందా?'' అనడిగాడు ఆదుర్దాగా.

''అదేం లేదులే!'' అన్నాడు నీలకంఠం.

''మరింకేమిటి?''

''సునీత రామాపురం గుడికి వెళ్లొస్తానని వెళ్ళింది, ఉషతో!'' అన్నది కమలాదేవి.

కరుణాకరం ముఖం కోపంతో జేవురించింది.

''మీ కేమన్నా బుద్ధి వుందా అని? ఆ అమ్మాయిని బైటికి ఎలా పంపించారు? ఇప్పుడేదన్నా కథ అడ్డం తిరిగితే మన పని ఏమవుతుంది?'' అంటూ చిందులు త్రొక్కాడు.

''ఏం చేయను చెప్పు! అప్పటికీ నేను ఒకటికి పదిసార్లు అభ్యంతర పెట్టాను. కాదని ఆమె వెళ్ళింది. అయినా రామాపురం వేపు మనల్ని తెలిసిన వాళ్ళెవరూ లేరులే!''

''అదుగో! ఆమాటే అనొద్దంటాను! ఆ డబ్బేదో మన చేతికి వచ్చేదాకా మనం అనుక్షణం అప్రమత్తగా వుండాలి అని నేను తల పగులకొట్టుకున్నా గాని మీ మట్టి బుర్రలకు అర్థం అయి ఏడవదు!''

కమలాదేవి లోపల్నుంచి కాఫీ తెచ్చింది.

"ఇదెవరికి కావాలి? సీసా పట్రా!" అన్నాడు కరుణాకరం కర్కశంగా.

"ఇప్పుడా? ఆ అమ్మాయి తిరిగి వస్తే ఇంకేమన్నా వుందా? మన నిజస్వరూపం తెలిసిపోదూ?" కమలాదేవి భయంగా అంది.

"నువ్వు నోరు మూసుకుని చెప్పింది చెయ్యి!"

కమలాదేవి లోపలకు వెళ్ళి విస్కీ సీసా తెచ్చింది. దాన్ని అందుకుని కార్క్ పీకివేసి అందులోని ద్రవాన్ని గ్లాసులోకి వంచుకున్నాడు కరుణాకరం.

"ఒరేయ్ అల్లుడూ! నాక్కూడా కొంచెం! నిన్నటి నుంచినాలుక పీక్కుపోతోంది!" అని విలవిల్లాడాడు నీలకంఠం.

సీసాలో అడుగున కొంత మిగిల్చి నీలకంఠానికి అందించాడు కరుణాకరం. గ్లాసువత్తి గటగట త్రాగేశాడు తర్వాత.

దూరంనుంచి కారు హారన్ వినబడింది.

"అమ్మాయి వస్తున్నట్టుంది" అన్నది కమలాదేవి.

"ఈ సీసాలూ, గ్లాసులూ అన్నీ మాయంచేసెయ్! ఊఁ త్వరగా!" అన్నాడు కరుణాకరం.

కమలాదేవి వాటిని లోపల దాచేసి, టేబుల్ని శుభ్రంగా తుడిచింది.

కారు గేటులోంచి లోపలకు వచ్చి, గుమ్మం ముందు ఆగింది.

కరుణాకరం ఒక్క అంగలో కారుదగ్గరికి దూకాడు.

"ఉహ్; ఆమెకే తెలీకపోతే నీకన్నా బుద్ధి వుండక్కర్లా?" అంటూ ఉప పీక పుచ్చుకున్నాడు కరుణాకరం.

అతడి వాలకాన్ని చూసి సునీతగూడ భయపడి

పోయింది, అయినా తమాయించుకొని అంది.

"ఆమెదేం తప్పులేదండీ! నేనే బలవంతంచేసి తీసు కెళ్ళాను. శనివారం తప్పనిసరిగా గుడికి వెళ్ళే అలవాటు నాకు."

కమలాదేవి అడ్డుకుంది కరుణాకరాన్ని.

"అప్పటికీ నేను చెప్పాను గూడా! ఇక్కడ పల్లెల్లో అందరూ రౌడీ వెధవలుంటారు! వద్దని చెప్పాను!" అంది.

"ఆ! అవునవును! నిజమే! ఇక్కడి పల్లెల్లో త్రాగు బోతు రౌడీ లెక్కువ" అన్నాడు కరుణాకరం తనని సంబాళించుకుంటూ.

"దోవలో మీ కెవరూ అడ్డు తగల్లేదు కదా!" అన డిగింది కమలాదేవి ఉషవంక చూస్తూ.

"లేదమ్మో! ఎవరూ మా వంక కన్నెత్తి చూడలేదు!" అని సమాధాన మిచ్చింది ఉష.

కమలాదేవి ఆత్రం చూసి సునీత తనలో తనే నవ్వు కుంది, తామేం మరీ చిన్నపిల్లలా, మాయచేసి యెత్తుకు పోవడానికి.

"ఇప్పుడు పోతే పోయావ్! ఇంకెప్పుడూ నేను గానీ, మామయ్యగానీ తోడు లేకుండా వెళ్ళకండి!" కరుణాకరం నిదానంగా అన్నాడు.

"ఆ ముసలి పీనుగ ఎప్పుడు చస్తుందోగానీ, ఈ కొంపలో మరో నాలుగురోజులుంటే నాకు పిచ్చెక్కే లాగుంది!" తనలో తను అనుకున్నట్టుగా పైకే అనేసింది ఉష.

"నీకేం పొయ్యేకాలమే ఆ ముసలావిడమీద పడి ఏడు స్తావ్! నువ్వన్నా చెప్పు సునీతా! ఆమె నాలుగుకాలాల పాటు బ్రతకాలనే గదా మా ఈ ప్రయత్నమంతా!

ఇంతకుముందే డాక్టరుగారు చూసి వెళ్ళారు. ఆమె పరిస్థితి కొంత మెరుగయిందనే చెప్పారు గూడాను" కమలాదేవి దీనంగా అంది.

సునీతకు ఈ వ్యవహారం ఏమీ మనసుకు నచ్చలేదు. తను రావడమే పెద్ద డిసప్పాయింట్ మెంట్! తను ఎంతో కులాసాగా కబుర్లతో గడపాలనుకున్న సమయం ఇలా వృధా అయిపోతున్నదని ఆమెకు బాధగా వుంది.

## 4

భోజనాల దగ్గర సునీతకు సరికొత్త అనుమానం వచ్చింది. తను వచ్చినప్పట్నుంచి ఆ ముసలమ్మకు ఎటువంటి ఆహారం ఇచ్చినట్టు లేదు. ఏ ఆధరవూ లేకుండా ఆమె ఎలా వుండగలుగుతోంది?

"ఏమండీ! మీ అమ్మగారికి ఏ ఆహారమూ ఇచ్చినట్టు లేదే!" అని కమలాదేవిని అడిగేసింది. తీరా అడిగాక ఎందుకడిగానా అని నొచ్చుకుంది, తన ప్రశ్న కమలాదేవిని కష్టపెట్టేలా చేయవచ్చు అని.

కమలాదేవి సునీత వేసిన ప్రశ్నకు తడబడింది. కంగారుగా సునీత వంక చూసింది. సునీతకు ఏం బదులు చెప్పాలో తికమకపడి తన భర్త నీలకంఠం వంక చూసింది.

"ఓ! అదా! రెండు రోజుల్నుంచి ఆమె సరిగా స్పృహలో వుండటంలేదు. అందుకే డాక్టరుగారు ఇవాళ వుదయం గ్లూకోస్ ఇంజెక్షన్ ఇచ్చారు. రాత్రినుంచి ధ్యాం జావ ఇవ్వమన్నారు!" నీలకంఠం జవాబు విని కమలాదేవి తేరుకుని "అవునవును! రాత్రికి జావ ఇవ్వమన్నారు. ఓవల్టిన్ గూడ పట్టమన్నారు కదూ! నాకు మరోసారి గుర్తుచేయండి, మరిచిపోతానేమో!"

మధ్యాహ్నం ఉషని అడిగింది సునీత. "మీ అమ్మమ్మ నోసారి చూడాలని వుంది. పైకి పోదామా?"

"ఆవిడ దగ్గరకా! నాకు భయం! ఆ గది వాతావరణ మంటేనే నాకు ఒళ్ళు గగుర్పాటు కలిగిస్తుంది. అయినా ఆ మతిలేని ముండని చూసేదేమిటి లేద్దూ!" అని తేలికగా కొట్టిపారేసింది ఉష.

ఆ మాటలు విన్న కమలాదేవి తను కల్పించుకుని జవాబిచ్చింది, "అవేం మాటలు! మనసున్న వ్యక్తికి కెవరి కయినా, ఇంట్లో జబ్బుతో వున్న మనిషిని చూడాలనీ, రెండు మంచి మాటలు చెప్పి ఓదార్చాలనీ అనిపిస్తుంది. అలాగే చూద్దువులే సునీతా! రాత్రికి ఆమె తెలివిగా వున్నప్పుడు తీసుకెళతాను!"

సునీత సరేనన్నట్టు తలూపింది. ఉష వైఖరి చూస్తుంటే ఆమెకు ఒళ్ళు మండుతోంది. కనీసం తనమాటన్నా విలువ లేకుండా చూస్తోంది! ఆమెకన్నా ఆమె తల్లిదండ్రులే తన మాటను గౌరవిస్తున్నారు.

రాత్రయేసరికి ముసలమ్మను తను చూడాలన్న విషయమే మరిచిపోయింది సునీత.

కమలాదేవి తన తల్లికి ట్రేలో ఓవల్టిన్, ఇంకేదో తీసుకువెళ్తుండగా ఆమెకు మళ్ళీ రోగిని చూద్దామన్న ఊహ వచ్చింది.

కమలాదేవి ఆమెకు ఆహారం ఇవ్వటం అయిపోయాక అడుగుదామనుకుంది. కాని కమలాదేవే పిలిచింది ఈతడవ.

"సునీత! నీవుగూడా నాతో రా! మా అమ్మను చూద్దువుగాని!"

సునీత ఆమె వెనుకనే చెక్క మెట్లు ఎక్కి పైకి వెళ్ళింది. నల్లబడిపోయి నీళ్ళోడుతున్న గోడల్ని చూస్తుంటే ముందుకు పోవటానికి సునీతకే అసహ్యం వేస్తోంది. తనకు

బుద్ధితక్కువై పైకి వచ్చావ్రా బాబూ అనుకుని మనసులోనే చెంపలేసుకుంది.

అంత పాత మేడలో గూడ చిన్న టేబుల్, దానిమీద టెలిఫోన్ వుండటం సునీతకు ఆశ్చర్యం కలిగించింది.

ఇల్లు నీట్ గా వుంచుకోవాలంటే డబ్బు ఖర్చవుతుందని కొంపను ఈ రకంగా తయారుచేసుకున్న పిసినారి ముసలమ్మ టెలిఫోన్ ని ఎలా భరించటానికి ఒప్పుకుందో.

ఒకవేళ ఎమర్జన్సీ అయితే డాక్టర్ని పిలవటానికి ఫోన్ ఏర్పాటుచేసి వుంటారు వీళ్ళే, ఆమెకు తెలియకుండా.

"నువ్వు ఇక్కడే వుండు. ఆమె స్పృహలో వుంటే లోపలకు వద్దువుగాని!" అంటూ కమలాదేవి గది తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళింది. తన వెనుకనే తలుపులు మూసి లోపల గడియపెట్టింది.

సునీత బయటనే నిలబడిపోయింది. పై అంతస్తు అయినాగాని రాక్షసి గుహలోలాగా చీకటిగా వుంది ఆ ప్రదేశం. వెలుతురు రావడానికి ఆస్కారం లేకుండా వుంది.

ఇలాంటి వాతావరణంలో మంచివాళ్ళకు గూడ రోగం వస్తుంది. అటువంటిది ఆ రోగి ఇక్కడ ఎలా కోలుకుంటుందని వీళ్ళు అభిప్రాయపడుతున్నారో అని విస్తుపోసాగింది.

లోపల్నుంచి సన్నగా మూల్గులూ, ఏవో సణుగుతున్న ధ్వనీ వినబడుతున్నయ్. మధ్యలో కమలాదేవి పెద్దగా మాట్లాడుతున్నది.

"నన్ను ఎందుకమ్మా ఇలా కాల్చుకు తింటావు! సరిగా ఆహారం తీసుకోక మమ్మల్ని ఇబ్బంది పెట్టి, నిన్ను నీవు కష్టపెట్టుకుంటావ్!"

తలుపు తెరుచుకుని మళ్ళీ బయటకు వచ్చింది కమలా

దేవి. తలుపు సందులోంచి లోపల్నుంచి బెడ్ కనబడు తోంది. దానిమీది మనిషిని చూడటానికి ప్రయత్నించింది గాని కమలాదేవి అడ్డం వుండటం మూలాన్ని ఎవరూ కనబడలేదు.

కమలాదేవి తన వెనుకనే తలుపులు వేసేసింది. "ఆమె మనలోకంలో లేదమ్మా! మరోసారి చూద్దువుగాని పద!" అంటూ సునీతనుంచి సమాధానం కోసం చూడకుండా మెట్లు దిగిపోసాగింది.

చేసేదిలేక సునీత ఆమె వెనకాలే నడిచింది. ఇద్దరూ మెట్లు దిగాగో, లేదా మేడపైన గదిలోంచి పెద్దగా అరుపులు వినబడినయ్.

"ఏమేవ్! కమలా! నాకు ఆకలి మండిపోతుందే! త్వరగా అన్నం పట్రావే!"

కమలాదేవి సునీత వంక చూసింది చురచురా! "చూశావా! ఇప్పుడే కదా ఆమెకు ధారకంపోసి వస్తున్నాను. మళ్ళీ ఆకలని అరుస్తోంది. అన్నం కావాలని గోల చేస్తుంది. రోగిష్టిదానికి అన్నం ఎలా పెట్టం?" అన్నది.

సునీత సానుభూతిగా ట్రేలోని ఖాళీ పాత్రలవంక చూసింది.

సునీత మనసు అయోమయం అయిపోయింది. తన గదిలో బెడ్‌మీద వాలిపోయింది. ఆమె ఆలోచనలన్నీ ముసలానిమీదకే పోయాయి.

వీళ్ళందరూ కావాలని ఆమెను మాడుస్తున్నారా? ఆమె త్వరగా చావాలని వీళ్ళ కోరికా?

స్పృహలేని స్థితిలో ఆమె ఇబ్బంది పెడుతున్నా, సహించి కమలాదేవి ఆమెకు సపర్యలు చేస్తోంది. తల్లి మీద ప్రేమచేతనా? లేక ఆమె ఎక్కడో నిగూఢంగా

దాచుకున్న యాభైవేల రూపాయల కోసమా? ముసలిది తన డబ్బు ఎక్కడ దాచిందీ ఇంకా చెప్పి వుండదు. ఆ డబ్బు వీళ్ళచేతికి చిక్కంగానే రోగిష్ఠిదాన్ని కైలాసానికి సాగనంపి తమ దోవంట తాము పోతారా?

అంటే వీరంతా ఆమె అంతిమక్షణాలకోసం ఎదురు చూస్తున్నారా? తలుచుకున్న కొద్దీ తన కళ్ళముందర ప్రత్యక్షంగా ఏదో నాటకం జరుగుతున్నట్టుగా ఫీలవసాగింది.

కమలాదేవిని చూస్తుంటే, తను వేసే ప్రశ్నలకు ఆమె తడబడడం గమనిస్తుంటే, ఆమె ఏదో నిగూఢ రహస్యాన్ని కప్పిపుచ్చుకునేందుకు యత్నిస్తున్నట్టుగా అనిపించింది సునీతకు. బుర్ర ఎంతగా బద్దలు కొట్టుకున్నా ఆ రహస్యం దేనికి సంబంధించి వుంటుందో ఆమెకు అవగతం కాలేదు.

ఈ ఇంటి పరిసరాలు తన మనసుని కలుషితం చేస్తున్నవా? ఆ ప్రభావమే, ఎంతో మంచివాళ్ళయిన ఉష కుటుంబంమీద అనుమానం కలిగించేలా చేస్తున్నదా?

ముసలమ్మకు సరైన ఆహారం ఇవ్వక మాడ్చి చంపుతున్నారా? లేక ఆమె నిధి ఎక్కడ దాచి వుందో చెప్పమని చావుబ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడే ప్రాణిని ఇంకా హింసిస్తున్నారా? ఎంతగా ఆలోచించినా వాస్తవికతకూ, మిధ్యకూ మధ్య తేడాను భేదించలేకపోయింది.

ఆలోచనలతో విసిగి, అలిసిపోయి నిద్రలోకి జారుకుంది సునీత.

# 5

కిటికీలోంచి నీరెండ ముఖంమీద పడేసరికి సునీత కళ్ళు తెరిచింది. అప్పటికి బాగా ప్రొద్దెక్కిందనుకుని

బెడ్ మీదనుంచి లేచింది. దువ్వెనతో వెంట్రుకల్ని సరి చేసుకుంది అద్దంలో చూసుకుంటూ. ఆ తర్వాత టూత్ పేస్టూ బ్రష్ తీసుకుని దొడ్లోకి నడిచింది.

తను ఇక్కడికి వచ్చి ఇప్పటికి రెండు రోజులయింది. ఇంతవరకూ ముసలిదాని రోగం వుండేదీ, పోయేదీ తేల లేదు. ఇంకా ఎన్నాళ్ళు ఇక్కడ వుండాలో. తన పరిస్థితి చూస్తుంటే మరో రెండు మూడు రోజులకన్న ఎక్కువ వుండలేననిపిస్తోంది. ఉష చెప్పినట్టుగా ఇక్కడ చాలా రోజులు వుంటే మతిపోయేలా వుంది. పైగా ముసలి రోగి బెడ్ ప్రక్కన మరో బెడ్ వేసుకుని తనుగూడ మంచ మెక్కే పరిస్థితి గూడా రావచ్చు.

లోపల్నుంచి కమలాదేవి తన కుమార్తెను నిద్రలేపటం వినిపిస్తోంది సునీతకు.

"ఏమేవ్ ఉషా. ఏం మొద్దునిద్రే! బారెడు ఎండ ఎక్కేదాకా మెలకువ రాదేమో!" అని అరుస్తోంది కమలాదేవి.

ముసిలామె, కమలాదేవి అనురాగాలు ఎలా వున్నా గాని, కమలాదేవి ఆమె కుమార్తె ఉష ధోరణిగూడ విచిత్రంగా తోస్తున్నది సునీతకు. వాళ్ళిద్దరి మధ్య తల్లీ కూతుళ్ళ మధ్య వుండాల్సిన మమతగానీ, ఆప్యాయతగానీ లేదు. ఎవరో ముక్కు ముఖం యెరగని ఇద్దరు స్త్రీలు తమ గమ్యానికి పోతూ పోతూ దోవంట ఈ భూతాల మేడలో మజిలీ చేసినట్టుగావుంది. లేక ఉష గూడ తన తల్లిలాగ, ఏదన్నా నిగూఢ రహస్యాన్ని కాపాడుతున్నదా తననుంచి.

"మ్యావ్" అంటూ నల్లపిల్లి వచ్చి గోడమీదకూర్చుంది. ఈ పిల్లికి ముసలిదంటే ప్రేమ కాబోలు! ఈ ఇంటిని వదిలి పోవడంలేదు అనుకుంది సునీత.

ఎవరో ఆ పిల్లిమీదకు రాయి విసిరారు. రాయి తగిలి పిల్లి బాధతో అరుస్తూ పారిపోయింది. వెనక్కి తిరిగి ఆ రాయి విసిరిందెవరా అని చూసింది సునీత.

అక్కడ కరుణాకరం నిల్చుని వున్నాడు.

"ఆ రాయి పిల్లికి సరిగా తగిలితే అది ఈపాటికి చచ్చి పోయి వుండేది!" అన్నది సునీత.

"అది చావాలనే రాయి విసిరాను. గురి తప్పి అది బ్రతికిపోయింది" అన్నాడు కరుణాకరం కసిగా.

"పిల్లిని చంపితే మహాపాపం! బంగారు గుడి కట్టించినా ఆ పాపం పోదట!"

"అదేమో నాకు తెలీదు. కాని పిల్లులంటే నాకు తగని కోపం!"

రేడియోలో వస్తున్న తెలుగున్యూస్ అయిపోయింది. ట్రాన్సిస్టర్ ఆపేస్తూ అడిగాడు నీలకంఠం. "మీ అమ్మకు ఓవల్టిన్ కలిపి ఇచ్చావా?"

అతడి కేక ఇల్లంతా మారుమ్రోగింది. మరుక్షణంలో కమలాదేవి జవాబుగూడ వినిపించింది పెద్దగా. "ఇదో వెడుతున్నా!"

ఆ తర్వాత చెక్క మెట్లమీద అడుగుల చప్పుడు వినిపించింది. అదేమిటో ముసలమ్మ గదివేపునుంచి ఏమాత్రం అలికిడి వినిపించినా సునీత చెవులు రిక్కించి వింటోంది.

ముఖం కడుక్కోవటం ముగించి లోపలకు వచ్చింది సునీత.

గ్లాసుతో వేడివేడి కాఫీ తెచ్చి అందించింది ఉష. సునీత గ్లాసు అందుకుంటూ అడిగింది "మీ పనిమనిషి కనబడదేం!" అని.

"సరేలే! ఎందుకడుగుతావ్! ఈ కొంపలో మేంగనుక వుండగలుగుతున్నాం. ఇక్కడ పనిచేయాలంటే పనిమను

ష్యులు యెవరూ నాలుగురోజులన్నా పనిచేయరు. మేం రాగానే దానిదోవన అది జారుకుంది."

"ఉషా! ఏమిటా పెడసరం మాటలు!" నీలకంఠం కోప్పడ్డాడు.

సునీత అతనివంక చూసింది. మళ్ళీ అంతలోనే సునీతను చూసి నవ్వాడు అతడు. అతడి ముఖంలో దాచుకుంటున్న గాంభీర్యం, పైకి నటనతో అతడూ ఏదో కప్పిపెడుతున్నట్టుగా తోచింది, కమలాదేవి, ఉషల్లాగే. బహుశా ఆ యాభై వేల రూపాయలమీదే అతడి ఆశల్నిగూడ నిల్పుకున్నాడేమో అనుకుంది.

"ఉషా! నీవూ, కరుణాకరం ఊళ్ళోకి వెళ్లి అమ్మమ్మకు కావాల్సిన మందులు తెస్తారా?" కమలాదేవి అడిగింది.

"నేనుగూడ వెళ్తానండీ! నాకు అలా గాలి పీల్చుకున్నట్టుగా వుంటుంది!" అన్నది సునీత.

కమలాదేవి నీలకంఠం వంకా, కరుణాకరం వంకా, చూసింది. నీలకంఠం తల అడ్డంగా ఊపాడు. కాని కరుణాకరం చిరునవ్వుతో అన్నాడు, "పోనీ రానీయ్, నేనూ వెంట వుంటానుగదా?"

మరో గంట గడిచాక ముగ్గురూ కారులో బయలు దేరారు.

పొలాలు, గుట్టలూ దాటుకుని కారు ఒక బస్తీలోకి ప్రవేశించింది. ఆ ఊరు అటు పల్లె, ఇటు టౌన్ కాకుండా వుంది. మందుల షాపులో కరుణాకరం ఏవో మందులు కొన్నాడు. తర్వాత సరుకుల దుకాణం ముందుకెళ్ళి రోజూ వాడుకకు కావాల్సిన తినుబండారాలు తీసుకోవటంలో కొంత టైమ్ పట్టింది.

ఉషగూడ కరుణాకరం వెంటే వెళ్ళింది. సునీత కారులోనే కూర్చుండిపోయింది. తన డైరీ తీసి అందులోంచి

పోస్టుకార్డు తీసింది. తను ఇంకా కమలాదేవి తల్లిదగ్గరే వున్నట్టు, రెండు రోజుల్లో రేణిగుంటలో ఉష స్వగృహానికి పోతున్నట్టుగా ఇంటికి వుత్తరం రాసింది.

కరుణాకరం, ఉష యిద్దరూ సరుకులు మోసుకుంటూ తిరిగి వచ్చారు.

"ఇక్కడ దగ్గరలో పోస్టాఫీసు వుందా?" అని అడిగింది సునీత.

"ఏమిటి? పోస్టాఫీసా? ఏదైనా వుత్తరం వుందా పోస్టు చేయాల్సింది! మీ యింటికేనా?" కరుణాకరం తన ఆదుర్దాన్ని చిరునవ్వుతో కప్పిపుచ్చుకుంటూ అడిగాడు.

"అవును!" అంటూ పోస్టుకార్డు తీసి అందించింది సునీత.

"అన్నట్టు నాదీ ఒక లెటర్ పోస్టుచేయాలి! సమయానికి గుర్తుచేశారు మీరు!" అంటూ సునీత కార్డు అందుకుని పోబోయాడు.

"మళ్ళీ కాలినడకన ఎందుకు? కార్లోనే పోతేపోలా?" సునీత విసుగ్గా అంది.

"పోస్టాఫీసు చిన్న గొందులో వుంది. అక్కడికి కారు వెళ్ళదు. ఇప్పుడే వచ్చేస్తాను చిటికెలో!" అంటూ కరుణాకరం మలుపు తిరిగి కనుమరుగై పోయాడు.

రోడ్ ట్రాన్స్‌పోర్ట్ బస్ వచ్చి సెంటర్లో ఆగింది దుమ్ము లేపుతూ. అది మద్రాసుకు వెళ్ళే బస్సే.

దాన్ని చూడంగానే సునీతకు ఇంటిమీద గాలిమళ్ళింది. తను ఒక్కసారిగా కారులోంచి దిగిపోయి ఆ బస్ లో ఎక్కితే అనుకుంది. తన డైరీలోని పర్సులో డబ్బంతా వుంది. తను మద్రాసు చేరాక, తన బ్రీఫ్ కేస్ ని ఎవరిచేతనయినా పంపమని నీలకంఠానికి ఫోన్ చేయిస్తే సరిపోతుంది.

కాని, ఆమె కాళ్ళూ చేతులూ చచ్చుబడిపోయినట్టుగా ఆమె కదలలేకపోయింది. తను పిచ్చిపట్టిన దానిలా గభాల్న కారుదిగేసి వెళ్ళి బస్‌లో యెక్కితే అందరూ తనతో ఫూల్ క్రింద జమ కట్టరూ! లేదా తల్లికోసం దిగులు పడే పాలుత్రాగే పసిపాపాయిక్రింద లెక్కకట్టి తనను చిన్నచూపు చూడరూ!

బస్ స్టార్టయి ముందుకు సాగిపోయింది. తనకు చేజిక్కిన అవకాశం జారిపోయింది. ఇక తను మళ్ళీ ఆ దయ్యాల మేడకు పోకతప్పదు. అక్కడింకా ఎన్నిరోజులు క్రుమ్గి పోవాలో ఏమో! బుద్ధి పొరపాటయి వచ్చాననుకుంది.

పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ కరుణాకరం తిరిగి వచ్చాడు. కారు డోర్ తెరుచుకుని స్టీరింగ్ ముందు కూర్చు న్నాడు.

సునీత అభీష్టానికి వ్యతిరేకంగా కారు వెనక్కి తిరిగి వేగం పుంజుకుని, దయ్యాలమేడ వేపుగా దూసుకు పోతోంది.

# 6

ఉష వారిస్తున్నా వినకుండా తనుగూడ ఒక సంచీ మోస్తూ సరుకుల్ని లోపలకు చేర్చింది సునీత.

హాల్లో నీలకంఠం, కమలాదేవి విచారంగా కూర్చు న్నారు. కొంపదీసి ఆ ముసలమ్మ 'టా' అనలేదుగదా అను కుంది సునీత.

కానీ ఆ శుభగడియలు అంత త్వరగా వచ్చేలా లేవు.

"ఇంతక్రితమే డాక్టరుగారు వచ్చి చూసి వెళ్లారు. ముసలమ్మ ఆఖరు క్షణాల వరకూ ఆమెను కనిపెట్టుకుని వుండమనీ, ఆమె అంతిమకోర్కె లేవైనావుంటే తీర్చ టానికి ప్రయత్నించమనీ చెప్పి వెళ్ళారు!" అంటూ కమలా

దేవి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"ఊరుకో! పెద్దవాళ్ళ చావు పెళ్ళితో సమాన మంటారు? ఆమెను వీలైనంత సుఖంగా వుంచటానిక్కి ప్రయత్నించు!" అన్నాడు నీలకంఠం ఆమెను ఓదారుస్తూ.

కొద్ది క్షణాలు సునీత మౌనంగా కూర్చుండిపోయింది. "సమయంకాని సమయంలో వచ్చి నేను మీకు ఇబ్బంది కలిగిస్తున్నట్టున్నాను. ఎందుకయినా మంచిది, మధ్యాహ్నం బస్‌కి నేను వెళ్ళిపోతాను" అంది చివరకు.

కమలాదేవి కళ్ళనీళ్ళు తుడుచుకుంది. "అలా అనకు సునీతా. నీవ్రా మా అమ్మాయిలాంటి దానివే! మా కుటుంబంలో మరో సభ్యురాలి వనుకుంటాం నిన్ను! నీవు పదే పదే వెళ్ళిపోతానంటే మా మనసు మరీ బాధపడుతుంది."

"అవునమ్మా! ఇక్కడ నీ మర్యాదకు లోటేమీ జరగ లేదుకదా? ఇంత కష్టంలోనూ నిన్ను ఎంతో ఆప్యాయంగా చూసుకోవడంలేదూ!" నీలకంఠం తాళం వేశాడు.

"అందుకోసం కాదండీ నేను చెప్పేది. నేను మీకు ఈ కష్టసమయంలో భారంగా వుంటానేమో అని అంటున్నాను. మా అమ్మా, నాన్నా నన్ను ఎంత ఆదరంగా చూస్తారో మీరూ అంత ఆప్యాయంగా చూస్తున్నారు!" సునీత నిదానంగా అంది.

"ఉషా! నీవు పెద్దమ్మను కనిపెట్టుకుని కూర్చో. నేను త్వరగా వంట పూర్తిచేస్తాను!" కమలాదేవి కుర్చీలోంచి లేచింది.

ఉష "అలాగేనమ్మా!" అంటూ మెట్లెక్కి మేడ పైకి వెళ్ళింది.

సునీతకు ఏమి చేయటానికి తోచడంలేదు. ట్రాన్సిస్టర్

ఆన్ చేసేంది. ఫారిన్ స్టేషన్లు మాత్రమే పలికినయ్. టైం కాని టైమ్‌లో లోకల్ స్టేషన్లు ఎలా వస్తయ్ అనుకొని ఆఫ్ చేసింది.

వంట ఇంటిలోకి వెళ్ళి కమలాదేవికి సాయం చేయ సాగింది. ప్లేట్లు కడగడంలోనూ, కూరలు తరగటం లోనూ సహాయపడింది.

"నీ కెందుకమ్మా శ్రమ! హాయిగా కూర్చో!" అంది కమలాదేవి.

"ఫర్వాలేదు లెండి. ఊరికే కూర్చుంటే ఏమీ తోచ టంలేదు. నాకూ పొద్దుపోయినట్లుంటుంది. ఇటు మీకూ సాయపడ్డట్లు వుంటుంది!" అంది సునీత.

కమలాదేవి సినిమా కబుర్లూ, ఆడవాళ్ళ ఫాషన్ల గురించీ చాలా విషయాలు మాట్లాడింది.

టైమ్ గడచే విషయమే తెలియకుండా కాలం గడి చింది. ప్రతిక్షణమూ ఒక యుగంలా గడుపుతున్న సునీత రాత్రయేసరికి 'అమ్మయ్య! యివాళ ఒకరోజు గడిచింది!" అనుకుంది తేలికపడ్డ హృదయంతో.

రాత్రి భోజనాలయి హాల్లో కూర్చుని కబుర్లు చెప్పు కున్నారు చాలాసేపు. కాని ఆ కబుర్లలో నీలకంఠం కుటుంబంయొక్క స్వంత విషయాలేవీ రాలేదు. అదే సునీ తకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అయినా తను ఈ దయ్యాల మేడ ప్రభావానికి లోనై ప్రతిదాన్నీ ఇలా అనుమా నిస్తోంది ఏమిటా అనుకుంది.

వాచీవంక చూసుకుంది సునీత. టైమ్ పదయింది.

"మామయ్యా! ఇక నేను వెడతాను!" అన్నాడు కరుణాకరం టైమ్ చూసుకుంటూ.

"వెళ్ళివస్తాను అని చెప్పు! నేను చెప్పిన విషయాలు ఏవీ మర్చిపోకుండా జాగ్రత్తగా మసలుకు రావాలి!

తెలిసిందా?"

"అలాగే!" అంటూ కరుణాకరం బయటకు వెళ్ళిపోయాడు. కారు స్టార్టయిన శబ్దం వినిపించింది.

"ఇంత రాత్రివేళ చలిలో ఎక్కడికే అంత హడావిడిగా వెళ్ళాడు?" అనడిగింది సునీత.

"ఆయన ఆఫీసులో అర్జంటు వ్యవహారాలేవో వున్నాయట. వాటిగురించి వెళ్ళాడు. ఆయన పోదామనుకుంటే యిక్కడ మా అమ్మకు వచ్చే ప్రాణం, పోయే ప్రాణంగా వుందాయె!" కమలాదేవి సమాధానం చెప్పింది.

బయట చలిగాలి వీస్తోంది. ఆకాశం మబ్బులు కమ్ముతోంది. పెద్దగాలీ వాన వచ్చేలా వుంది.

"చలిగాలి తోలుతున్నది. తుఫాను వస్తుందేమో? ఏదైనా వేడిపానీయం త్రాగితే బాగుంటుంది. టీ కలిపి ఇస్తావా?" నీలకంఠం అడిగాడు. అతడు కమలాదేవికి ఏదో సైగ చేయటం సునీత గమనించకపోలేదు. అయినా ఏమీ ఎరగనట్టుగా ఊరుకుంది.

రాత్రిపూట పడుకోబోయేముందు టీ త్రాగితే నిద్రాభంగం కలుగుతుంది. కాని టీ త్రాగకపోతే వీళ్ళు వూరుకునేలా లేరు అనుకుంది సునీత.

గ్లాసులో టీ తెచ్చి సునీతకు అందించింది కమలాదేవి.

"ముందు బాబాయిగారి కివ్వండి!" అంది సునీత మర్యాదగా.

"ఇస్తాను లేమ్మా! నీవు అతిథివి. ముందు నీవు తీసుకో" అంటూ బలవంతం చేసింది కమలాదేవి.

సునీతకు గ్లాసు అందుకోక తప్పలేదు. నీలకంఠం చేసిన సైగలోని అంతరార్థం ఏమయి వుంటుంది? తన కివ్వబోయే పానీయంలో ఏదైనా విషాన్ని కలిపి ఇస్తున్నారా? తనను చంపినందువల్ల వీళ్ళకేమిటి లాభం?

అయినా తనను అంతం చేయదల్చుకుంటే, వున్న పళాన పీక నులిమి చంపినా తనను రక్షించేందుకు ఎవరూ రారు. మరయితే బలవంతాన తనచేత టీ త్రాగించటంలో, అందులోనూ తనకు అదే గ్లాసు కేటాయించబడటంలో అంతరార్థం ఏమయి వుంటుంది?

బహుశా, చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతూ, జీవితకాలాన్ని పొడిగించుకుంటూ పోతున్న ముసలమ్మని బలవంతంగా రైలెక్కిస్తారేమో, యమధర్మరాజు దగ్గరకు పంపటానికి! ఆ విషయం తను గమనించకుండా వుండటానికి ఈ టీలో మత్తుమందు కలిపి యిస్తున్నారేమో!

సునీతకు అయిడియా వచ్చింది. "కాసిని మంచినీళ్ళు యిస్తారూ?" అనడిగింది.

మిగతా ముగ్గురూ—నీలకంఠం, ఉష, కమలాదేవి టీ సిప్ చేస్తున్నారు. కమలాదేవి లేవపోతూండడంగా ఆమెను వారించింది సునీత.

"మంచినీళ్ళకూజా యిక్కడే వుందిగదా! నేను నీళ్లు వంచుకుంటాను లెండి!" అంటూ లేచి, మరో ఖాళీగ్లాసు తీసుకుని కిటికీ దగ్గరకు నడిచింది సునీత. కిటికీ దగ్గరే స్టూలుమీద మంచినీళ్ల కూజా వుంది.

టీ గ్లాసుని కిటికీలో వుంచి గ్లాసులోకి నీళ్లు వంచుకు త్రాగింది. ఎవరూ తనవంక చూడటంలేదని నిర్ధారణ చేసుకుని 'టీ' గ్లాసుని కిటికీలోంచి బయటికి వంచింది. టీ అంతా పారబోసి ఆ గ్లాసు నీళ్ళతో తొలిచి అందులోకి మరి కాసినినీళ్ళు వంచుకుంది.

ఆ తర్వాత కిటికీదగ్గరే నిలబడి వాళ్ళు తనని గమనించేలా గ్లాసులోని నీళ్ళను 'సిప్' చేసింది.

"ఈ రాత్రికి పెద్దవాన వచ్చేలా వుంది!" అంది ఖాళీ గ్లాసుల్ని ట్రేలో వుంచుతూ.

"అవునవును! కరుణాకరం ఇంత రాత్రివేళ వెళ్ళాడు. తిరిగి రాగలడో, లేదో?" సానుభూతిగా అన్నాడు నీలకంఠం.

"వాన వచ్చినా, వరద వచ్చినా వాడేం వెనక్కు తగ్గే రకం కాదు!" ఉష తన బావను సమర్థిస్తూ అంది.

# 7

సునీత ఆవులించింది. మత్తుగా అరకన్నులు మూస్తూ "నాకు నిద్రవస్తోందండీ! వెళ్ళి పడుకుంటాను!" అంది.

కుర్చీలోంచి లేచి రెండడుగులు వేసి కుప్పగా కూలి పోయింది నేలమీద.

"మత్తుమందు అప్పుడే పనిచేసిందన్నమాట!" కమలాదేవి నవ్వుతూ అంది.

"ముందామెను ఆమె గదిలో బెడ్ మీదకు చేర్చు!" నీలకంఠం అన్నాడు కటువుగా.

కమలాదేవి సునీతను లేవదీసి భుజానవేసుకుని ఆమె గదిలోకి నడిచింది. బెడ్ మీద సునీతను పడుకోబెట్టింది. గొంతువరకు దుప్పటికప్పి "పాపం! పిచ్చిపిల్ల!" అనుకుంది పైకే.

కమలాదేవి తిరిగి హాల్లోకివచ్చి కూర్చుంది.

ఆమె వెళ్ళిపోయాక సునీత కొద్దిగా కళ్ళు తెరిచి దొంగ చాటుగా చూసింది.

గది తలుపు ఒకటి పూర్తిగా మూయబడింది. రెండో తలుపు వారగా వేసి వుంది.

ఆ సందులోంచి కుర్చీలో కూర్చున్న నీలకంఠం, అతడి ముందున్న గుండ్రటిబల్ల, దానిమీద ట్రాన్సిస్టర్, న్యూస్ పేపరూ, అతడి కెదురుగా కూర్చున్న ఉష కాళ్లు మాత్రం కనబడుతున్నాయ్ సునీతకు.

వీళ్ళకు నిద్రరాదా? లేక ఎవరికోసమన్నా నిరీక్షిస్తూ కూర్చున్నారా? బహుశా కరుణాకరం రాకకోసమేమో! అతడు వస్తే అప్పుడు మేలుకోవచ్చుగదా! అంతవరకూ జాగారం చేయటం దేనికి?

వాన ప్రారంభమయింది. ఊచలు లేని కిటికీలోంచి కొద్దికొద్దిగా జల్లు లోపలకు పడుతోంది. అయినా సునీత బెడ్ మీదనుంచి లేవలేదు, కిటికీలు మూయటానికి. అలా లేస్తే తను మత్తులోంచి తేరుకున్నట్టుగా వాళ్ళు కనుక్కుంటారు. ఏది ఏమయినా వాళ్ళ ప్లాన్ ఏమిటో ఆరా తీసేదాకా తను ఇలాగే పడుకునే వుండాలని నిశ్చయించుకుంది.

మరో గంట గడిచింది. సునీతకు ఈ భీభత్సవాతావరణంలో నిద్రపట్టటంలేదు. హాల్లో కూర్చున్న వాళ్ళనే వాచ్ చేస్తూ పడుకుంది.

రోడ్డుమీదనుంచి కారు హారన్ పెద్దగా వినిపించింది. "కరుణాకరం వచ్చినట్టున్నాడు!" అంటూ హాల్లో వున్న ముగ్గురూ లేచారు ఆత్రంగా.

ఉష ఒక్క అంగలో వెళ్ళి తలుపుతీసింది. చంకలో పెద్ద లెదర్ బ్యాగ్‌తో కరుణాకరం లోపలకు వచ్చాడు.

"ఏమయింది?" నీలకంఠం పెద్దగా అడిగాడు. ఆతృతలో అతని కంఠం వణికింది.

"సక్సెస్! బ్రహ్మాండమయిన సక్సెస్!" అంటూ కుర్చీల మధ్యగా వున్న చిన్న టేబుల్ మీద లెదర్ బ్యాగ్‌ని వుంచాడు.

నీలకంఠం దానిమీదకు ఎగబడి సంచీని తెరచి బాగా విడదీశాడు.

లోపల్నుంచి కరెన్సీ నోట్లకట్టలు సునీతాదేవి గదిలోకి కనుపించినయ్,

ముసలమ్మని బాధించి, వేధించి, చివరకు ఆమె తను దాచుకున్న డబ్బు గురించిన సమాచారాన్ని కక్కించి వుంటారు. ఇప్పుడు కరుణాకరం వెళ్ళి ఆ డబ్బుని వెదకి చేజిక్కించుకుని వచ్చాడల్లే వుంది.

"కిటికీలన్నీ గూడ మూసేయండి!" అని ఆజ్ఞాపించాడు కరుణాకరం.

మిగతా ముగ్గురూ ఆలోచనలేని వాళ్ళలా తలా ఒక కిటికీ దగ్గరకు పరుగెత్తి తలుపులు మూసేశారు.

"ఎంత?" కమలాదేవి అడిగింది.

"లక్ష!" కరుణాకరం జవాబిచ్చాడు.

ముసిలిదాని డబ్బు యాభైవేలు అనే చెప్పింది ఉష. కాని ఆమె నిజంగా లక్షరూపాయలు దాచిందన్నమాట అనుకుంది సునీత.

"నా జీవితంలో ఎన్నడూ ఇంత డబ్బు చూడలేదు" నీలకంఠం అన్నాడు.

"ఆ అమ్మాయిచేత మందు త్రాగించారా?" కరుణాకరం అడిగాడు.

"నీవు అలు వెళ్ళంగానే 'టీ'లో మత్తుమందు కలిపి ఇచ్చాం. దాన్ని త్రాగి ఆమె ఇక్కడ నేలమీదనే మత్తుగా వాలిపోయింది. నేనే ఆమెను ఎత్తుకుని తీసుకు వెళ్ళి బెడ్ మీద పడుకోబెట్టాను" కమలాదేవి బదులు చెప్పింది.

"గుడ్! మరో గంటదాకా ఆమె మత్తులోనుంచి తేరుకోకుండా వుంటే చాలు. మన పని తేలికగా పూర్తయిపోతుంది."

సునీత వులిక్కిపడింది. 'తేలికగా పూర్తయిపోతుందిట!' ఏమిటీ పని!

ముసలమ్మను కడతేర్చి, ఆమె డబ్బుని చేజిక్కించు

వున్న విషయం తనకొక్కదానికే తెలుసు. అయితే ఈ రహస్యం శాశ్వతంగా, బయటకు పొక్కకుండా, వుండేలా చేయాలంటే తననుగూడ కడతేరుస్తారా? తనేదో సుడి గుండంలో ఇరుక్కున్నట్లనిపించింది.

వాళ్ళంతా లక్షరూపాయల్ని చేజిక్కించుకున్న సంతోషంలో హాట్ డ్రింక్స్ తాగుతూ సెలిబ్రేట్ చేసుకుంటున్నారు. వాళ్ళు ఆ మైకంలోంచి తేరుకోకముందే తను ఈ భూతగృహంనుంచి పారిపోవాలి.

బయటనుంచి వీస్తున్న గాలికి గది తలుపులు రెండూ దగ్గరగాచేరి మూసుకున్నయ్. ఇదే అదనుగా సునీత బెడ్ మీదనుంచి లేచింది. వానలో పారిపోవటానికి వీలుగా, మినీ స్కర్ట్ వేసుకుంది. హవాయ్ చెప్పుల్ని విడిచేసింది. రెయిన్ కోటు తీసుకుని తన డైరీని పాకెట్ లో దోపుకుంది.

తలగడల్ని బెడ్ మీద నిలువుగా పరిచి దానిమీద దుప్పటి కప్పింది, ఎవరన్నా గభాల్న చూసినా బెడ్ మీద మనిషి వున్నదనే అభిప్రాయపడాలని.

నెమ్మదిగా కిటికీలోకి ఎక్కి కూర్చుంది సునీత.

చుట్టూ గాఢాంధకారం. హోరుగాలితో జోరుగా కురుస్తోంది వాన. అప్పుడప్పుడు ఆకాశంలో వస్తున్న మెరుపుల వెలుగు తప్ప ఎక్కడా కనుచూపుమేరలో మినుకు మినుకుమనే గుడ్డిదీపం కాంతి కూడా కనుపించటం లేదు.

ఇంటి చుట్టూరా చాల దూరంవరకు ఖాళీ స్థలం వుంది. తను త్వరగా ఆ ఖాళీజాగాను దాటి దూరంగా కనుపించే దుబ్బుల చాటుకో, లేక మరో దిశగా కనుపించే శిధిలమైపోయిన మండపందాకా వెళ్ళే లోపున వాళ్ళు తన పరారీని గుర్తించారో తన పని ఖాళీ అనుకుంది.

# 8

కిటికీ తలుపుని ఒకచేత్తో పట్టుకుని క్రిందికి దూకింది సునీత. చీకట్లో ఆమె కాలిక్రింద ఏదో మెత్తగా తగిలింది. ఆమె కంగారుపడిపోయి బ్యాలెన్స్ తప్పిపడిపోయింది.

చూరుక్రిందగా నల్లపిల్లి చలికి వణుకుతూ కూర్చుంది. సునీత సరిగా దానిమీదకే దూకింది. పిల్లి బాధతో పెద్దగా "మ్యావ్" "మ్యావ్" అని అరుస్తూ పారిపోయింది.

జారిపడిపోతూ సునీత వదిలేసిన కిటికీ తలుపు బలంగా కిటికీకి కొట్టుకుంది.

అంత వానలోనూ కిటికీ తలుపు మూసుకుపోవటంవలన 'ధడాల్'మని పెద్దగా చప్పుడయింది.

హాల్లో డ్రింక్స్ సిప్ చేస్తూ సెలిబ్రేట్ చేసుకుంటున్న వ్యక్తులు ఒక్కుమ్మడిగా వులిక్కిపడ్డారు.

"ఏమిటది?" కరుణాకరం అరిచాడు.

"ఉషా! నీవు సునీత గదిలోకి వెళ్ళి చూడు! బయట ఇంకెవరన్నా వచ్చారేమో చూడవయ్యా నీవు!" అని కమలాదేవి ఇటు కుమార్తెనూ, అటు భర్తనూ పురమాయించింది.

నీలకంఠం తలుపు తెరిచి వాకిట్లో నలుమూలలా చూశాడు. ఎవరూ కనుపించలేదు. మళ్ళీ తలుపుమూసి గట్టిగా గడియ బిగించి లోపలకు వచ్చాడు "ఇక్కడెవరూ లేరే!" అంటూ.

పారిపోతూన్న సునీతకు ఉష పెద్దగా అరవటం వినిపించింది. "సునీతాదేవి గదిలో లేదు!"

"చచ్చాం! ఫో! నా గదిలో టార్చిలైట్లు పట్రండి! ఆమె ఎంతో దూరం పోయి వుండదు. నీలకంఠం! నీవు పరుగెత్తుకు వెళ్ళి రోడ్డెక్కు. ఆమె తప్పించుకోటానికి అదొకటే మార్గం!"

నీలకంఠం తలుపు తెరుచుకుని బయటకు పరుగెత్తాడు. అతడి చేతిలో టార్చి వెలుగుతున్నది.

సునీత పొలాలకు అడ్డంపడి వేగంగా పరుగెత్తసాగింది. ఇంటిలోపల్నుంచి మనుషులు బయటకు వచ్చి ఆదుర్దాగా పలికే మాటలు ఆమె చెవుల్ని తాకుతున్నయ్.

గడ్డిలోంచి గట్లమీదుగా పరుగెత్తుతోంది సునీత. అలా పరుగుదీస్తూనే ఒకసారి వెనక్కు తిరిగి చూసింది. ఇంటి నుంచి తను ఎంతో దూరం రాలేదు.

తనను వెదకటానికి బయలుదేరిన వాళ్ళ చేతుల్లో టార్చి లైట్లున్నయ్. అది తనను తేలికగా పట్టిస్తాయన్నదే ఆమె బాధ. ఒకవేళ వాళ్ళు తనకు మరీ దగ్గరైతే తను గడ్డిలో పరుండిపోతే సరి అనుకుంది.

టార్చిలైటు వెలుగు ఆమెమీద పడింది. ఆ విషయం ముందే పసిగట్టి సునీత నేలమీద పడిపోయింది.

కాని అప్పటికే సమయం మించిపోయింది. వాళ్ళు తనను చూసినట్టుగా వాళ్ళమాటల్లో తేలిపోయింది. ఇక ఇప్పుడెలా అనుకుంది. ఏమయినాసరే తను వాళ్ళ చేతికి దొరకగూడదు.

టార్చిలైట్ వెలుగు ఆరిపోంగానే ఆమె లేచి మరో దిశగా పరుగెత్తసాగింది. వాళ్ళు లైట్ ని నేలమీద వేసుకుంటూ దారిచేసుకుని వస్తున్నారు. ఆమె పరుగెత్తుతూనే టార్చ్ వెలుగు ఎటు ప్రసరింపబడుతూందో గమనిస్తోంది.

గభాల్న నేలమీద పడుకుంది. ఆమెమీదుగా టార్చి వెలుగు పడి మరో దిశకు మరలింది. సునీత అలానే నేలమీదుగా ప్రాకుతూ కొంతదూరం వెళ్ళింది.

అంతలో కరుణాకరం గొంతు వినపడింది. "కారు హెడ్ లైట్లు వెలిగించండి. ఆ కాంతిలో ఆమె ఇట్టే దొరికిపోగలదు."

నీలకంఠం కారుని స్టార్ట్ చేసి పొలాల వేపుగా మళ్ళిం చాడు. ఇంజెన్ ఆపుచేసి లైట్లు వెలిగించాడు.

అదృష్టవశాత్తూ సునీత కారు లైట్ల రేంజ్ కి దూరంగా వుంది.

"లాభంలేదు. ముగ్గురూ టార్చ్ లైట్లు వెలిగించి ఒకసారే అన్ని దిక్కుల్లోనూ చూడండి" కమలాదేవి అరిచింది.

"కారు తాళాలు జేబులో వేసుకోండి ముందు. మనం ఇక్కడ ఆమెకోసం వెదుకుతుంటే ఆమె కారుదగ్గరకు చేరిందంటే ఇక ఆమెను పట్టుకోలేం!" మళ్ళీ కరుణాకరం అరిచాడు.

నీలకంఠం వెనక్కి వెళ్ళి కారు తాళాలు తెచ్చాడు.

"ఆమె పాడుబడ్డ షెడ్ దాకా వెళ్ళిందేమో చూశారా?"

"లేదు! ఆమె అంతదూరం పరుగెత్తలేదు. ఇంకా ఈ బీడులోనే ఎక్కడో వుండి వుంటుంది."

వాళ్ళు కరెక్ట్ గా ఊహించారు అనుకుంది సునీత. తను మరో వందగజాలు పరుగెత్తితేగాని పొదలదగ్గరకు చేరుకో లేదు. తూర్పు దిక్కునుంచి టార్చి వెలుగు దగ్గరౌతోంది. అలాగే పడమర దిక్కునుంచి మరో టార్చ్ వెలుగు వస్తోంది. ఆ రెండూ బీడు మధ్యలో కలుసుకున్నయ్.

"దొరకలేదా? మనం ముగ్గురం వున్నాం! ఆమె ఒక్క దాన్ని పట్టుకోలేక పోతున్నాం!" నీలకంఠం విసుగ్గా అన్నాడు.

ఈ తడవ టార్చిలైట్ల వెలుగులు పొదలవేపుగా వెళ్ళు తున్నయ్.

ముగ్గురూ నాలుగు దిక్కులా వెదుకుతున్నారు. వాళ్ళ మధ్యలో గడ్డిలో పడుకుని వుంది సునీత. తను ఎటూ వెళ్ళటానికి వీల్లేకుండా అయిపోయింది.

"చీకట్లో కళ్ళు పెద్దవిచేసి చూడండి. చెవులు రిక్కించి వినండి! ఏ చిన్న శబ్దం వినిపించినా ఆలకించండి!" కరుణాకరం అరిచాడు.

ఇలా ఊరికే పడుకుంటే లాభంలేదు! తనను దొరకబుచ్చుకోకముందే తను ఏదో ఒకటి చేయాలి! ఏదో మెత్తగా ఆమె చేతికి తగిలింది. పామా? కప్పా లేక ఎలుకా? ఆమె కంగారుగా అరవబోయి తమాయించుకుంది. తన అదృష్టం బాగుండి అది కప్ప కాబట్టి బ్రతికి పోయింది.

తల కొద్దిగా పైకెత్తి చూసింది సునీత. ఎక్కడా టార్చిలైట్లు వెలగటంలేదు. వాళ్ళు లైట్లు ఆర్పేసి చీకట్లో తనకోసం నిరీక్షిస్తున్నారల్లే వుంది అనుకుంది.

వాళ్ళెవరూ ఈ చీకట్లో తనకు కనుపించటంలేదు. అంటే వాళ్ళకూ తను కనుపించటం లేదన్నమాటే గదా! కనుక ఈ సమయంలోనే తను తప్పించుకోవాలి. ఎక్కడికి? తను ఈ మైదానంలో పరుగెత్తితే సునాయాసంగా పట్టుబడుతుంది. కనుక తనకు మళ్ళీ ఆ దయ్యాల మేడే శరణ్యం. వీళ్ళ కంటబడకుండా తను తిరిగి వెళ్ళి ఇంట్లోకి జొరబడితే ఏదో ఒక గదిలో దాక్కోవచ్చు.

తనకోసం వాళ్ళు రాత్రంతా పొలాల వెంట వెదికి వెదికి చివరకు విసిగిపోయి, తమ అన్వేషణకు స్వస్తి చెబుతారు. తమకు దొరికిన డబ్బుని చేజిక్కించుకుని వాళ్ళ దోవన వాళ్ళు వెళ్ళిపోయాక తను ప్రాణాలతో బయటపడవచ్చు.

పైకి లేవకుండా, సునీత కాళ్ళూ చేతులమీదనే గడ్డిలోనే చిన్నపిల్లలా పాకుతూ ఇంటివేపుగా మరలింది.

ఆమెకు రెండువేపులనించీ కరుణాకరం, కమలాదేవి, నీలకంఠం గొంతులు వినిపిస్తున్నయ్. అంతేకాదు. వాళ్ళు

క్రమేపీ దగ్గరౌతున్నట్టుగా వుంది. వాళ్ళు కలిసే చోటనే తను వున్నది. కనుక ఇరువైపులనుంచీ వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు కలుసుకునేలోగా తను ఇల్లు చేరుకోవాలి.

ఉష గొంతు వినిపించింది ఆమెకు. "నేను పూర్తిగా తడిసి ముద్దయిపోయాను. లోపలకు వెళ్ళి రెయిన్ కోటన్నా తెచ్చుకుంటాను."

"అఘోరించావులే! అలాంటి పనేం చేయకు. అరిచి గోలచేయక నోరుమూసుకుని వెతుకు!" నీలకంఠం గద్దించాడు.

వాళ్ళ గొంతుల్ని పట్టి, వాళ్ళు తనకు కనీసం యాభై, అరవయ్ గజాల దూరంలో వున్నారని గ్రహించింది సునీత.

అలాగే మరికొద్ది క్షణాలు ఆమె ప్రాకింది. అంతలోనే నేలమీద పడుతున్న టార్చిలైటు వెలుగు ఆమెకు చేరువగా వచ్చింది.

సునీత బ్రమాన్పడిపోయింది. ఊపిరి బిగపట్టుకుని అక్కడే పడుకుంది నేలను కరుచుకుని బల్లిలా. ఎవరిదో కాలు వచ్చి ఆమె పడుకున్న చోటునుంచి గజం దూరంలో పడింది. తను దొరికిపోయానని ఆశవదలుకుంది సునీత.

అంతలోనే ఆ వ్యక్తి అరిచాడు. "టార్చిలైట్లు ఆర్పివేయండి. ఏదో కారు వస్తున్నది రోడ్డమ్మటే. మనం ఇంత వానలో వెదకటం వాళ్ళకు అనుమానం కలిగించవచ్చు" కరుణాకరం కంఠం అది.

సునీత తలత్రిప్పి చూసింది. రోడ్డుమీద దూరంనుంచి కారు హెడ్ లైట్ల వెలుగు కనబడుతోంది. తన ప్రక్కనే వచ్చి నిలబడ్డ వ్యక్తి అక్కడ్నుంచి కదిలి వెళ్ళిపోయాడు.

రోడ్డుమీద కారు వెళ్ళిపోయింది ఆ ఇంటిని దాటుకుని. తనచుట్టూ దగ్గరలో ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని

గబగబ నేలమీద ప్రాకి ఇంటి ఆవరణలోని లాన్‌లోకి చేరుకుంది సునీత.

మల్లెపొదల చాటుగా లేచి నిలబడింది ఆమె. పొలాల్లో ఇంకా వాళ్ళు వెదుకుతున్నట్టు నిదర్శనంగా టార్చిలైట్ల వెలుగు ఆమె కంటికి కనబడుతోంది.

మధ్యమధ్యలో ఉష తను తడిసి ముద్దయిపోతున్నానని అరవటం, నీలకంఠంగానీ, కరుణాకరంగానీ ఆమెను మందలించటమో వినబడుతోంది.

పోర్టికోలోని చెట్లచాటుగా నక్కుతూ ఆమె ఇంటి కేసి నడిచింది. పూలచెట్ల ముళ్ళు ఆమెకు గీరుకుని బాధని కలిగించినయ్. ఇంటి వెనుకగా వంట ఇంటి వాకిలి చేరుకుంది ఆమె.

తను తిరిగి తిరిగి మొదట బయలుదేరిన చోటికే చేరాల్సి వచ్చింది. వారగా వేసివున్న తలుపు చప్పుడు కాకుండా తెరుచుకుని లోపలకు దూరింది. తన వెనుకనే తలుపు మూసేసింది. ఇప్పుడు తనింకా ప్రమాదకరమైన చోటుకు చేరుకుంది. తను లైట్లు వెలుగుతున్న ఇంటిలో వుంది. వాళ్ళు చీకట్లో వున్నారు. అంటే వాళ్ళు యింటివంక చూశారో తన వునికి తెలిసిపోతుంది.

కనుక తను వెంటనే మేడమీదకు వెళ్ళి ఎక్కడో చోట దాక్కోవాలి.

# 9

సునీత చప్పుడు కాకుండా చెక్క మెట్లు ఎక్కింది. ఆమె కంటికి ఎదురుగా టెలిఫోన్ కనిపించింది.

మెరుపులా ఆమె మనసులో ఏదో ఆలోచన మెదిలింది.

రిసీవరెత్తి పోలీస్ స్టేషన్‌కి డయిల్ చేసింది. సామా

న్యంగా ఫైర్ స్టేషన్ కీ పోలీస్ స్టేషన్ కీ ఊరూరా ఒకే నెంబరు వుంటుంది.

టెలిఫోన్ అవతలివైపు రింగ్ ఆగిపోయింది. ఎవరో రిసీవరెత్తారన్నమాట అనుకుంది.

"హలో! పోలీస్ స్టేషన్ ప్లీజ్!" అవతలి వైపునుంచి పలికారు.

"హలో సార్! నేను మద్రాసులో సేఠ్ రాజేశ్వర రావుగారి అమ్మాయిని సునీతను మాట్లాడుతున్నాను. మీరు త్వరగా రావాలి సార్! ఇక్కడ హత్య జరగబోతోంది" తడబడుతూ అంది సునీత.

"ఎక్కడనుంచి మీరు మాట్లాడేది? మీ ఫోన్ నెంబరెంత?"

"ఇక్కడంతా చీకటి సార్! ఫోన్ నెంబరు చూడాలంటే లైటు వేయాలి. లైటు వేశానంటే నేను వాళ్ళ చేతికి దొరికిపోతాను. నన్ను వాళ్ళు చంపేస్తారు!"

"నీకేం భయంలేదు. మేం ఇప్పుడే అక్కడికి చేరుకుంటాం. నీ అడ్రసన్నా చెప్పమ్మా!"

"రామాపురానికి రెండుమైళ్ళ ఇవతలే నిర్మానుష్యంగా రోడ్డు ప్రక్కనే ఏకాకిగా పాడుబడ్డ మేడ వుంది. అక్కడ్నుంచే నేను మాట్లాడుతూంట. మీరు త్వరగా రావాలి. నన్ను కాపాడేభారం మీదే!"

ఫోన్ పెట్టేసింది. ఎదురుగా ముసలమ్మగది వుంది. తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళింది. బహుశా గదిలో ముసలిదాని శవాన్ని చూడాల్సి వస్తుందేమో! అయినా కాసేపు తను ఎక్కడోక్కడ తలదాచుకోక తప్పదు.

గదిలోకి వెళ్ళి తలుపులు దగ్గరగా వేసింది. గడియ వేస్తే తనిక్కడే దాక్కున్నట్టు వాళ్ళకు ఇట్టే తెలిసిపోతుంది.

వెనక్కి తిరిగిన సునీతకు ఖాళీబెడ్ కనిపించింది. అయితే రోగంతో తీసుకుంటున్న ముసలిది ఏమయినట్టు? ఆమెను సఫాచేసి ఆమె శవాన్ని అప్పుడే మాయం చేసేశారా?

వానలో బయటనుంచి వాళ్ళ మాటలు వినబడు తున్నాయ్. "మన కళ్ళల్లో కారంకొట్టి ఆమె రోడ్డెక్కి తప్పించుకు పోయిందేమో!" కమలాదేవి అడుగుతోంది.

"అసంభవం! ఆమె ఈ ప్రాంతాల్లోనే ఎక్కడో దాక్కొని వుంటుంది. వెదికి పట్టుకోండి!"

నీలకంఠం కారు స్టార్టుచేశాడు. కారు హెడ్ లైట్లు అన్ని వేపులా పడేట్టుగా కారుని ఇటూ అటూ నడిపాడు.

"ఎక్కడా వున్నట్టులేదు. ఒకవేళ ఆమె మళ్ళీ ఇంట్లోనే దూరిందేమో!" నీలకంఠం అరిచాడు.

"అయితే ఇబ్బందే వుండదు. కలుగులో దూరిన కుందేలుని పట్టేసినట్టు పట్టేయచ్చు!" కరుణాకరం సంతోషంలో అన్నాడు.

"కాని నేను అలా అనుకోను. ఆమె ఇక్కడే ఎక్కడో దాక్కొని వుంటుంది. మనందరం ఇంట్లోకి వెళ్ళిపోయాక యీజీగా తప్పించుకుని పారిపోవాలని ఆమె ప్లాను. ఆమె పథకం పారిందంటే మనందరూ మిగతా జీవితమంతా జైల్లో గడపాల్సిందే. అందుకే ఆమెకోసం వెదకండి. మనకథ బైటి ప్రపంచానికి తెలియజేయకుండా ఆమె నోటిని శాశ్వతంగా మూయించాలి" నీలకంఠం మళ్ళీ బదులు పల్కాడు.

"అలా చీకట్లో మన గుట్టంతా అరిచి చెప్తావెందుకు? చీకటికి వెయ్యికళ్ళూ, చెవులూ వుంటాయ్!" కమలాదేవి వారించింది.

"ఇదిగో! మీ ఆడవాళ్ళిద్దరూ ఇంట్లోకి వెళ్ళి తలుపు

లన్నీ, కిటికీలన్నీ బంద్ చేయండి. మేమిద్దరం ఇక్కడ వెతుకుతాం!'' కరుణాకరం నాయకుడిలా ఆజ్ఞలిచ్చాడు.

“అలాగే! రావే ఉషా! మనం లోపలకు పోదాం!” అంటూ కమలాదేవి తన కూతురితో ఇల్లు చేరుకుంది.

# 10

సునీత ఆశ్చర్యంగా మంచంక్రింద కూడా చూసింది, ముసలమ్మ శవాన్ని అక్కడేమైనా దాచారేమో అని. కాని అక్కడా ఏమీ కనుపించలేదు. ఆమె శవంకోసం వెదుకుతూ తను విలువైన కాలాన్ని పాడుచేస్తున్నానేమో అనుకుంది. తను దాక్కోవటానికి వీలైనచోటు ఏదైనా వున్నదేమో అని వెతికింది.

కాని ఆ గదిలో ఎక్కడా ఆమె దాక్కోవడానికి ఆస్కారం దొరకలేదు.

గది కిటికీ దగ్గరకు వచ్చింది. కిటికీ ప్రక్కగా ఏదో పూలచెట్టు తీగలు దట్టంగా అల్లుకుని పైకి ప్రాకుతున్నాయ్.

కిటికీలోంచి మెల్లగా, జాగ్రత్తగా, త్వరగా క్రిందకు జారింది సునీత. కిటికీ క్రిందుగా అడుగు వెడల్పున స్లాబ్ వుంది. ఆ చోటులో చెట్టుతీగల చాటున నక్కింది ఆమె. ఇక తనను బ్రహ్మదేవుడుగూడ కనిపెట్టలేడు. తను కిటికీలోంచి దిగినట్టుగా ఎవరూ కనుక్కోలేకుండా కిటికీ తలుపుల్ని నెమ్మదిగా మూసేసింది.

అన్నట్టు అరగంటలో యెటూ పోలీసులు రానేవస్తారు. అంతదాకా తాను వీళ్ళకంటబడకుండా కాపాడుకుంటే చాలు!

అన్నట్టు ఈ పోలీసులింకా రారేం అనుకుంది మళ్ళీ.

ప్రతి క్షణమూ ఒక యుగంలా ప్రాణాల్ని అరచేతిలో పెట్టుకుని గడుపుతోంది.

పొలాల్లో వెదికి వెదికి వేసారి, చివరకు వాళ్ళిద్దరూ - నీలకంఠం, కరుణాకరం ఇంట్లోకి వచ్చేశారు.

"ఇల్లంతా గూడా వెదకండి ఒకసారి, ఎందుకయినా మంచిది" కరుణాకరం అన్నాడు.

ఆడవాళ్ళిద్దరూ క్రింద అంతటా, గదుల్లోనూ, వంట గదిలోనూ, బాత్ రూమ్, లావెట్రీల్లో గూడ వెదికి వచ్చారు.

నీలకంఠం మేడ మెట్లెక్కి ముసలమ్మ గదిలోకివచ్చాడు. గది అంతా కలయజూశాడు. బెడ్ క్రిందగూడ వెదికాడు.

చివరకు అక్కడ లేదని నిర్ధారణ చేసుకుని క్రిందకు దిగి వచ్చాడు.

"ఏమయివుంటుందబ్బా! మనందరం ఆమెను వెయ్యి కళ్ళతో కనిబెట్టే వున్నాంకదా?" నీలకంఠం ఆశ్చర్యంగా అన్నాడు.

"ఆమె యెక్కడ ఛస్తే మనకేం! ఆమె వెళ్ళి పోలీసుల్ని తీసుకరాకముందే మనం యిక్కడనుంచి వెళ్ళి పోవటం మంచిది" కమలాదేవి, కరుణాకరంవంక చూస్తూ అంది.

"ఇంట్లో లైట్లన్నీ ఆర్పేయండి! రోడ్డుమీద యేదో కారు వస్తున్నట్టుగావుంది. అర్ధరాత్రివేళ యిన్నిలైట్లు వెలగటంచూసి యెవరైనా అనుమానపడి యిక్కడకి రావచ్చు" కరుణాకరం రోడ్డుమీదకు చూస్తూ అన్నాడు.

మరుక్షణంలో క్రిందహాల్లో లైట్లు ఆరిపోయి డిమ్మర్ లు వెలుగుతున్నయ్.

వాన చాలవరకు తగ్గింది. గాలి నిలిచిపోయింది.

ఆ వచ్చేకారు పోలీసులదై వుంటుందా అని సునీత

సంబరపాటుతో ఆ లెట్లవంకే చూస్తోంది.

కాని అది పోలీసుకారు కాదు. ఆ యింటిని దాటుకుని వెళ్ళిపోయింది కారు. సునీతలోని వుత్సాహం చప్పబడి పోయింది.

ఇక తనకు ఆ భగవంతుడే దిక్కు! జీవితంలో ఎన్నడూ ప్రార్థించనంతగా ఆమె భగవంతుడ్ని ప్రార్థించుకుంది మనసులో. ముక్కోటి దేవతలనూ పేరు పేరునా తలుచుకుని మొక్కుకుంది ఈ ఆపదనుంచి రక్షించమని! త్వరగా పోలీసుల్ని పంపమని!

సునీత నిల్చున్న చోటునుంచి లాన్‌లో పార్క్ చేసిన కారు బాగా కనబడుతోంది.

హడావిడిగా తమ ముఖ్యమైన లగేజీని కారులో సర్దుతున్నారు అందరూ.

'హమ్మయ్య! వెళ్ళిపోతున్నారల్లే వుంది' అనుకుంది సునీత.

వాళ్ళు వెళ్ళిపోయినా తను పోలీసులు వచ్చేదాకా అక్కడే వుండటం మంచిది. ఎందుకంటే వాళ్ళు నిజంగా వెడుతున్నారో లేక తను దాక్కున్న చోటనుంచి బయట పడేలా మభ్యపెట్టటానికి యిలా ప్రయాణమాతున్నట్టు నటిస్తున్నారో!

"ఇంతకీ క్యాష్‌బ్యాగ్ ఎవరిదగ్గరుంది?" అని అడిగాడు కరుణాకరం.

"నా దగ్గరుంది!" కారు వెనుకసీట్లో కూర్చున్న నీల కంఠం జవాబిచ్చాడు.

స్టీరింగ్ ముందు కూర్చుని కారు డోర్ వేసేశాడు కరుణాకరం. ఇంజెన్ స్టార్ట్ అయింది.

'పీడా విరగడ అవుతున్నారు!' అని సంబరపడింది సునీత.

# 11

కారు లైట్లు వెలిగినయ్. కారుని బ్యాక్ చేస్తూండ డంలో లైట్లకాంతి వచ్చి ఆమెమీద పడింది. చెట్లతీగ దుబ్బులోంచి ఆమె చెయ్యీ, కాలూ బయటకు స్పష్టంగా కనబడుతున్నయ్ లైటు వెలుగులో.

సునీత తమాయించుకుంది. తను మొదటి అంతస్తు స్లాబ్ మీద నిల్చొనివుంది. లైటు వెలుతురు తనమీద పడినా వాళ్ళు తనను చూసివుండరు అనుకుంది.

కారు ఆగింది. తనను వాళ్ళు కనిపెట్టారా కొంపదీసి! ఆమె గుండె దడదడా కొట్టుకుంది.

కారులోంచి కరుణాకరం దిగాడు. "ఒక్క నిముషం, ఇప్పుడే వస్తాను" అంటూ ఇంట్లోకి నడిచాడు.

సునీత అక్కడి కక్కడే గడ్డకట్టుకుపోయింది. తనను పట్టుకోవటానికే కరుణాకరం వస్తున్నాడని గ్రహించింది. అయితే తనిప్పుడు నిస్సహాయురాలు. వెనక్కి పారిపోయేం దుకు ఆస్కారంలేదు. వేటకాడు ఆ దారినే తరుముకొస్తు న్నాడు. ముందరేమో పెద్దగొయ్యి. తను సాహసించి పై అంతస్తునించి దూకినా కాలో చెయ్యో విరగటం ఖాయం. పైగా కారులో కాచుకుని కూర్చున్న వ్యక్తులు వేటకుక్కల్లా తనమీద విరుచుకుపడతారు.

దభాలున కిటికీలోంచి తొంగిచూస్తూ "ఇక్కడ దాక్కున్నావా బుల్లీ!" అని వెటకరిస్తూ ఆమె చేయి పుచ్చుకున్నాడు.

"వదులు! నన్ను వదులు! లేదా ఒక్క గుంజు గుంజా నంటే ఇద్దరం మేడమీదనుంచి క్రిందకు పడతాం!" సునీత బెదరింపుగా అంది.

ఆమె చేయిచుట్టూ కరుణాకరం చేయి ఇంకా బలంగా బిగుసుకుంది. బలంగా ఆమెను లాగి కిటికీలోంచి బొమ్మను

ఎత్తినట్టుగా ఎత్తి లోపలకు దించాడు.

భయంతో పెద్దగా దిక్కులు మారుమ్రోగేలా కేక పెట్టింది సునీత. తనకు అవే ఆఖరు క్షణాలు అనుకుంది.

"ఒరేయ్! మల్లిగా! ఆమె నోరు కాసేపు మూసెయ్. మళ్ళీ ఏదో కారు వస్తోంది రోడ్డంట!" క్రిందనుంచి నీల కంఠం అరిచాడు.

సునీత కరుణాకరం చేతిని గట్టిగా కొరికింది. బాధతో అతడు తనపట్టు వదిలేశాడు. విలుకాడు వదలిన బాణంలా ఆమె మేడమెట్ల మీదుగా క్రిందకు పరుగుతీసింది. కరుణా కరం ఆమె వెంటబడ్డాడు.

వాకిలి దాటుకుని సునీత యింట్లోంచి బయటకు పరు గెత్తింది పెద్దగా అరుస్తూ. కరుణాకరం రెండోదఫా ఆమెను దొరకబుచ్చుకున్నాడు. ఆమె క్రింద పడిపో యింది. ఆమె నోరు గట్టిగా మూశాడు తన చేత్తో అదిమి పట్టి. అతడికి సాయం చేద్దామని నీలకంఠంగూడ కారుదిగి వాళ్ళ దగ్గరకు వచ్చాడు.

సునీత జుట్టుపట్టుకుని ఆమెను అటూఇటూ ఊగించాడు నీలకంఠం. కరుణాకరం పట్టు ఆమె కంఠంచుట్టూ బిగుసు కుంటోంది.

సరిగా అదే సమయంలో ఆ ముగ్గురిమీద కారు హెడ్ లైట్ల కాంతి పడింది.

"ఎవరది? మీకు బుద్ధిలేదూ! లైట్లార్పేయండి" అని అరిచాడు కరుణాకరం.

కాని ఆ లైట్లు తమ కారువి కావనీ, మరో కారో, జీప్ విగాని అయివుంటవని గ్రహించి అతడు అవాక్కయి పోయాడు. "పోలీసులు!" అన్నాడు అప్రయత్నంగా.

# 12

సునీతను వదిలేసి నీలకంఠం, కరుణాకరం యిద్దరూ చెరో వేపు పారిపోయారు.

పోలీస్ జీప్ లోంచి పోలీసులు బిలబిలమంటూ నీలకంఠాన్ని చుట్టుముట్టారు.

కరుణాకరం వయసులో వున్నవాడు. వేగంగా పరుగెత్తసాగాడు పోలీసుల కందకుండా.

పోలీస్ యిన్ స్పెక్టర్ రివాల్వర్ తీశాడు. ఇద్దరు పోలీసులు పారిపోతున్న కరుణాకరం మీదకు ఫ్లాష్ లైట్లు ఫోకస్ చేశారు.

ఇన్ స్పెక్టర్ చేతిలోని రివాల్వర్ 'ఢాం!' అంది. కరుణాకరం కాలికి దెబ్బతగిలింది. అతడు బోర్లా పడిపోయాడు.

పోలీసులు వేటకుక్కల్లా అతడిమీద పడ్డారు.

సునీత అలాగే నేలమీద పడివుంది. ఎవరో ఆమె ముఖంమీద నీళ్ళు జల్లారు. ఆమె కళ్లు తెరిచింది.

"నడవగలవా అమ్మాయ్!" అంటూ యిన్ స్పెక్టర్ చేయిచాచి ఆమెకు సాయంచేశాడు.

ఆమెను హాల్లో కుర్చీలో కూర్చోబెట్టారు. లైట్ల వెలుగులో తననుతాను చూసుకుంది సునీత. ఒళ్ళంతా, గుడ్డల నిండా బురద అయివుంది.

నీలకంఠం కుటుంబాన్ని పోలీసు కాపలాలో లోపలకు తెచ్చారు. ఉష మాత్రం పెద్దగా ఏడుస్తోంది, "నాకేమీ తెలియదు బాబోయ్! నేనే పాపమూ ఎరగను!" అని.

ఫ్లాస్కులోంచి వేడివేడి కాఫీ గ్లాసులో పోసి సునీతకి అందించారు.

"నీవేనా అమ్మాయ్ ఫోన్ చేసింది? నీ పేరేకదూ సునీత?" యిన్ స్పెక్టర్ అడిగాడు.

"అవునండీ! నేనే మీకు ఫోన్ చేశాను. నాపేరే సునీత!"

"సార్జెంట్! వెంటనే వైర్‌లెస్‌లో హెడ్ క్వార్టర్స్‌కి తెలియజేయి. సునీతాదేవి దొరికిందనీ, కులాసాగావుందనీ! రేణిగుంట కృష్ణా లాడ్జిలో ఆమె తండ్రిగారున్నారు. ఆయనకుకూడా ఈ విషయం తెలియజేయమను!"

"యస్ సార్!"

సునీత ఆశ్చర్యంగా చూసింది. "నేనెక్కడకూ పారిపోలేదండీ దొరకటానికి!" అంది ఆశ్చర్యంగా.

ఇన్‌స్పెక్టర్ నవ్వాడు. "ఓహో! నీవు వీళ్ళ అతిథిగా వున్నావన్నమాట ఈ మూడు రోజుల్నుంచీ!"

"అవునండీ! ఈ ఉషా, నేనూ పెన్ ఫ్రెండ్స్‌ము. ఆమెని చూడాలనీ, వాళ్ళింట్లో నాలుగు రోజులు గెస్ట్‌గా వుందామనీ ఇక్కడకు వచ్చాను. ఎయిర్‌పోర్టులో వీళ్ళు నలుగురూ నన్ను రిసీవ్ చేసుకుని, వాళ్ళ తాలూకు ముసలమ్మకు ప్రాణాలమీదకు వచ్చిందని చెప్పి ఇక్కడకు తెచ్చారు" సునీత ఆగి ఊపిరి పీల్చుకుంది.

ఇన్‌స్పెక్టర్ తననుచూసి నవ్వటం ఆమెకు చిరాకెత్తుతోంది. తనింత సీరియస్‌గా చెబుతూంటే అలా నవ్వుతాడేమిటి అనుకుంది.

"తర్వాత?" ఇన్‌స్పెక్టర్ అదే మూడ్‌లో అడిగాడు.

"వాళ్ళ ముసలమ్మ యాభైవేలు దాచిందని విన్నాను. ఆ డబ్బుకోసం ఆమెను సఫాచేసి ఆ డబ్బు దొరకబుచ్చుకున్నారు. ఈ రహస్యం నేను వెల్లడిస్తానేమో అని నన్నూ అంతంచేయాలని చూశారు. కాని నేను సమయానికి తప్పుకుని మీకు ఫోన్ చేశాను. ఆఖరి క్షణాల్లో మీరు వచ్చి రక్షించారు. లేకపోతే నేను ఈ పాటికి యమధర్మరాజు ముందర వుండాల్సినదాన్ని!" సునీత వెక్కి వెక్కి

ఏడ్చింది.

"ఇదంతా బూటకం! వాళ్ళాడిన నాటకం! నిన్ను ఇక్కడ రహస్యంగా దాచి రేణిగుంటనుంచి మద్రాసులో వున్న మీ నాన్నకు ఫోన్ చేశారు! ఏమని? సునీత తమ చేతుల్లో వున్నదనీ, రెండు రోజుల్లో లక్షరూపాయలు తమ కందచేస్తే సరి, లేదా మీ అమ్మాయిని చంపి ఆమె శవాన్ని పార్సిల్ చేస్తామని!

"ఈ విషయం పోలీసులకు గూడ తెలియజేయరాదని గూడ భయపెట్టారు. నీకోసం మీ నాన్న లక్షరూపాయలు తెచ్చి కరుణాకరానికి అందజేశాడు. ఈ తెల్లవారుజాముననే నిన్ను తిరిగి అప్పగించాల్సి వుంది. అందుకే మీ నాన్నగారు రేణిగుంటలో హోటల్లో దిగి నీ గురించిన సమాచారంకోసం ఆదుర్దాగా కాచుకూర్చున్నారు!" ఇన్‌స్పెక్టర్ తన కథ ముగించాడు.

"ఏమిటీ? వీళ్ళు నన్ను కిడ్నాప్ చేశారా? మా నాన్న నుంచీ లక్షరూపాయలు గుంజారా? నేను నమ్మలేకుండా వున్నాను!" సునీత విస్తుబోయింది.

"అరుగో మీ నాన్నగారు! వారినే అడుగు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నా తల్లీ! కులాసాగా వున్నావా? ఈ రెండు రోజుల్నుంచీ ఎన్ని బాధలు పెట్టారో నిన్ను!" అంటూ సునీత తండ్రి వచ్చి ఆమెను వాటేసుకున్నాడు.

"అయితే ఈ ఉష ఆమె కుటుంబం యింత నీచులా?" కోపంగా ఉషవంక చూస్తూ అడిగింది సునీత.

"ఈమె ఉష కాదు. ఈమె అసలుపేరు సరస్వతి. కరుణాకరం పేరుతో చెలామణి అవుతున్న వ్యక్తి అసలు పేరు రాజారావు. నీలకంఠం పోర్షన్ వహిస్తున్న వాడి పేరు కనకయ్య. అతడి భార్య కమలాదేవి ఉరఫ్ నరసమ్మ.

"ఈ యిద్దరు దంపతులూ లోగడ ప్రజల్ని మోసంచేసి డబ్బు కాజేసిన నేరాలపై జైలుకెళ్ళి వచ్చినవాళ్ళే.

"సునీత కలం స్నేహితురాలు ఉష తండ్రికి బెంగుళూరు ట్రాన్స్ ఫర్ అయి వెళ్ళిపోయాడు. బహుశా మీకావు త్తరం అందివుండదు. వాళ్ళు ఖాళీచేసిన యింట్లోకి కనకయ్య చేరాడు. సునీతనుంచి వచ్చే వుత్తరాలన్నీ చదివి రాజారావు సాయంకోరాడు. రాజారావు వెదికి వెదికి ఉష పోలికలు గల సరస్వతిని పట్టుకొచ్చాడు.

"ఎయిర్ పోర్ట్ లో సునీతను రిసీవ్ చేసుకున్నారు. జబ్బుపడ్డ ముసలమ్మను చూడాలనే నెపంమీద ఆమెను ఈ పాడుబడిన బంగళాకు తెచ్చారు. అంతకుముందే దాన్ని బాగుచేయించి తమ కవసరమైన ఫర్నిచర్ ని తెచ్చి పెట్టుకున్నారు.

"మేడమీద గదిలో ఖాళీ బెడ్ మీద టేప్ రికార్డర్ ని వుంచి, ముసలిదాని అరుపుల్ని క్రిందకు వినపడేలా చేశారు. దాంతో సునీత నిజంగా ముసిలామె జబ్బులో వున్నదనే నమ్మింది.

"ఈలోగా రాజారావు, సునీత తండ్రికి ఫోన్ చేసి; సునీత తమ ఆధీనంలో వుందనీ_ వెంటనే లక్షరూపాయలు అందజేయకపోతే ఆమెను చంపి పార్సెల్ చేస్తామనీ చెప్పారు" అంటూ ఇన్ స్పెక్టర్ వివరంగా చెప్పాడు.

అంతా విని సునీత కొయ్యబారిపోయింది.

—: ఐ పో యిం ది :—

# దేశద్రోహులు

## ఏ. వీ. మోహన్రావ్

రైలు వేగంగా పోతూంది.

వెనక్కి పరుగెడుతున్న టెలిగ్రాఫ్ స్తంభాలతోపాటు, నా ఆలోచనలు కూడా రెండుసంవత్సరాలు వెనక్కి పరుగిడసాగాయి.

రాఘవ, నేనూ త్రిలింగా ఎయిర్ లైన్స్‌లో పైలట్లుగా పనిచేసేవాళ్ళం. దేశం మొత్తంమీద మా యిద్దరికీ మంచి పేరుంది పైలట్లుగా. ఏక్సిడెంట్లు చెయ్యకుండా అప్పటికే మేమిద్దరం గాలిలో ఐదువేల గంటలకు పైగా ఎగిరివున్నాం. ఎంతోమంది మంత్రులనూ, విదేశీ ప్రముఖులనూ మేము గాలిలో త్రిప్పాం. అందరూ మమ్మల్ని మెచ్చుకున్న వాళ్ళే.

జీతాలు పెంచమంటూ ప్రారంభించిన సమ్మె వికృత రూపం దాల్చింది. గెహరోలు, ధర్నాలు దాటి హింసా కాండ, దౌర్జన్య చర్యలు అధిగమించి, దాదాపు సంవత్సరం పాటు కంపెనీ మూతపడింది. ఆ తర్వాత మా కంపెనీ యజమానులు అసలు కంపెనీనే మూసేశారు. దాంతో నేను హైద్రాబాదుకు వచ్చేశాను. రాఘవ బొంబాయి వెళ్ళిపోయాడు.

ఎన్నో ఉద్యోగాలకు ప్రయత్నం చేశాను. నా పేరు వినగానే భయపడిపోయే యజమానులు నన్ను తియ్యటి మాటలుచెప్పి పంపేశారు.

నష్టపరిహారంక్రింద త్రిలింగా ఎయిర్ లైన్స్ వాళ్ళిచ్చిన డబ్బు విచ్చలవిడిగా ఖర్చు పెట్టేశాను. రెండుదినాల క్రితం బ్యాంక్ ఏజంటు నా అకౌంటులో మూడొందలకు మించి లేదని చెప్పినప్పుడు, నాకళ్ళు నీళ్ళతో నిండి పోయాయి. మాట్లాడకుండా రూంకు వచ్చేశాను.

తలుపు తీయగానే, గుమ్మంవద్ద నీలంరంగు కవరు కను పించింది. గబగబ చించి చదివాను.

రాఘవ రాశాడు. ముక్తసరిగా మూడే వాక్యాలు రాశాడు. తన అడ్రసు రాసి, రెండుదినాలోగా వచ్చి కలుసుకుంటే, జీవితాంతం డబ్బుకు లోటులేకుండా వుండే మార్గం చూపిస్తానని హామీ యిస్తూ.

వెంటనే గది ఖాళీచేసేశాను. సామాన్లు సర్దుకున్నాను. బొంబాయికి టిక్కెట్టు కొనుక్కుని రైలెక్కాను.

రాఘవ ప్రస్తుతం ఏం చేస్తున్నాడు? ఊహించేందుకు ప్రయత్నించాను. నాకే ఎవ్వరూ ఉద్యోగం ఇవ్వలేదు. మరి అతనికీ నాకున్నంతే మంచిపేరే వుంది. అతనుమాత్రం ఎలా ఉద్యోగం సంపాదించి వుంటాడు? మరి అతనేం చేస్తున్నట్లు?

తను బ్రతకడంకాక, నాకు అతను జీవితాంతం డబ్బుకు లోటులేకుండా వుండేమార్గం చూపిస్తున్నాడంటే, మంచి స్థితిలోనే ఉండివుండాలనుకున్నాను. ఏమైనా రాఘవ స్నేహితాన్ని మరిచే మనిషికాడు. అతనివద్దనుండి వుత్తరం వచ్చిందాకా అతన్ని గురించి నేను ఆలోచించలేదన్న విషయం గుర్తొచ్చి బాధపడ్డాను రెండునిమిషాలు.

పడమట కనుమల మధ్యనున్న సొరంగాల్లో రైలు మెల్లగా పోతూంది. కంపార్టుమెంటు చీకటిగా మారింది. లైట్లు వెలుగుతున్నాయి. నేను సిగరెట్ త్రాగుతూ కూర్చున్నాను.

ఎదురుగా ఇద్దరు వ్యక్తులు కూర్చుని వున్నారు. వాళ్లు గంటముందునుండి మాట్లాడుతూనే వున్నారు. నాకు వాళ్ళ సంభాషణ అర్థంకాలేదు. కానీ మాటలలో దొర్లిన 'రోటా రిసెర్చి సెంటర్' అన్నపేరు నా దృష్టి నాకర్షించింది. అప్పటినుండీ వాళ్ళ మాటలు కాస్త జాగ్రత్తగా వినడం మొదలెట్టాను.

"డాక్టర్ పరేఖ్ ప్రపంచంలోని అణుశాస్త్రవేత్తల్లోకల్లా గొప్పవాడు. అతన్ని ప్రభుత్వం ఎంగేజ్ చేసి వుండాల్సింది. రోటా రిసెర్చి సెంటర్‌లో అతను పని చెయ్యడం గవర్నమెంటుకే అవమానం!" అన్నాడు ఒక వ్యక్తి.

"ప్రభుత్వాన్ని బ్రతిమలాడాడట! కానీ అతను అడిగిన జీతం యిచ్చేందుకు, కోరిన సదుపాయాలు కలుగచేసేందుకూ చాలా డబ్బు ఖర్చవుతుందని భయపడిందట. వెంటనే భజరంగ్ రోటా పరేఖ్‌ను కలుసుకుని అతను అడిగిన దానికన్నా రెండురెట్లు జీతం ఇస్తానని చెప్పి, తన రిసెర్చి సెంటర్‌కు పిల్చుకొచ్చాడట" అన్నాడు రెండో వ్యక్తి.

"పరేఖ్ ఏదైనా గొప్ప విషయం కనిపెడితే అది రోటాకు దక్కుతుంది. అతను వ్యాపారి. ఆ ఫార్ములాను ఏదైనా దేశానికి అమ్మకం చేసి పెట్టిన ఖర్చుకన్నా ఎక్కువే వస్తుంది" అన్నాడు మళ్ళీ మొదటివ్యక్తి.

నన్నాకర్షించింది రోటా రిసెర్చి సెంటర్ అన్న పేరు మాత్రమే. రాఘవ ఆ కంపెనీ అడ్రసే ఇచ్చాడు ఉత్తరంలో. అక్కడ అతనేం చేస్తున్నాడో నాకు అర్థం కాలేదు. శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేసేచోట పైలట్లకు ఏంపని వుంటుందో కూడా ఊహించలేకపోయాను.

మధ్యాహ్నం మూడింటికి బొంబాయి వి. టి. కి చేరింది రైలు.

దిగి సూట్‌కేస్ తీసుకుని బస్సెక్కి చెంబూర్ వెళ్ళాను. అక్కడో చిన్న హోటల్‌లో ఒక బెడ్ అద్దెకు తీసుకొన్నాను. రోజుకు పదిరూపాయలన్నాడు. ఆ గదిలో మొత్తం ఆరు మంచాలున్నాయి. అలాగే ఆరు అల్మైరాలున్నాయి. సూట్‌కేస్‌లో సామాన్లుతీసి అల్మైరాలో పడేసి తాళంవేశాను. స్నానపానాదులు ముగించుకొని డ్రెస్ చేసుకొని హోటల్ బయటపడ్డాను.

రోటా ఎస్టేట్స్ అక్కడికి మైలుదూరంలో వున్నాయని వాకబుచేసుకొని తెలుసుకొన్నాను. మెల్లగానడుచుకొంటూ వెళ్ళాను. విశాలమైన కాంపౌండ్‌లో పెద్దపెద్ద బిల్డింగులున్నాయి.

భజ్‌రంగ్ రోటాకున్న వ్యాపారాలన్నీ అందులోనే వున్నాయి. అతను ఇండియాలోకల్లా డబ్బున్న వాడనీ, స్వంత విమానాలు రెండూ, నౌకలు రెండూ వున్నాయని ఆ తర్వాత తెలిసొచ్చింది.

రిసెప్షను కౌంటర్‌లో రాఘవ గురించి వాకబుచేశాను. అతని పేరు చెప్పగానే అక్కడున్న జనం నన్నో వి. ఐ.

పి. లా చూడటం మొదలెట్టారు. నాలుగైదు చోట్లకు ఫోన్ చేసి "వారు రాత్రి భజ్‌రంగ్ లోటాగారితో ఢిల్లీ వెళ్ళారట. మీరు వస్తారనీ, రాగానే బాచ్‌లర్ క్వార్టర్సు లోని రూం నెంబరు అరవైఆరులో వసతి ఏర్పాటు చెయ్యమనీ చెప్పి వెళ్ళారట. మీకో కారుకూడా ఇస్తారు. సామాను ఏంలేదా?" అడిగాడు రిసెప్షను ఇన్‌ఛార్జి.

"ఉంది. హోటల్‌లో దిగాను" అన్నాను.

"సారీ! కారు తెప్పిస్తాను. మనిషినికూడా వెంటపంపుతాను. వెళ్ళి ఖాళీచేసి వచ్చెయ్యండి" అన్నాడు.

సరేనని తలూపాను.

అతను మళ్ళీ ఫోన్ చెయ్యసాగాడు. రెండు నిమషాలు మాట్లాడి ఫోన్ పెట్టేశాడు.

"ఐదునిముషాల్లో కారొస్తుంది" అన్నాడు.

"మా రాఘవ ఇక్కడేం చేస్తుంటాడు" ఆతృత ఆపుకోలేక అడిగాను.

"భజ్‌రంగ్ లోటాగారికి పర్సనల్ అసిస్టెంటు. ఆయన తర్వాత ఈ ఎస్టేటు మొత్తంలో చెల్లేది ఆయన మాటే. మీకు వారు ఏమవుతారు?" అడిగాడు భయంగా.

"స్నేహితుడు. రాఘవ ఎప్పుడొచ్చేది తెలుసా?"

"రేపు రాత్రికి వస్తారు."

"విమానంలోనేనా?"

"అవును. లోటాగారి విమానం నడిపేది ఆయనే."

"థాంక్స్!" అన్నాను.

అంతలో ఎర్రటి స్పోర్ట్సు కారొచ్చింది. డ్రైవింగ్ వీల్ దగ్గరో అమ్మాయి కూర్చునివుంది. రిసెప్షను ఇన్‌ఛార్జి నన్ను వెంటతీసుకొచ్చాడు వెలుపలకు.

"ఆవిడ మీకు తెలుసా?" అడిగాడు.

"తెలీదు!" అన్నాను.

"రాఘవగారి సెక్రటరీ రోజా!" అన్నాడు రిసెప్షన్ ఇన్‌ఛార్జి. తిన్నగా వెళ్ళి ఆమెతో రెండు క్షణాలు మాట్లాడి నన్ను రమ్మని చెయ్యి ఊపాడు. నేనూ వెళ్ళి కారుప్రక్క నిలబడ్డాను. నన్నామెకు పరిచయంచేశాడు.

"ప్లీజ్! గెట్ యిన్!" అంది నవ్వుతూ.

డోర్ తెరచి యెక్కి కూర్చున్నాను.

కారు కదిలింది.

"మీ ఫ్రెండు రాఘవ మీగురించి నాకంతా చెప్పారు. నిన్ననే వస్తారని యెదురుచూశాం!" అంది రోజా. అంత దాకా నేను ఆమె అందచందాల్ని పరీక్షగా చూడ సాగాను. పొందికగావున్న అవయవాల్లో అందం తొణికిస లాడుతోంది.

"అంతా చెప్పాడా? అంటే ఎంత మేడమ్!" నవ్వుతూ అడిగాను.

ఓరగా చూసి "గుడ్! మీరు చాలా తమాషాగా మాట్లాడుతారే!" అంది నవ్వుతూనే.

"రాఘవ ఇక్కడ ఏంచేస్తుంటాడు" అడిగాను.

"ఎస్టేటంతా ఆయనే! చెయ్యంది లేదు" అందామె.

"నన్నెందుకు రమ్మన్నాడో మీకు తెలుసా?"

"నా గోడు వినివిని తోడుగా వుంటాడని అనుకుం టాను."

"తోడా? ఎవరికి? వాడికా? మీకా?"

"ఇద్దరికీని."

"ఏమాత్రం జీతం ఇస్తారు?"

"ఆ వివరాలు నాకు తెలీదు. తనొచ్చేదాకా మీకు కావలసిన అన్ని ఏర్పాట్లుచేసి, బోర్ కొట్టకుండా చూడమని నాకు మరీ మరీ చెప్పి వెళ్ళాడు. అంతే!" అంది.

కారు చెంబూర్‌లోని చిన్న లాడ్జింగ్ హౌస్

ముందాగింది. నేను దిగి లోనికివెళ్ళి అల్మైరాలో వున్న సామానంతా సూట్ కేస్‌లో సర్దుకొని, కేష్‌లో డబ్బిచ్చి, బిల్లు తీసుకుని వెలుపలకు వచ్చాను.

స్టీరింగుముందు కూర్చుని క్యాగరు బాటిల్ ఖాళీచేస్తూ కనుపించింది రోజా! డోర్ తెరచుకుని కారెక్కాను. ఆమె బాటిల్ క్లోజ్ చేసి వెనుక సీటుపైన పడేసింది. కారు స్టార్ట్ చేసింది.

"మీరు ఆన్‌లో వున్నట్లున్నారు. నేను డ్రైవ్ చేస్తాను" అన్నాను.

"ఆక్సిడెంటు చేస్తానని భయంగా వుందా? తప్ప త్రాగి కారు తోలటం నాకు అలవాటే. భయపడకండి" అంది రోజా.

అంతటితో ఆ ప్రయత్నం విరమించుకున్నాను.

కారు ఎస్టేట్ బిల్డింగ్స్ మధ్యనుండి చేపలా ఈదు కుంటూ వెనుక వేపుకు వెళ్ళింది. అక్కడో పెద్ద మూడంతస్తుల భవనం ముందాగింది. రోజా దిగింది. నేనూ ఆమెవెంట క్రిందకు దిగాను సూట్ కేస్‌తో. ఇద్దరం లిఫ్టులో మూడో అంతస్తుకు వెళ్ళాం.

అరవై ఆరో నెంబరు ముందాగి "ఇది మీ గది! ప్రక్క నున్నది రాఘవది. ఇవతలవేపు నా గది వుంది" అంది.

"ఆడ, మగ, అంతా ఒకచోటే వుంటారా ఇక్కడ?" అడిగాను.

"లేదు! నేను మాత్రమే వుంటాను. ఈ అంతస్తులో వేరే ఎవ్వరూ లేరు. మనం ముగ్గురం మాత్రమే. ఈ చివర్న కిచెన్ వుంది. అందులో వంటవాడుంటాడు. ఇద్దరు సర్వెంట్స్ వున్నారు. బెల్ కొడితే పలుకుతారు" అంది.

తలుపు నెట్టాను. విశాలమైన పెద్ద గది. ఒకవైపు ఖరీదైన సోఫాసెట్ వుంది. దాని ప్రక్కనున్న టేబుల్

పైన టి. వి. వుంది. డబుల్ కాట్ గదివారగా వుంది. పెద్దపెద్ద అల్మైరాలు రెండున్నాయి. గోడలో చిన్న అరలో రకరకాల హాట్ డ్రింక్స్ వున్నాయి. దాని ప్రక్కనే లావెటరీ, బాత్ రూం వున్నాయి. గదంతా ఎర్రటి కార్పెట్ పరచివుంది.

"చాలా బాగుంది!" అన్నాను.

"ఏది?" అడిగింది రోజా.

"గది!" అన్నాను.

"మీరు కాసేపు రెస్ట్ తీసుకోండి. రాత్రికి సిటీలో కెళ్ళి ఎక్కడైనా భోంచేసి వద్దాం!" అంది రోజా.

"అలాగే!" అన్నాను.

రోజా అయిష్టంగానే గదిలోంచి వెళ్ళిపోయినట్లు అనిపించింది. ఆమె వెళ్ళాక తలుపువేసి సూట్ కేస్ ఒక మూలపడేసి మళ్ళీ గదంతా కలయజూశాను. ఎయిర్ కండిషన్ ప్లాంటు కూడా కనుపించింది. లేచి స్విచ్ ఆన్ చేసి మంచంపైన పడుకున్నాను.

రాఘువ అదృష్టవంతుడు. ఉద్యోగం పోయినా దాన్ని మించిన మంచి ఉద్యోగం సంపాదించగలిగాడు. స్నేహితుడ్ని మరచిపోకుండా, సాయం చెయ్యాలన్న వుద్దేశ్యంతో నాకు ఉత్తరం రాయటం ఎంతో ఆనందం కలిగించింది.

రోజా గుర్తుకొచ్చింది. రాఘువ ఆడవాళ్ళకు దూరంగా వుండేవాడు. ఈమె రాఘువను బాగా తెలిసినట్లు, అతని పైన ఏదో అధికారం వున్నట్లుగా చెప్పడం నాకు కొంత విచిత్రంగా తోచింది. ఏమయినా ఆమెకు దూరంగా వుండటం వివేకమనిపించింది.

## 2

ఫోన్ మ్రోగింది.

ఠక్కున లేచి కూర్చున్నాను. ఆ ఫోన్ ఎవరికోసమో? నాకు ఫోన్ చేసే వాళ్ళెవరూ లేరు బొంబాయిలో అనుకుంటూనే వెళ్ళి రిసీవరు పైకెత్తాను.

"హల్లో!" అన్నాను.

"రాఘవ హియర్! ఎవరు మాట్లాడేది. మోహన్ కదూ!" అడిగాడు అవతలివేపునుండి.

"అవును" అన్నాను.

"ఎప్పుడొచ్చావ్?" అడిగాడు రాఘవ.

"ఇవాళే! నువ్వు రేపు రాత్రికి రావడం ఖచ్చితమేనా?"

"ఆఁ! నేనొచ్చేదాకా నీకు కంపెనీగా వుండమని రోజాతో చెప్పాను. డబ్బు కావాలంటే ఆమె దగ్గరుంది. దేనికీ మొహమాటపడకుండా ఆమెనడిగి తీసుకో. ఓ. కే" అంటూ లైన్ కట్ చేశాడు. క్లిక్‌మన్న శబ్దం వినొచ్చింది. రిసీవరు క్రేడిల్ పైన పడేశాను.

నన్నెందుకు రమ్మన్నాడో అడుగుదామన్న ఆలోచన వచ్చింది. కానీ అడిగే లోపుగానే ఫోన్ కట్ చేశాడు రాఘవ.

మళ్ళా ఫోన్ మ్రోగింది. రిసీవర్ ఎత్తాను.

"నేను రోజాను" అంది.

"రాఘవ మాట్లాడాడు. రేపు రాత్రికి వస్తానన్నాడు" చెప్పాను.

"ముందు నాతో మాట్లాడాడు. నువ్వు అరగంటలో తయారవుతావా? వెళ్దాం!" అంది రోజా.

"అలాగే!" అన్నాను.

"థాంక్స్!" అంది రోజా. వెంటనే ఫోన్ కట్ చేసింది.

షవర్ క్రింద కూర్చున్నాను. చల్లటి సన్నటి నీటి తుంపరలు వొంటిపైన పడుతుంటే చాలా ఆనందంగా

వుంది. రోజా అందమైన రూపం పదేపదే గుర్తుకు రాసాగింది. ఒకవేళ రాఘవ ఆమెను అతనికోసం తెచ్చి వుంచుకున్నాడేమోనన్న అనుమానం కలిగింది నాకు. ఆమెను గురించి చెడ్డగా ఊహించటం చేతకాలేదు.

డ్రెస్ చేసుకుని సిద్ధమయినాను. రోజా వచ్చింది. పింక్ కలర్ సారీ, బ్లౌజ్, బాబ్ చేసిన జుట్టు, మెళ్ళో పింక్ పెరల్స్ నెక్లెస్, ఆహ్లాదకరంగా వుందామె రూపం.

"వెళ్దామా?" అడిగింది.

"నేను పదినిముషాలనుండి వెయిట్ చేస్తున్నాను" అన్నాను.

"సారీ! పదండి!" అంది.

ఇద్దరం దిగి క్రిందికొచ్చాం. పోర్టికోలో వున్న కారెక్కాం. కారు రివ్వుమని రోడ్‌ను చీల్చుకుంటూ పోయింది. అరగంట తర్వాత తాజ్ హోటల్ ముందాగింది కారు. దిగి లోనికి వెళ్ళాం. ఖరీదైన దుస్తుల్లో వున్న జనం అటూ ఇటూ తిరుగుతూ కనుపించారు. నా దగ్గర పర్సులో మొత్తం నూరు రూపాయలకన్నా కాస్త తక్కువగానే వున్నాయి.

"ఇది చాలా ఖరీదైన హోటల్ కదూ!" అడిగాను ఆమెతో మెట్లెక్కుతూ.

"అయితేనేం!" అంది.

"నా దగ్గర వందకన్నా ఎక్కువలేదు" అన్నాను.

"నీచేత ఖర్చు పెట్టించేందుకు కాదు పిల్చుకొచ్చింది" అంది రోజా.

ఇద్దరం రెస్టారెంటులోకి వెళ్ళాం. స్ట్రిప్ టీజ్ డాన్స్ షో మొదలయింది. వెయిటర్ రోజాను చూడగానే బాగా తెలిసినట్లు మాట్లాడి ఆర్డరు తీసుకొని వెళ్ళిపోయాడు. విస్కీ, సోడా, ఐస్ తెచ్చిపెట్టాడింకో

వెయిటర్.

త్రాగటం మొదలెట్టాం. కొంతమంది రోజాను చూసి నవ్వి వెళ్ళసాగారు.

"నీకు ఈ హోటల్ బాగా తెలిసినట్లుందే!" అన్నాను.

"అరేళ్ళుగా వస్తున్నాను" అంది త్రాగుతూ.

"ఐ. సీ" అన్నాను.

"మిస్టర్ మోహన్! దేశమంటే నీకు ఎలాంటి అభిప్రాయంవుంది" అడిగింది రోజా.

"నీ ప్రశ్న నా కర్థంకాలేదు" అన్నాను.

"నీకు దేశమంటే భక్తి వుందా లేదా?" సూటిగా అడిగింది రోజా.

ఆ ప్రశ్న, ఆ వాతావరణంలో యెందుకడిగివుంటుందాని ఆలోచించాను. అర్థంకాలేదు. ఆమె తత్వం, తీరు, నాకు దేశభక్తి లేకుండటం మంచిదనుకుంటుం దనిపించింది. ఆమెకు నా అభిప్రాయాలు నిర్మొహమాటంగా చెప్పడం ఇష్టంలేకపోయింది. కానీ రాఘవకు తెలుసు నాకు దేశమంటే యెంత ప్రేమవుందో?

"ఎవరికుండదు భక్తి? అందరికీ వుంటుంది" అన్నాను.

"నేనడిగింది ఎవరి సంగతో కాదు! నీసంగతి?"

"నీసంగతేమిటి?"

"నాకు లేదు! నాకేం చేసింది దేశం. గౌరవంగా తిండి, బట్టా సంపాదించుకొనే అవకాశం ఇవ్వలేదు. ఉద్యోగం దొరకక ఆకలికి మలమలమాడటమంటే నాకు తెలుసు మోహన్. చివరకు శరీరాన్ని అమ్ముకొని బ్రతికాను. ఆ అందమే నా కుపయోగించింది తప్ప, చదువు, సంస్కారం సంప్రదాయం కాదు. అలాంటప్పుడు నాకెందుకుండాలి ప్రేమ. అందుకే వ్యక్తిగతంగా నాకు లాభించేట్లుంటే దేశానికి ద్రోహం చెయ్యడానికయినా నేను వెనుదీయను"

అంది రోజా.

ఆమె అభిప్రాయం అర్థమయింది. ఈ ప్రశ్నకు నేనిచ్చే సమాధానంపైనే నాకూ రాఘవకూ మధ్య తెగినసంబంధం తిరిగి ఏర్పడ్డం జరుగుతుందనిపించింది.

"నువ్వు చెప్పింది నిజమే! నాకూ దేశమంటే పిచ్చి ప్రేమ వుండేది. అవసరమైతే ప్రాణాలివ్వాలనిపించేది. గత రెండేళ్ళలో ఆ పిచ్చి వదలిపోయింది. అందరూ నన్నో వెధవను చూసినట్టు చూశారు. డబ్బున్న ప్రతి వెధవా సంఘంలో గొప్పవాడు. తెలివిగలవాడుగా చలామణి అవుతున్నాడు. ఆ డబ్బు వాడెలా సంపాదించాడో యెవ్వరికీ అవసరంలేదు. అందుకనే నాకు న్యాయమో అన్యాయమో డబ్బు సంపాదించాలన్న అభిప్రాయం ఏర్పడింది" అన్నాను.

వెయిటర్ చికెన్, మొదలైన సామగ్రి తెచ్చిపెట్టాడు. తినటం ప్రారంభించాం.

"నీకు ఉత్తరం రాసేముందు రాఘవ చాలాదినాలు తటపటాయించాడు. నేనే ధైర్యం చెప్పాను. నువ్వీపాటికి మారిపోయివుంటావని ఊహించాను. నా ఊహ నిజమయింది. నిన్నుచూచి రాఘవ చాలా సంతోషపడతాడు" అంది రోజా.

"ఏదైనా దేశానికి ద్రోహం తలపెట్టాడా రాఘవ?" వంగి అడిగాను.

"లేదు! వివరాలు తర్వాత తెలుస్తాయి. ఇంకావిషయం గురించి మర్చిపో. రాఘవ వచ్చాక మాట్లాడుకొందాం" అంది రోజా.

ఇద్దరం మరేం మాట్లాడుకోకుండానే భోజనం చేశాం. దాదాపు మూడువందలయింది బిల్లు. రోజా పర్సు తెరచి ఇచ్చింది. వెలుపల కొచ్చి కారెక్కాం. నన్ను డ్రైవ్

చెయ్యమంది కారు. నేను స్టీరింగుముందు కూర్చున్నాను. ఆమె నన్ను ఆనుకొని కూర్చుంది. నాకు ఒంటిపైన త్రేళ్లు పాకినట్లుగావుంది.

"నేను బాగుండనా?" అడిగింది.

"లేదు!"

"మరెందుకలా ఇబ్బందిగా కూర్చుంటావ్. ఐ లైక్ యూ" అంది.

"సారీ! నువ్వు రాఘవ మనిషివి. వాడికి ద్రోహం చెయ్యడం..." అన్నాను.

"దేశానికి ద్రోహం చెయ్యగలం మనం. మనిషికి ద్రోహం చెయ్యడం తప్పులేదు. అయినా ఇందులో ద్రోహం లేదు. నేను ఇష్టపడుతున్నాను. రాఘవకు తెలిసినా ఏమీ అనుకోడు. నేను పతివ్రతను కాదని అతనికి బాగా తెలుసు" అంటూ సర్ది చెప్పింది.

ఆమె ఆ మాట చెప్పాక నేను బాగా ఫ్రీగా కూర్చుని డ్రయివ్ చేశాను.ఇద్దరం మళ్ళీ ఎస్టేటుకొచ్చాం. ఆ రాత్రి ఆమె నాతోనే వుంది. వేకువఝాముున మధ్య నున్న డోర్ తెరుచుకుని వెళ్ళిపోయింది తన రూంలోకి.

మరుసటి దినం పగలంతా పిచ్చిపట్టినట్లు ఎస్టేటంతా తిరగసాగాను. లోపల అన్నివైపులా సెక్యూరిటీ గార్డ్సు వున్నారు. మొత్తం ఆరేడు ఫ్యాక్టరీలున్నాయి ఆ ఆవరణలో. రిసెర్చిసెంటర్ మాత్రం దూరంగా సముద్రపు టొడ్డున వుంది. సముద్రపు ఒడ్డునే చాలా దూరం నడిచాను. ఒకచోట రెండు పెద్ద మోటారుబోట్లు వున్నాయి. ఒకబోటు దగ్గర నలుగురయిదుగురు మనుషు లున్నారు. నేను అక్కడ్నుంచి ఇంకొంతదూరం వెళ్ళి బట్టలువిప్పి పెట్టి స్నానంచేసేందుకు సముద్రంలో దిగాను.

పది నిముషాల తర్వాత బోటు బయలుదేరింది. నేను

నీళ్ళల్లో వుండే చూడసాగాను. స్పీడుగా సముద్రంవైపు వెళ్ళిపోయింది. దూరంగా పెద్ద నౌక కనుపించింది. మోటారు బోటు బహుశా దాని దగ్గరకే వెళ్తుండవచ్చను కున్నాను.

బొంబాయి సముద్రతీర ప్రాంతాల్లో స్మగ్లింగ్ గ్యాంగ్‌లు చాలా వున్నట్లు ఆదివరకే విని వున్నాను. ఈ బోటుకూడా ఆ బాపతుదయివుండాలనిపించింది. అంటే భజరంగ్ రోటాకు స్మగ్లింగ్ వ్యాపారం కూడా వుండి వుండాలి. ఆ బోటు తిరిగొచ్చిందాకా అక్కడే వుండి అందులోంచి ఏమేం దించుతారో చూద్దామనుకున్నాను. నాలుగైదు గంటల తర్వాత మసక చీకటి ముసురు కుంటూండగా వచ్చింది బోటు.

నేను మెల్లిగా దాని దగ్గరకు నడచుకుని వచ్చాను. బోటులోనుండి రకరకాల విదేశీసామగ్రి దించుతున్నారు. సిగిరెట్లు, డ్రింక్స్, గడియారాలు, గుడ్డలు, పదిమంది మనుషులు మోసుకొనిపోతూనే వున్నారు. నన్నెవ్వరూ గమనించలేదు. నేను అక్కడ్నుంచి కదలి తిన్నగా గదికి వెళ్ళాను.

రోజా నా గదిలోనే వుంది.

"ఎక్కడికెళ్ళావ్?" అడిగింది కోపంగా.

"సముద్రం దగ్గరకు" అన్నాను చొక్కా విప్పుకుంటూ.

"నాకు చెప్పకుండా వెళ్ళావేం!"

"నువ్వు రాత్రంతా నిద్రలేకుండా వుండడంతో, మత్తుగా నిద్రపోతున్నావేమో ననుకున్నాను. అందుకే చెప్పకుండా వెళ్ళిపోయాను" అన్నాను.

"నువ్వెవరని ఎవరయినా అడిగారా?"

"లేదు! ఎవ్వరితోనూ మాట్లాడలేదు నేను."

"మంచి పని చేశావ్. రాఘవ వచ్చాక రోటాగారితో

మాట్లాడుతాడు. అందాకా నువ్వు జాగ్రత్తగా వుండాలి'' అంది రోజా.

''అలాగే! ఇవాళ వస్తాడుగా రాఘవ'' అన్నాను సోఫాపైన కూర్చుంటూ.

''అవును'' అంది రోజా.

''రాఘవ ఇక్కడికెలా వచ్చి చేరాడో నీకు తెలుసా రోజా! ఇందాకే గమనించి చూశాను. స్మగ్లింగ్ వ్యాపారం కూడా వున్నట్లుంది వీళ్ళకు.''

''వుంది. రాఘవే నన్ను చేర్చాడీ ఎస్టేటులో'' అంది రోజా.

# 3

ఆరోజు రాత్రి పదకొండు గంటలకు వచ్చాడు రాఘవ. రూం తలుపు తట్టాడు. తెరచాను. చూచి పోల్చుకోలేక పోయాను. మనిషి సన్నబడిపోయాడు. తలంతా తెల్లగా ముగ్గుబోటులా వుంది. ఖరీదైన సూటు తొడుక్కుని వున్నాడు.

నన్ను చూడగానే కౌగలించుకున్నాడు. వాడి అభిమానం చూస్తుంటే నా కళ్ళు ఆర్ద్రమయినాయి.

''అన్ని ఏర్పాట్లు బాగున్నాయా?'' అడిగాడు.

''ఎక్సలెంట్. ఇప్పుడేనా రావడం'' అడిగాను.

''ఇప్పుడే వచ్చాను. రెస్ట్ తీసుకో. ప్రొద్దున మాట్లాడుకుందాం'' అన్నాడు రాఘవ. వెంటనే లేచి వెళ్ళిపోయాడు గదికి. అతను తలుపు తట్టేదాకా నా గదిలోనే వుంది రోజా. ఆ శబ్దంవిని డోర్ తెరచుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది. కానీ ఆమె విప్పిన చీర మాత్రం అక్కడే పడివుంది. రాఘవ దాన్ని చూశాడేమోనని భయపడ్డాను.

రోజాకు దూరంగా వుండి వుండాల్సిందని రాఘవను

చూశాక నా కనిపించింది. కానీ ఆమె నన్ను క్షణం వదలడం లేదు. నా జోలికి రావద్దని చెప్పాలని నిర్ణయం చేసుకుని పడుకున్నాను.

మరునాడు తొమ్మిదింటికి రాఘవ, రోజా ఇద్దరూ నా గదికి వచ్చారు.

ముగ్గురం కాఫీలు తాగాం.

"నన్నెందుకు రమ్మన్నావ్?" అడిగాను నేను.

"చెప్పేందుకే వచ్చాను. ఇది చాలా ప్రమాదకర మయిన పని. ఇందులో ప్రాణాలు పోవచ్చు. అలా పోకున్నా అవి వున్నంతవరకు మనం మళ్ళీ ఈ దేశం వచ్చే అవకాశంకూడా వుండదు. కానీ ఈ పని దిగ్విజయంగా జరిగితే మన ముగ్గురికీ ముప్ఫయి లక్షల రూపాయలు ముడ తాయి. నీకు ధైర్యముండి దిగుతానంటే వివరాలు చెపు తాను" అన్నాడు రాఘవ సిగరెట్ వెలిగించుకుంటూ.

"ముందు చెప్పు. ఆ తర్వాత దిగేదీ లేనిదీ చెపు తాను" అన్నాను.

"అలా కాదు. దిగుతానంటేనే వివరాలు చెపుతాను. అవి విన్నాక నీ కిష్టంలేకున్నా వెళ్ళడం అసాధ్యం. ఆలో చించుకో! కావాలంటే సాయంత్రం దాకా టైమిస్తాను" అన్నాడు రాఘవ.

"అవసరం లేదు చెప్పు" అన్నాను.

"కోటా రిసెర్చి సెంటర్‌లో డాక్టర్ పరేఖ్ అనే ప్రపంచ ప్రసిద్ధ శాస్త్రవేత్త అణ్వస్త్రాలను నిరుపయోగం చేసే గాస్ నొకదాన్ని కనుక్కునేందుకు తంటాలు పడు తున్నాడు. అతని ప్రయోగాలు చాలావరకు ఫలించాయి. అతను ఫార్ములాలు సిద్ధం చేస్తున్నాడు. ఈ నెల ముప్ఫయి ఒకటవ తేదిన కలకత్తాలో మనదేశ రక్షణ మంత్రికి, ఇండి యన్ సైన్స్ కాన్ఫరెన్స్‌లో అందజెయ్యబోతున్నాడు"

అంటూ ఆగాడు.

"గుడ్! దీంతో ప్రపంచ వినాశనం తప్పుతుంది" అన్నాను.

"అణ్వాస్త్రాలు దాచుకున్న దేశాల భయమదే! ఆ సెంటిస్టును, అతని ఫార్ములాలను వాళ్ళకు అప్పగించితే పదికోట్ల రూపాయల విలువజేసే బంగారాన్ని భజ్ రంగ్ రోటాకు ఇస్తామన్నారు. దానికి రోటా ఒప్పుకున్నాడు. ఆ కార్యభారం నాపైన పడింది. దీన్ని నిర్విఘ్నంగా నెర వేర్చడంలో నీ సాయం కావాలి! ఏమంటావ్?" అడిగాడు రాఘవ.

"మరో విధంగా అనే అవకాశం వుండదని నువ్వు ముందే చెప్పావ్. నీతో బాటే నేనూను. నీ ప్లానేమిటి?"

"ఇక్కడ్నుంచి పరేశ్ ను కలకత్తాకు మన స్వంత విమానంలో తీసుకుని వెళ్తాం. కానీ విమానం అక్కడ దిగ కూడదు. అతన్ని అలానే అపహరించుకుని పోవాలి. అందుకు మనం ఎలా చెయ్యాలో ఆలోచించుకోవాలి" అన్నాడు రాఘవ.

"ఎవరికి ఏ దేశంలో అప్పగించాలి."

"కలకత్తానుండి మూడు వేల కిలోమీటర్ల దూరంలో ఒక దీవి వుంది. అక్కడ ఈ విమానంకోసం చిన్న ఎయిర్ పోర్టు కట్టారు. మనం అక్కడ దిగితే చాలు. మిగిలిన పని వాళ్ళు చూసుకుంటారు."

"రాఘవ్! విమానాన్ని దొంగిలించుకొని పోవడం అంత సులభంకాదని నీకూ తెలుసు. పైగా దీని కోసం రక్షణమంత్రి, సాయుధ సిబ్బంది ప్రధానాధికారులు, వగైరా ఎదురుచూస్తూ వుంటారు. అసలు మన విమానంలో పరేశ్ ను తీసుకుపోయేందుకు ప్రభుత్వం ఒప్పుకుంటుందని నాకు నమ్మకం లేదు. ఆఖరి క్షణంలో వాళ్ళే

ఎయిర్ ఫోర్స్ ప్లేన్‌లో పంపమనవచ్చు. అప్పుడు మన ఆట కట్టవుతుంది. ఇవన్నీ ఆలోచించారా?'' అడిగాను.

''భజ్‌రంగ్ గార్ని అడిగాను. ఆయనకు ప్రభుత్వం పర్మిషన్ ఇచ్చిందని చెప్తున్నాడు'' అన్నాడు రాఘవ.

''మనం ఏమవుతాం?''

''ఏ దేశంలో కావాలన్నా వుండేందుకు అనుమతి ఇవ్వడమే గాకుండా, ఆ దేశపు పౌరసత్వపు హక్కులు ఇస్తామని వాగ్దానం చేశారు.''

''డబ్బెవరిస్తారు?''

''వాళ్ళే!''

రాఘవ అనుకున్నంత చిన్నదీ, సులభమైనదీ కాదీ విషయమని నాకు త్వరగానే అర్థమయింది. దిగాక దీని అంతు తేల్చుకోవలసిందే ననుకున్నాను.

''రాఘవ! మన ప్లాను చాలా పకడ్బందీగా తయారు చెయ్యాలి. ఏమాత్రం తప్పటడుగు వేసినా మన తలలు ఉరికంబాలకు వేళ్ళాడుతాయి. నాకు కొంత టైమియ్యి. ఒకమారు భజ్‌రంగ్ రోటాతో మాట్లాడే వీలు కల్పించ గలవా?'' అడిగాను.

''ఏం మాట్లాడతావ్?'' అడిగాడు రాఘవ.

''నువ్వూ వుంటావుగా? విను! తెలుస్తుంది'' అన్నాను.

''అందుకుగాదు. ఆయన చాలా మితభాషి. నీ కాయన పైన అనుమానం లేదుగదా?''

''అలాంటిదేమీ లేదు. ఇందులో మనం ముగ్గురంవున్నాం. నాతోపాటు మిమ్మల్ని కాపాడడం నా విధి. మనం చేయ బోతున్నది అంతర్జాతీయ నేరం. మన ప్రాణాలకోసం ఎందరో వేటాడుతారు. అలాటప్పుడు మనం ఎన్నో జాగ్ర త్తలు తీసుకోవాలి. కాదంటావా?''

''అనను. అయినా నువ్వు నాకన్నా తెలివిగలవాడివి.

అందుకే నిన్ను రప్పించాను. మొత్తం భారం నీనెత్తిపైనే వేస్తున్నాను. నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను నేను. అంతే!” అన్నాడు రాఘవ.

రోజా మాటా పలుకూ లేకుండా వింటూ కూర్చుంది.

# 4

అదే రోజు రాత్రి నేనూ, రాఘవ కారెక్కి భజ్‌రంగ్ రోటా బంగళాకు వెళ్ళాం. మలబార్ హిల్ పైన వున్న పాలరాతి భవనం ముందాగింది కారు. పోర్టికో దిగి రెండో అంతస్తులో వున్న రోటాగారి గదికి వెళ్ళాం.

పెద్ద టేబుల్ వెనుకవేపు సింహంలా కూర్చుని వున్నాడు రోటా. ఎడంచేతివేపు రంగురంగుల టెలిఫోన్లు ఏడెనిమిది వున్నాయి. అతన్ని చూడగానే అరవై సంవత్సరాలు వుంటాయనిపించింది.

“నా స్నేహితుడు. టాప్ పైలట్. పేరు మోహన్!” పరిచయం చేశాడు నన్ను.

“గుడ్! నాతో మాట్లాడాలని అన్నావట కదూ!” అడిగాడు భజ్‌రంగ్.

“అవును” అన్నాను తలవంచుకుని.

“చెప్పు.”

రాఘవ విషయం చెప్పాడు. కలకత్తా విమానాశ్రయాన్ని తప్పించుకుని వెళ్ళడం సులభంకాదన్న విషయం నాకన్నా రాఘవకు తెలుసు. “అక్కడ చాలా పవర్‌ఫుల్ రాడార్ వుంది. రెండొందల కిలోమీటర్ల వ్యాసార్ధంలో విమానం ఎక్కడున్నా వాళ్ళు ట్రేస్ చెయ్యగలరు. దిగవలసిన సమయానికి దిగకపోయిన వెంటనే, వాళ్ళు మన దగ్గరున్న విమానంకన్నా స్పీడ్‌గా పోయే విమానాల్ని పంపి పట్టుకోగలరు. అది ఆలోచించారా?” అడిగాను.

“అవన్నీ మీరాలోచించుకోవాలి! నావల్ల కావలసిన సాయమేదో చెప్పాలి! అంతే!” అన్నాడు రోటా. అతని మాటల తీరులో ఒక విధమయిన కర్కశత్వం ధ్వనించింది.

“మేము ఆ దీవిలో దిగాక వాళ్ళు తమ రహస్యం కాపాడుకునేందుకు వీలుగా మమ్మల్ని కాల్చిపారెయ్యరన్న గ్యారంటీ కావాలి!” అన్నాను.

“తర్వాత...”

“మీరు పదికోట్లు సంపాదిస్తూ, మాకు కేవలం ముప్ఫయి లక్షలు ఇవ్వడం న్యాయంకాదు. మాకు కనీసం సగమన్నా రావాలి!”

“ఆ తర్వాత.”

“ఇస్తామన్న డబ్బులో సగం ముందుగా ఇవ్వాలి. మేము ఈ దేశం విడిచిపెట్టి పోతున్నాం. మా కుటుంబాలకు ఆర్థికంగా ఏ లోటు లేకుండా చేసి వెళ్ళడం కనీస ధర్మం!”

“ఇంకా...” అంటూ ముందుకు వంగాడు.

“ఇంకేమీ అవసరంలేదు. ఇంతవరకు జరిపితే చాలు. ప్రాణాలకు తెగించి పని సక్రమంగా నెరవేరుస్తాం” అన్నాను.

“రేపు కనుపించండి మీరిద్దరూ. నేను చెప్పదలచుకొన్నది చెప్తాను” అన్నాడు రోటా.

“అలాగా!” అని లేచాను. రాఘవకూడా లేచాడు.

ఇద్దరం వెలుపలికొచ్చి కారెక్కాం.

“మా బాస్‌కు బాగా కోపం వచ్చింది!” అన్నాడు రాఘవ.

“ఎందుకు! నే నడిగిన దాంట్లో తప్పుందా?”

“డబ్బు విషయంలోనే నువ్వు మరీ ఎక్కువడిగావు.”

“అతను మీకు మరీ తక్కువ చెప్పాడు. అందుకే ఎక్కువడిగాను. కనీసం మనిషికి కోటిరూపాయలన్నా

దశాల్చాలి."

"రేపేం చెపుతాడో! నిన్ను రంగంలోకి తెచ్చినందుకు నాపైన విరుచుకుపడతాడేమోనని భయంగావుంది. అంత డబ్బిస్తే, అతను చెప్పిందానికన్నా నీచమయిన పనులు చేసేవాళ్ళు ఈ దేశంలో చాలామంది వున్నారు"అన్నాడు రాఘవ.

"నువ్వేం కంగారుపడకు. అన్ని విషయాలు నాకొదిలెయ్యి. అతన్ని మన దారికి లాక్కొస్తాను" అన్నాను.

"మనం ఈ పని జయప్రదంగా చెయ్యగలమంటావా మోహన్?"

"నీకనుమానంగా వుందా?"

"ఉంది కాబట్టే నిన్ను రమ్మన్నాను. ఆ రోజాయే ఈ ఊబిలోకి దించింది. ఈ విషయం అతను నాతో కదిపిన క్షణంనుండి నిద్రపట్టడంలేదు" అన్నాడు రాఘవ.

"అలా బెంబేలు పడకు. అంతా సవ్యంగా జరిపించే పూచీ నాది!" అని భుజంపైన చెయ్యివేసి తట్టి చెప్పాను.

రెండు రోజులు మామూలుగా జరిగిపోయాయి. మరుసటి దినం భజ్‌రంగ్ పిలుస్తాడనుకొన్నాను. కానీ పిలువ లేదు. రెండోరోజు రాఘవ బాస్‌తో ఢిల్లీ వెళ్ళిపోయాడు. నాకు మళ్ళీ మామూలు కార్యక్రమ మయింది. రోజాను కాస్త దూరంగా వుంచాను.

# 5

మూడోరోజు ఫోన్ మ్రోగించి. వెళ్ళి రిసీవరు తీశాను. రోజా మాట్లాడింది. నన్ను వెంటనే బయలుదేరి భజ్‌రంగ్ రోటాగారి బంగళాకు రమ్మని చెప్పింది. ఫోన్ పడేసి బట్టలు మార్చుకుని కారు తీసుకొని వెళ్ళాను.

రోజా హాల్లో ఎదురయింది.

"మిసెస్ రోటా నీతో మాట్లాడాలట!" అంది.

"నాతోనా? దేన్ని గురించి" అడిగాను.

"తెలీదు!" అంది.

"నా సంగతి ఆమె కెవరు చెప్పారు?"

"భజ్‌రంగ్ గారు చెప్పారేమో?" అన్నది.

రోజా చూపించిన దారి బట్టుకొని మిసెస్ రోటాగారి గదికి వెళ్ళాను.

ఆ అందం నా కళ్ళను చెదరగొట్టింది. పట్టుమని పాతి కేళ్ళుండవనిపించింది. పట్టులాంటి శరీరం దంతంలా వెలిగి పోతూంది. పసుపు పచ్చటి చీర, జాకెట్‌తో ప్రత్యక్ష మిచ్చిన రతీదేవిలా వుంది.

"నువ్వేనా మోహన్ అంటే?" అడిగింది మహా రాణిలా.

"అవును మేడమ్!" అన్నాను.

"నువ్వు పైలట్ వా?"

"అవును."

"నన్ను మద్రాసు తీసుకెళ్ళాలి. మళ్లా రేపు వచ్చేద్దాం. మన ప్రయాణం రహస్యంగా వుంచాలి. అర్థమయిందా?"

తల వూపాను.

ఎయిర్‌పోర్టుకు నేను ఫోన్ చేసి చెపుతాను. రేపు భజ్‌రంగ్ నిన్నడిగితే ఏమని చెపుతావ్?"

"అదికూడా మీరే చెప్పండి."

"అమ్మగారు మద్రాసు వెళ్ళి నెక్లెసు రిపేరుకిచ్చి రమ్మం దని చెప్పు!"

"అలాగే చెపుతాను."

"గుడ్! నేను మరో అరగంటలో ఎయిర్‌పోర్టుకు వస్తాను. నువ్వు సిద్ధంగావుండు" అంది.

"అలాగే!" అని చెప్పి అక్కడ్నుంచి వెలుపలి కొచ్చాను.

రోజా అడిగింది లోపలేం జరిగిందో చెప్పమని. నా వివరాలు ఆమెకు చెప్పింది రోజా అని తెలుసు గాబట్టి ఆమెకు దాచకుండా నిజం చెప్పాను.

“ఈమెకు ఊరికొక ప్రియుడున్నాడు. భర్తకు తెలీకుండా వెళ్ళిరావడం బాగా అలవాటు. దానివల్లో పడకు నీవు” అంది రోజా.

కారెక్కి తిన్నగా ఎయిర్‌పోర్టు కొచ్చి, కావలసిన తాళాలు తీసుకొని రోటాగారి స్వంత విమానం వైపు వెళ్ళాను. మిసెస్ రోటా వచ్చేలోగా ఫ్యుయలింగ్ చేయించి, విమానం ఇంజనీర్ల చేత చెక్ చేయించుకుని రన్ వే పైకి తెచ్చి ఆపాను.

కారుదిగి చిన్న సూట్‌కేస్ ఊపుకుంటూ వచ్చి ఎక్కింది. తలుపు మూసి కాక్‌పిట్‌లోకి వెళ్ళి కూర్చున్నాను.

విమానం బయలుదేరాక పది నిముషాల తర్వాత వచ్చి కోపైలట్ సీట్లో కూర్చుని నా కాళ్ళు, చేతులవంక చూడసాగింది.

“కారుకన్నా సులభంగా డ్రైవ్ చేస్తున్నావ్. రాఘవకన్నా నువ్వు మంచి పైలట్‌లాగున్నావ్!” అంది.

“లేదు! అతనే నా గురువు” అన్నాను.

“డ్రింకు తెచ్చిఇచ్చేదా?” అడిగింది.

“మీకెందుకా శ్రమ! కూర్చోండి” అన్నాను.

“మిస్టర్ మోహన్! జీవితంలో డబ్బు, దర్జా మాత్రమే సుఖం ఇవ్వవు. అందుకు నిదర్శనం నేనే. నా భర్తకు కావలసినంత డబ్బుంది. కానీ నేను సుఖపడడం లేదు” అంది.

“దాన్ని వెతుక్కునేందుకు మద్రాసు పోతున్నారా?” అడిగాను నవ్వుతూ.

"ఒక విధంగా అంతేననుకో!"

చాలాసేపు మే మిద్దరం కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం.

మద్రాసులో దిగాం.

టాక్సీలో ఎక్కుతూ నాకు డబ్బిచ్చింది. మంచి హోటల్ లో దిగమని చెప్పింది. మరుసటి దినం మూడు గంటలకు తిరిగి బొంబాయి వెళ్దామని చెప్తూ టాక్సీవాలాను పోనిమ్మని చెయ్యి ఊపింది.

పాత స్నేహితు లిద్దరు పైలట్లు కలిశారు. ఆ రాత్రి మజా చేశాం. తెల్లారాక మిసెస్ రోటా చెప్పినట్లు మూడింటికల్లా ఎయిర్ పోర్టుకు వచ్చాను. ఆమె రాలేదు. నాలుగయినా వస్తున్న జాడ కనుపించలేదు. ఐదింటిదాకా చూశాను. డబ్బున్న ఆడది ఒంటరిగా వుంది. పైగా నే నామెను తీసుకొచ్చాను. ఆమెకేమయినా ప్రమాదం జరిగిందేమోనన్న భయం పుట్టింది. ఎక్కడకు పోతున్నదీ నాకు చెప్పలేదామె.

వెలుపలకు వచ్చి నిలబడ్డాను. నిన్న ఆమె వెళ్ళిన టాక్సీ కనుపించింది. దానికి ముందుచక్రం వేపు పెద్ద సొట్టవుంది. దాన్ని చూసే గుర్తుపట్టాను. తిన్నగా వెళ్ళి తలుపు తెరుచుకుని ఎక్కి కూర్చున్నాను.

డ్రైవరు స్టార్టు చేశాడు. కొంతదూరం పోయాక "ఎక్కడికి సార్!" అడిగాడు.

"నిన్న వెళ్ళినచోటికే!" అన్నాను సిగరెట్ వెలిగిస్తూ.

"అంటే."

"నిన్న ఒకామెను ఎక్కించుకు వెళ్లావ్ గుర్తుందా?" అడిగాను.

"ఉంది."

"ఆమెను దించిన స్థలానికే నన్ను తీసుకెళ్ళు. త్వరగా వెళ్ళు" అన్నాను. టాక్సీ స్పీడు హెచ్చించాడు డ్రైవరు. ఆలోచిస్తూ కూర్చున్నాను. టాక్సీ చాలాదూరం వెళ్ళింది. అంతకు ముందు నేను మద్రాసు చాలాసార్లు వెళ్ళాను. నాకు దాదాపు ముఖ్యమైన భాగాలన్నీ తెలుసు. అడయారులో ఒక చిన్న ఇంటిముందాగింది టాక్సీ.

వచ్చీరాని తెలుగులో ముందురోజు తనిక్కడికే వచ్చాననీ, ఆమె దిగి లోనికెళ్ళిందనీ చెప్పాడు. టాక్సీని వుండమని చెప్పి నేను లోనికి వెళ్ళాను. తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. నెట్టాను. తెరచుకున్నాయి. లోనికి వెళ్ళాను. హాల్లో ఎవ్వరూ లేరు. ప్రక్కనే మరో గది వున్నట్లు తోచింది. దాని తలుపులు తెరచాను. మూలుగు వినిపించింది. చూచాను. మంచానికి త్రాళ్ళతో కట్టివేయ బడివుంది రోటా. ఆమె శరీరం నగ్నంగా వుంది. చీర జాకెట్ క్రిందపడున్నాయి.

గబగబవెళ్ళి కట్లు విప్పాను. బట్టలు కట్టబెట్టాను. సూట్ కేస్ కనిపించలేదు. పర్సుకూడా లేదు.

"ఏమయింది?" అడిగాను.

"రాస్కెల్. నా డబ్బు నగలు తీసుకుని నన్నీవిధంగా కట్టేసి వెళ్ళిపోయాడు" అంది. నావైపు చూసి "నా కోసం శ్రమ తీసుకున్నావ్. ఇక్కడికెలా రాగలిగావ్?" అడిగింది.

చెప్పాను వివరంగా.

"అతనెవరు? ఇలా చేసినందుకు అతనికి తగిన బుద్ధి చెప్పాలి!" అన్నాను.

"అవసరంలేదు. మనం వెళ్దాం పద!" అంది.

ఇద్దరం టాక్సీ ఎక్కి ఎయిర్ పోర్టుకొచ్చాం. విమానం ఎక్కి రాత్రి పదింటికల్లా బొంబాయి చేరుకున్నాం.

అప్పటికింకా రాఘవ రాలేదు. రోజా కనుపించింది. రాఘవ సాయంత్రం ఫోన్ చేసి తనింకో రెండు దినాలు రావటం వీలుకాదని చెప్పాడని చెప్పింది.

## 6

నాకు రోటా, రాఘవ్‌ల ప్లానే మనస్సులో మెదలు తూంది. భజ్‌రంగ్ చెప్పిన విధంగా చేసినందువల్ల నాకు డబ్బు దక్కుతుందన్న నమ్మకం ఏర్పడలేదు. అతను చెప్పిన చోటికి పరేశ్‌ను, అతని ఫార్ములాలను చేర్చగానే మమ్మల్ని ముగ్గురినీ నామరూపాలు చెయ్యడం నిశ్చయ మన్న అభిప్రాయం నాలో బాగా నాటుకునిపోయింది.

ప్రాణాలకు ముప్పు లేకుండా, ఎంతో కొంత డబ్బు ముట్టే మార్గమేదైనా దొరుకుతుందేమోనని ఆలోచిస్తూ కూర్చున్నాను.

రోజా మధ్యనున్న తలుపు తెరచుకుని వచ్చింది గదిలోకి.

అదేసమయంలో టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవరు అందుకున్నాను. మిసెస్ రోటా గొంతు వినిపించింది.

పాలీహిల్ పైనున్న చిన్న బంగళా అడ్రసు ఇచ్చి ఒక గంటలో నన్ను అక్కడికి రమ్మని ప్రాధేయపడింది ఆమె. ఎందుకయిందీ చెప్పలేదు. ఫోన్ పెట్టేసి డ్రస్ చేసుకోవడం ప్రారంభించాను.

"ఎక్కడికి?" అడిగింది రోజా.

"చిన్న పనుంది" అన్నాను.

"రోటా వైఫ్ రమ్మంది కదూ!"

"నీకెలా తెలుసు."

"ఆమె సంగతి పూర్తిగా తెలుసు. నువ్వు వెళ్ళొద్దు."

"ఎందుకని?"

"ఏమో? నువ్వు వెళ్ళావంటే నాకు వొళ్ళు మండి పోతుంది. బహుశా నీపైన నాకున్న ప్రేమవల్ల కావచ్చు"

రోజా తలొంచుకుని చెప్పింది.

నేనామె మాటలు వినలేదు. తల దువ్వుకుని వెళ్తున్నానని కూడా చెప్పకుండా వెలుపలకు వచ్చేశాను. లిఫ్టులో కిందికి దిగి కారెక్కాను. తిన్నగా పాలీహిల్ వైపు పోనిచ్చాను.

ఆమె యిచ్చిన అడ్రసు పట్టుకునేసరికి గంట పట్టింది. బంగళా చిన్నదే అయినా అన్ని వసతులు వున్నాయి. సర్వెంట్లు ఎవ్వరూ లేరు. ఆ యింటి గురించి ఆమె ఏదేదో చెప్పింది. అన్నింటి సారాంశం తనకు ఇష్టమైనప్పుడల్లా అక్కడికొచ్చి ప్రపంచంతో సంబంధం లేకుండా వుండి పోతూందట తను. వింటూ, సిగరెట్ త్రాగుతూ కూర్చున్నాను.

"నువ్వు మా ఎస్టేట్‌లో పని చేస్తున్నావా?" అడిగింది.

"లేదు! నేనొచ్చి నాలుగు రోజులయింది. రాఘవ నా ఫ్రెండు. ఏదయినా ఉద్యోగం చూపించమని అడిగాను. ప్రయత్నం చేస్తానన్నాడు" అన్నాను.

"నువ్వంటే నాకు చాలా ఇష్టం. అందంగా వుండటమే కాదు ఆపదల్లో ఆదుకునే సుగుణం కూడా వుంది నీకు. నిన్న నువ్వు రాకుంటే నే నక్కడే చచ్చేదాన్ని. ఈ శరీరంలో ప్రాణాలు పోకుండా కాపాడినందుకు కృతజ్ఞతగా నీకు అవసరమయితే ఈ శరీరాన్నే అప్పగించాలనుకున్నాను. అందుకే రమ్మన్నాను" అంది.

ఆమెవైపు చూశాను. కళ్ళలో నిజాయితీ కనుపించింది. అంతే కిటికీలు మూశాను. ఆ రాత్రి ఎలా తెల్లవారిందో క్షణక్షణం నాకు గుర్తువుంది.

# 7

రాఘవ మూడో రోజు వచ్చాడు. అతను వచ్చిందాకా మిసెస్ రోటాతో సరిపోయింది నా టైమంతా. రోజాకు

పిచ్చిపట్టినట్లు తిరిగింది. నాతో మాట్లాడలేదు. ఆ రాత్రి రాఘవ, రోజా, నేను, భజ్‌రంగ్ రోటా బంగళాలో మళ్ళా సమావేశమయినాం.

"మిస్టర్ మోహన్! కలకత్తా ఎయిర్‌పోర్టులోని రాడార్ ముప్ఫయి ఒకటవ తేదీ రాత్రి చెడిపోతుందట. దానివల్ల మీకు ప్రమాదం వుండదు!" అన్నాడు భజ్‌రంగ్.

"ఎవరు చెప్పారు?" అడిగాను.

"ఇలాంటివి ఎవరు చెపుతారు. నేనే. అందుకు తగిన ఏర్పాట్లు చేశాను. నువ్వు కోరిన విధంగా మీ ముగ్గురికీ మూడు కోట్లు ఇవ్వటం మాత్రం కుదరదు."

"ఎందుకని?"

"నా కొచ్చే పదికోట్లలో చాలా భాగాలున్నాయి. మీ కొక్కొక్కరికి పాతికలక్షల రూపాయలిస్తాను. ఇష్టమైతే ఈ పనిలో దిగండి. లేకుంటే మానుకోండి."

"సగం డబ్బు మాకు ఇక్కడే నాలుగు దినాలు ముందిస్తారా?"

"అదేం పెద్ద విషయం కాదు!"

"మా ప్రాణాల గురించి ఏం చేశారు?"

"అలాంటిదేమీ జరగదని నాకు హామీ ఇచ్చారు."

"వాళ్ళ హామీలతో మాకు పనిలేదు. మమ్మల్ని మేము రక్షించుకోనేందుకు అవసరమైన ఆయుధాలు కావాలి! అవి మీరే ఏర్పాటు చెయ్యాలి" అన్నాను.

"ఏమేం కావాలో చెప్పు!"

"రెండు మెషిన్‌గన్స్. మూడు ఆటోమేటిక్ రివాల్వర్స్. డజన్ స్మోక్ బాంబ్‌లు" చెప్పాను.

"తెప్పిస్తాను" అన్నాడు భజ్‌రంగ్.

"ఒకవేళ పరేఖ్ మాతో కలబడితే ఏం చెయ్యాలి?"

అడిగాను.

"ఏ పరిస్థితుల్లోనూ అతని ప్రాణాలు మాత్రం తియ్యొద్దు. అతని ఫార్ములాలు మనకి అర్థంకావు. అతనే వాట్ని వివరించాలి. అతను లేకుండా ఫార్ములాలు నిరుపయోగం. అందువల్ల ఈ విషయంలో మీరు ముగ్గురూ చాలా జాగ్రత్తగా వుండాలి" అన్నాడు భజరంగ్.

"అలాగే!" అన్నాడు రాఘవ.

ముగ్గురం వెలుపలకొచ్చాం. రాఘవ నాకేసి చూశాడు. రోజా మౌనంగా కారెక్కింది.

"ఇప్పుడు నువ్వు తృప్తిపడ్డట్లే కదూ!" అడిగాడు రాఘవ.

కారు డ్రైవ్ చేస్తూనే "ఊ!" అన్నాను.

"ముప్ఫయి ఒకటవ తేదీ తర్వాత ఈ దేశంకి సంబంధించినంతవరకూ మనం చచ్చిపోయిన వాళ్ళక్రిందే లెక్క. కలకత్తా తీరం చేరంగానే గ్రౌండ్ కంట్రోలును కాంటాక్టు చేసి, మన విమానానికున్న రెక్కకు ఫైరాక్సిడెంటయిందనీ, కంట్రోలు తప్పిపోతూందనీ చెప్పాలి. సముద్రంపైనే ఎక్కువ ఎత్తుకు పోకుండా, పూర్తివేగంతో పోవాలి. గంటకు ఏడువందల యాభై కిలోమీటర్లదాకా పోతుంది మన విమానం. అంటే నాలుగు గంటల్లో మనం చేరవలసిన చోటికి పోగలం. రాడార్ పనిచెయ్యదు గాబట్టి మనల్ని మరే విమానం వెంటాడే ప్రమాదం వుండదు" అన్నాడు రాఘవ.

"గుడ్! ప్లాన్ బాగుంది. ఆ విషయమైనా ఎందుకు చెప్పడం గ్రౌండ్ కంట్రోలుకు? చెప్పకుండా వెళ్ళిపోతే ఏమవుతుంది?" అడిగాను.

"మన విమానం అనుకున్న టయిమ్‌కు డమ్‌డమ్ చేరకుంటే కలవరపడిపోతారు. వెతికే ప్రయత్నాలు చేస్తారు.

ఆ ప్రమాదం లేకుండా చూసుకునేందుకే ఈ నాటకం!"
అన్నాడు రాఘవ.

"ప్లేన్‌లో మొత్తం నలుగురం వుంటాం. డాక్టర్ పరేఖ్‌ను ఒకరు కనిపెట్టుకుని వుండాలి. విమానం నడిపేందుకు మనిద్దరం చాలు. రోజా అతన్ని కంట్రోలు చెయ్యగలదా?" అడిగాను.

"రివాల్వరుంటే ఎవరయినా ఎదుటి మనిషిని నిశ్శబ్దంగా గంటల తరబడి కూర్చోబెట్టవచ్చు. రోజా ధైర్యస్థురాలు. ఆ విషయం ఆమె కొదిలేద్దాం!" అన్నాడు రాఘవ.

"డాక్టర్ పరేఖ్‌ను నేను ఎప్పుడూ చూడలేదు. అతను మనకన్నా తెలివిగలవాడయితే!" అడిగింది రోజా.

"నేను చూశానతన్ని. చాలా ముసలివాడు. శరీరం ఎముకల గూడులా వుంటుంది. తెలివితేటలు తప్ప ధైర్య సాహసాలు లేవు అతనికి" అన్నాడు రాఘవ.

"పని పూర్తి అయ్యాక మనం ఎక్కడికి పోదాం?" అడిగాను.

"నేనూ రోజా స్విట్జర్లాండుకు వెళ్దామనుకున్నాం. ఇష్టమయితే మాతో రా!" అన్నాడు రాఘవ.

"రాను. నేను అమెరికా వెళ్తాను. అక్కడ మా బంధువుకూడా వున్నాడు" అన్నాను.

కారు మళ్ళీ మా క్వార్టర్సుముందాగింది. నన్ను రోజాను అక్కడ దింపి రాఘవ వెళ్ళిపోయాడు. ఇద్దరం మెట్లెక్కుతుండగా "నువ్వా రాక్షసిని మర్చిపో! అది నీ ప్రాణం తీస్తుంది?" అంది రోజా.

"ఏ రాక్షసి?" తెలియనట్లడిగాను.

"అదే! మిసెస్ రోటా!" అంది రోజా.

"ఆమెకూ నాకూ ఏం సంబంధం లేదు."

"లేకుంటే మంచిదే. నాకు రాఘవంటే పరమబోరు.

అతనితో స్విట్జర్లాండు వెళ్ళను. నీతో అమెరికాకు వచ్చే స్తాను. సరేనా?''

"అతనికి ద్రోహం చెయ్యను'' అని చెప్పి గబగబా నా రూమ్‌లోకి వెళ్ళిపోయాను.

# 8

ఫోన్ మ్రోగింది.

మిసెస్ రోటా లైన్లో కొచ్చింది. నన్ను రమ్మంది మామూలు స్థలానికి. భజ్‌రంగ్ ఊళ్ళో వున్నాడన్న విషయం గుర్తుచేశానామెకు. ఫరవాలేదంది. ఏదో సాకు చెప్పి వచ్చేస్తానంది. సరేనని చెప్పి, నేను బయలుదేరేందుకు సిద్ధంకాసాగాను.

మధ్యనున్న తలుపు తెరచుకుని వచ్చింది గదిలోకి రోజా.

"మళ్ళీ వెళ్తున్నావా?'' అడిగింది.

"ఆఁ!'' అన్నాను.

ఆమె మరేం మాట్లాడలేదు. నేను దిగి క్రిందికి వెళ్ళాను. కారెక్కాను.

పాలీహిల్ పైని బంగళాకు పోయేసరికి గంట రాత్రి పన్నెండయింది. లోపల లైట్లు వెలగడంలేదు. తలుపులు దగ్గరగా మూసివున్నాయి. తెరచుకొని వెళ్ళాను. డబుల్ కాట్‌ను వెతుక్కుంటూ వెళ్ళాను. మిసెస్ రోటా వెల్లకింతలా పడుకునివుంది.

మంచం అంచున కూర్చున్నాను.

"మనిద్దరి గొడవ రోజాకెలా తెలిసింది?'' అడిగింది.

"నేను చెప్పలేదు. ఆమే తెలుసుకొంది!'' అన్నాను.

"ఇంతకుముందే ఫోన్ చేసింది. నువ్వు మరో నాలుగు రోజుల్లో ఈ దేశాన్ని శాశ్వతంగా వదలిపెట్టి వెళ్తున్నావట గా? నిజమా'' అడిగింది.

"అదీ రోజాయే చెప్పిందా?"

"ఆఁ!"

"నిజమే!" అన్నాను.

వెక్కి వెక్కి ఏడ్వసాగింది. నాకోసం ఏడ్చిన మొదటి స్త్రీ ఆమే జీవితంలో. నాపైన ఆమెకు అంత అభిమానం వుందని నేను అనుకోలేదు.

"లైట్లు లేవెందుకని?"

"కరెంటు లేదు!" చెప్పింది.

అంతలోనే దూరంగా కారొచ్చి ఆగిన శబ్దం వినిపించింది. తక్కున మంచంపైన లేచి కూర్చుంది. "నా రహస్యం బట్టబయలు చేసేందుకు రోజా, రోటాకు ఫోన్ చేసి చెప్పివుంటుంది. ఆ కార్లో వచ్చింది మావారే అయి వుండాలి. నువ్వు ఎక్కడన్నా దాగివుండు" అంది మిసెస్ రోటా.

"నాకారు వెలుపలే వుంది" చెప్పాను.

"నేనెలాగో సర్ది చెప్పుకుంటాను. నువ్వెళ్ళు!" అంది.

ఫ్రెంచి విండోలోంచి దూకి వెలుపలున్న గార్డెన్లోకి వెళ్ళాను. పెద్ద మామిడి చెట్టెక్కి కూర్చున్నాను. టార్చిలైటు వెలిగింది ఆమె బెడ్రూంలో. ఆ తర్వాత రెండు నిమిషాలకు కార్లు రెండూ వెళ్ళిపోయాయి. నేను చెట్టు దిగి కాలినడకన బయలుదేరాను. రోడ్డులోకి రాగానే టాక్సీ మాట్లాడుకున్నాను.

నా గదికొచ్చేసరికి గంట మూడయింది. కాళ్ళు బాగా నొప్పిపెట్టసాగాయి. మంచంపైన పడుకున్నాను.

నాకు రోటా రూపం, ఆమె ఏడ్వటం, నన్ను వెళ్ళిపొమ్మని ప్రాధేయపడటం పదేపదే గుర్తుకొచ్చాయి. ఆమెను వదిలిపెట్టి కేవలం డబ్బుకోసం దూరంగా వెళ్ళడం, అదీ తిరిగి రాలేని స్థితిలో, నాకు అనుచితం

గానూ, అన్యాయంగానూ అనిపించింది. ఒక్క దెబ్బకు రెండు పిట్టలు రాలే మార్గమేమిటాని ఆలోచిస్తూ పడుకున్నాను.

తెల్లవారిందాకా నిద్ర పట్టనేలేదు.

# 9

రాఘవ దగ్గర ఐదువేలు తీసుకొన్నాను. మధ్యాహ్నం ఫ్లైట్‌లో ఢిల్లీ వెళ్ళాను. రక్షణమంత్రిని కలుసుకుని జరగబోతున్న కుట్రగురించి వివరంగా చెప్పాను. కలకత్తాలో రాడార్ పనిచెయ్యకుండా, రోటా చేసిన ఏర్పాటు గురించి కూడా వివరించాను. ఆయన నా దేశభక్తికి మెచ్చుకున్నాడు. వెంటనే భజ్‌రంగ్‌ను కస్టడీలోకి తీసుకుంటామన్నాడు. వద్దని వారించాను. విమానాన్ని కలకత్తా ఎయిర్‌పోర్టులో దింపే పూచీ నేనే తీసుకున్నాను. డాక్టర్ పరేఖ్‌ను, అతని రిసెర్చి రిసల్ట్సును దేశసౌభాగ్యం కోసం ఉపయోగపడేట్లు చేసే భారం నెత్తినేసుకున్నాను. నాకు వాళ్ళవల్ల కావలసిన సహాయం వివరంగా చెప్పాను. ఆ రోజు రాత్రికే తిరిగి బొంబాయి వచ్చాను.

రోజా అడిగింది నేనెక్కడికెళ్ళానో చెప్పమని. నేను ఇక్కడే వున్నానని బుకాయించాను. రాఘవ కలిశాడు కానీ అతనేం అడగలేదు.

మరుసటిదినం రాఘవ నన్ను తన గదిలోకి తీసుకెళ్ళాడు. మంచంపైన రెండు మెషిన్‌గన్స్, మూడు రివాల్వర్లు, స్మోక్ బాంబ్‌లు అన్నీ వున్నాయి. అన్నీ తీసుకొని పరీక్షగా చూశాను.

"వీట్ని ముందుగానే విమానంలో ఎక్కడన్నా దాచి వుంచడం మంచిది" అన్నాను.

"మనకు కావలసిన ఆహారం, డ్రింక్స్, సిగరెట్లు వగైరా కూడా నిన్ననే కొన్నాను. వాట్ని విమానంలో

పెట్టించాను'' అన్నాడు రాఘవ.

''ఇవి మనమే పెట్టుకోవడం మంచిది'' అన్నాను.

''అలాగే! మన ప్రయాణం ఎల్లుండి ఉదయం పదకొండు గంటలకు. రేపంతా ప్లేన్‌ను ఇంజనీర్లు చెక్ చేస్తారు. మనం రేపు రాత్రికి వెళ్ళడం మంచిదేమో?'' అన్నాడు రాఘవ.

''అలాగే చేద్దాం!'' అన్నాను.

''మన ప్లాను సవ్యంగా జరిగిపోతూందంటావా?'' అడిగాడు రాఘవ.

''నీ కనుమానంగా వుందా?'' అడిగాను.

''లేదు!''

''డోన్ట్ వరీ! అంతా ప్లాను ప్రకారం జరుగుతుంది!'' అన్నాను అది నా ప్లాను ప్రకారమన్న విషయం మాత్రం చెప్పకుండా.

''మనం దేశానికి ద్రోహం చేస్తున్నామేమో అనిపిస్తూంది.''

''అన్ని ఐశ్వర్యాలు వున్న భజరంగ్ రోటాలాంటి వాళ్ళు చెయ్యగా మనం చేస్తే తప్పేముంది. ఈ విషయాలు మరచిపో. రోజాతో నువ్వు స్విట్జర్లాండులో గడపబోయే తియ్యటి జీవితాన్ని గురించి ఆలోచించుకుంటూ మనస్సును ఆహ్లాదకరంగా వుంచుకో!'' అన్నాను.

రాఘవ గదిలోంచి తిరిగి నా గదికి వచ్చేశాను.

పడుకొని ఆలోచించసాగాను. కలకత్తాలో విమానాన్ని ఎలా లాండ్ చెయ్యాలో అంతుబట్టలేదు.

బొంబాయిలో బయలుదేరేటప్పుడే కాక్‌పిట్ నేను తీసుకోవాలి. అప్పుడు సులభంగా నేను అనుకున్నది సాధించగలను. అలా కానిపక్షంలో రాఘవను ఒప్పించడం కష్టం. అతనికి డబ్బుపిచ్చికన్నా రోజా పిచ్చి ఎక్కువగా వుంది. అతనితో తలపడాల్సివస్తే అసలు ప్లెయిన్‌కే ఏక్సి

డెంటు చెయ్యవచ్చు. పరేఖ్ ఖచ్చితంగా నావైపు వుంటాడు.

ఆలోచించి లాభం లేదనిపించింది. పరిస్థితినిబట్టి ప్రవర్తించాలే తప్ప ముందుగా ఏమి నిర్ణయించుకోవడం సాధ్యంకాదని తెలుసుకున్నాను. హాయిగా నిద్రలోకి ఒరిగిపోయాను.

తెల్లవారుఝామున ఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవరెత్తాను. మిసెస్ రోటా మాట్లాడింది. మరుసటి దినం ఎలాగైనా హోటల్ ఓబ్రాయ్‌కి రమ్మంది రాత్రి తొమ్మిదింటికి. వీలుకాదేమోనన్న సందేహం వెలిబుచ్చాను. వచ్చి తీరాలని పంతంపట్టింది. వస్తానని మాటిచ్చి లైన్ కట్ చేశాను.

ఆ రోజు సాయంత్రందాకా ఊరంతా పిచ్చిపట్టినట్లు తిరిగాను. రాఘవ ఎనిమిదింటికి సరంజామా తీసుకుని ఎయిర్‌పోర్టుకు వెళ్దామన్నాడు. సరేనన్నాను. తొమ్మిదింటినుండి మిసెస్ రోటా నాకోసం వెయిట్ చేస్తుందని తెలిసినా ఆమెకు ఆలస్యమవుతుందని కూడా ఫోన్ చెయ్యదలచుకోలేదు.

మెషిన్‌గన్స్ పాసింజర్స్ సీటుక్రింద పెట్టాను. రివాల్వర్లు కాక్‌పిట్‌లో పడేశాను. స్మోక్ బాంబ్‌లు కో-పైలట్ సీటుక్రింద దాచాను. ప్లేన్ అంతా చెక్ చేసుకున్నాం. మా పనంతా పూర్తయ్యేసరికి పదకొండయింది. ఇద్దరం వెలుపలికొచ్చాం. నేను కారెక్కకుండా నిలబడ్డాను. రాఘవ ఎక్కి కూర్చుని డోర్ తెరిచాడు నాకోసం. అతన్ని వెళ్ళమన్నాను. నవ్వి వెళ్ళిపోయాడు.

నేను టాక్సీలో ఓబ్రాయ్ హోటల్‌కు వెళ్ళాను. మిసెస్ రోటా ఇచ్చిన గది నెంబరు వెతుక్కుంటూ వెళ్ళాను. గదికి తాళంవేసి వుంది. ఫ్లోర్ సర్వీస్ సూపరిం

టెండెంటు దగ్గరకెళ్ళి వాకబుచేశాను. ఆమె హడావుడిగా రూం ఖాళీచేసి వెళ్ళినట్లు తెలిసింది. ఏంజరిగిందో అర్థం కాలేదు. దిగి క్రిందికొచ్చి టాక్సీలో మళ్ళా రూం చేరుకున్నాను. నాకు అంతకుముందు మిసెస్ రోటా ఇచ్చిన ప్రైవేట్ నెంబరుకు ఫోన్ చేశాను. రింగుపోతుంది తప్ప రిసీవరు ఎవ్వరూ ఎత్తలేదు.

ఆమెతో నా ప్లానుగురించి చెప్పాలనీ, నేను ఈ దేశం విడిచి వెళ్ళడం లేదన్న విషయం వివరించాలనీ ఎంతో ఆరాటపడ్డాను. ఆ అవకాశం లేకుండా పోయినందుకు కాస్త విచారించాను.

## 10

మరుసటి దినం పదిగంటలకల్లా నేనూ, రాఘవ, రోజా ఎయిర్‌పోర్టు చేరుకున్నాం.

అప్పటికే అక్కడ చాలామంది జనం వచ్చారు. పెద్ద పెద్ద నాయకులు, సైంటిస్టులు, అధికారులు రకరకాల వ్యక్తులున్నారు. మేము ముగ్గురం తిన్నగా ప్లేన్‌లోకి వెళ్ళాం. రాఘవ కాక్‌పిట్‌లో కూరాడు. నేను నడుపుతానన్నాను విమానాన్ని. రాఘవ వద్దన్నాడు. నేను ఒత్తిడి చెయ్యలేదు.

క్రిందకు దిగి వచ్చి నిలుచున్నాను. తెల్లటి బెంజ్ కారొచ్చి విమానం దగ్గరగా ఆగింది. చిన్న బ్రీఫ్‌కేస్‌తో పండు ముసలివ్యక్తి ఒకతను వెనుక సీట్లోంచి దిగాడు. అతనివెంట భజ్‌రంగ్ కూడా దిగాడు. అతని చెయ్యి పట్టుకుని విమానం వద్దకు నడిపించుకొచ్చాడు. మెట్లెక్కించాను పరేష్‌ను నేనే!

భజ్‌రంగ్ నన్ను చూచి కన్నుకొట్టాడు.

అంతా సవ్యంగా వుందని కళ్ళతో నే సైగ చేశాను. పరేష్ మెట్లదగ్గర నిలబడి దూరంగా మూగివున్న జనంకేసి

చెయ్యి ఊపి లోనికి నడచాడు. నేను డోర్ మూశాను.

విమానం బయలుదేరింది.

రోజా పరేఖ్‌ను పాసింజర్సు సీట్లో కూర్చోపెట్టి బెల్టులు బిగించి దానికమర్చిన లాక్ నొక్కింది. దాంతో అతని చేతులు చిక్కుబడిపోయాయి. అది మామూలే అన్నట్లు కూర్చున్నాడు.

రోజా జాకెట్లోంచి రివాల్వరుతీసి పరేఖ్‌ను గురిపెట్టి కూర్చుంది. విమానం ఎత్తుకు లేచి స్పీడుగా పోసాగింది. నేను పరేఖ్ వెనుకనున్న సీట్లువైపు వెళ్ళాను కాసేపు కూర్చుని ఏంచెయ్యాలో ఆలోచించుకుందామని. రెండు గంటలా నలభై నిముషాలకుగానీ, మా విమానం కలకత్తా ప్రాంతాలకు చేరదు.

నా కాళ్ళకు మెత్తగా ఏదో తగిలింది. వంగి చూశాను. నా కళ్ళు ఆశ్చర్యంగా మెరిసిపోయాయి. మిసెస్ రోటా సీట్ల సందున పడుకొని వుంది.

వంగి "నువ్వా? ఎలా వచ్చావ్?" అడిగాను.

"అరవకు! రాత్రే వచ్చాను. మీ ప్లాను నాకు తెలుసు. నేను కూడా నీతోనే వచ్చేస్తున్నాను" అంది.

"లేచివచ్చి కూర్చో!" అన్నాను.

మిసెస్ రోటా లేచివచ్చి కూర్చుంది. ఆమెను చూడగానే రోజా పెదాలు పాలిపోయినట్లయినాయి. పరుగెత్తుకుని రాఘవ దగ్గరకు వెళ్ళింది.

"మనం ఏ దేశం పోతున్నాం!" అడిగింది మిసెస్ రోటా.

నా మెదడు పనిచెయ్యడం ఆగిపోయింది. ఆమెకోసమే నేను లేని దేశభక్తిని తెచ్చుకొన్నాను. ఆమెను స్వంతం చేసుకోనేందుకే నేను భజరంగ్‌నూ, అతని ప్లానునూ, ప్రభుత్వానికి వివరంగా చెప్పి, విమానం మనదేశ సరిహద్దు

లను తప్పించుకునే మార్గం లేకుండా తీసుకోవలసిన అన్ని చర్యలూ తీసుకొన్నాను. అయినా నా ప్లాను తారుమారయింది. ఆమెకు నా ప్లాను తెలుస్తుందనిగానీ, తెలిసినా ఇలా తెగించి, అన్ని బంధాలు తెంచుకుని వెంటబడి వచ్చేస్తుందనిగానీ నేననుకోలేదు.

"ఏ దేశం పోవడంలేదు! ఈ దేశంలోనే వుండబోతున్నాం!" అన్నాను.

"అబద్దం చెబుతున్నావ్!" అందామె.

"కాదు! నిజమే చెప్తున్నాను. నీకోసం నేను ఈ దేశంలోనే వుండాలని అనుకున్నాను. అందుకే భజ్‌రంగ్ ప్లాను భగ్నం చేసేందుకు అన్ని ఏర్పాట్లు చేశాను" చెప్పాను.

రోజా తిరిగొచ్చింది.

"మిస్టర్ మోహన్! నిన్ను రమ్మంటున్నాడు రాఘవ" అంది.

నేను లేచాను వెళ్ళేందుకు. మిసెస్ రోటా కూడా నా వెంట లేచింది. నా దగ్గరున్న రివాల్వరును ఆమెదగ్గర పెట్టుకోమని ఇచ్చాను. రాఘవ దగ్గరకు వెళ్ళాను. అద్దంలోంచి ఆకాశాన్ని చూస్తూ "అలా కూర్చో!" అన్నాడు.

మాట్లాడకుండా కూర్చున్నాను.

"ఆమె నెందుకు పిల్చుకొచ్చావ్?" అడిగాడు భయంగా.

"నేను రమ్మనలేదు. ఆమే వచ్చింది."

"భజ్‌రంగ్‌కు ఆమె అంటే ప్రేమ. ఆమె ఈ విమానంలో వుందని తెలిస్తే మొత్తం మన ప్లానంతా డ్రాప్ చేసుకొని కలకత్తాలో దిగెయ్యమంటాడు" అన్నాడు రాఘవ.

"అతను చెప్పకున్నా జరగబోయేది అదే!"

"అంటే!"

"పరేఖ్ ను సురక్షితంగా అతని ఫార్ములాలతో సహా కలకత్తాలో దింపుతానని మన ప్రభుత్వానికి హామీ ఇచ్చాను" అన్నాను.

"ఇంపాజిబుల్. నీకు పిచ్చిపట్టినట్లుంది. అంతా విన్నాక ఇష్టపడి ఇందులో కాలు పెట్టావ్. ఇలా మమ్మల్ని మోసం చెయ్యడం న్యాయంకాదు. నువ్వు చెయ్యదలచుకున్నా నేను ఊరుకోను. ఈ విమానం ఖచ్చితంగా పోవలసిన చోటికే పోతుంది" అన్నాడు రాఘవ.

# 11

రాఘవ ఫ్లయింగ్ టాలెంటు చాలా గొప్పది. ఇంజన్ ఆడుతున్నంతవరకు పోరాడే మనిషి. రివాల్వరుతో బెదిరించి చూద్దామనుకున్నాను. కానీ నా రివాల్వరు మిసెస్ రోటాకు ఇచ్చివచ్చాను. రాఘవ దగ్గర రివాల్వరు వుంది.

నేను లేచాను.

"కదలొద్దు! కూర్చో!" అన్నాడు ఎడంచేత్తో రివాల్వరు నావైపు గురిపెట్టి చూపిస్తూ.

చేసేదిలేక కూర్చున్నాను. మైక్ లో రోజాను రమ్మని అరచాడు రాఘవ. రోజా వచ్చింది. ఆమె చేతిలో రివాల్వరుస్థానే మెషిన్ గన్ వుంది.

"అతన్ని నేను రివాల్వరుతో కవర్ చేస్తాను. నువ్వు కాళ్ళు, చేతులు కట్టివెయ్యి" అరిచాడు రాఘవ. రోజా పెద్ద నైలాన్ తాడు తెచ్చి నావైపు విసిరింది. నా కాళ్ళను నన్నే కట్టుకోమంది. తప్పనిసరి కావటంతో చెప్పినట్లు చేశాను. ఆ తర్వాత చేతులు కట్టేసింది.

"మిసెస్ రోటా ఏమయింది?" అడిగాను.

"ఆ మెకా్క్_డా నీ గతే పట్టింది" అంది రోజా.

"ఆమె దగ్గర రివాల్వరుందిగా?"

"నీమీద మాకు మొదట్నుంచీ అనుమానంగా వుంది.

అందుకే దాంట్లోని గుండ్లుతీసి వుంచాం. ఆ విషయం నీకు తెలీదు'' అంది నా తెలివితక్కువ తనాన్ని ఎగతాళి చేస్తూ.

విమానంలో వున్న నేనూ, మిసెస్ రోటా, పరేష్, ముగ్గురం బందీలమే అయినాం. రాఘవను ఎయిర్‌పోర్టు విమానాలు వెంబడించినా పట్టుకోవడం కష్టం.

''రాఘవా!'' పిలిచాను.

''ఏమిటి?'' అడిగాడు.

''నీ సాహసం అనవసరమైందనిపిస్తూంది. భజరంగ్ పెద్ద స్మగ్లర్. దేశాన్ని సర్వనాశనం చేస్తున్న పైశాచిక శక్తి అతను. అతనికి సాయం చెయ్యడంకోసం మన ప్రాణాలు పోగొట్టుకోవటం మాత్రమేగాక, దేశానికి ద్రోహం చేస్తున్నాం. ఆలోచించావా?'' హితబోధ చేశాను.

''నోరుమూసుకుని కూర్చో! అనవసరంగా వాగకు'' అరచాడు రాఘవ.

వాచీ చూసుకున్నాను. విమానం బయలుదేరి రెండు గంటలయింది. చాలా ఎత్తున ఎగురుతున్నట్లుగా వుంది. దారిలోవున్న ఏ స్టేషనుతోనూ అతను కాంటాక్టు పెట్టుకోలేదు. కుడివేపునున్న ఎయిర్‌మాప్‌ని మాటిమాటికి చూస్తూ డైరెక్షను కంట్రోలు చేసుకోసాగాడు.

''రూట్ మార్చావా?'' అడిగాను నా అనుమానం నివృత్తి చేసుకొనేందుకు.

''ఆఁ! నువ్వు ముందుగా చెప్పడం మంచిదయింది. విశాఖపట్నం మీదుగా వెళ్తున్నాను. నా విమానాన్ని పట్టుకోవడం అసంభవం'' అన్నాడు రాఘవ.

నాకు ఓటమి ఎదురవుతూంది. అయినా ఒకందుకు

ఆనందం కలిగింది. నాతోబాటు విమానంలో మిసెస్ రోటా కూడా వుంది. ఆమెకోసం నేను రాఘవను, భజ్ రంగ్ ను ప్రభుత్వానికి పట్టివ్వదలచుకున్నాను. ఇప్పుడు ఏమయినా ఫరవాలేదనిపించింది.

ప్లేన్ కు ముందంతా చీకటిగా వుంది. మేఘాలు దట్టంగా క్రమ్ముకున్నాయి. వాటిల్లో పోవడం ప్రమాదం. ఎత్తు తగ్గించేందుకు గేర్ మార్చాడు రాఘవ. విమానం దాదాపు వెయ్యి అడుగులు క్రిందకు దిగింది.

విశాఖపట్నం ఎయిరోడ్రోంలో వున్న రాడార్ రేంజిలోకి వెళ్ళింది. గ్రౌండ్ కంట్రోలు ఐడెంటిఫికేషన్ కోసం పదేపదే హెచ్చరించ సాగింది. ముందుకు వెళ్ళవద్దనీ, బంగాళాఖాతంలో పెద్ద తుఫాను చెలరేగిందనీ చెప్పింది.

రాఘవ నిరుత్తరుడై కూర్చున్నాడు. విమానం వేగం తగ్గిపోయింది. పైనుంచి సరయిన సమాధానం రాకపోవటంతో క్రింద వాళ్ళ అరుపులు పెద్దవయినాయి. గూఢచారి విమానం లాగుందన్న అనుమానం వ్యక్త పరచుకోవడం నాకు మైక్ లో వినిపించింది.

"ప్లీజ్! లాండ్ హియర్. సముద్రంపైన తుఫాను వుంది. వాతావరణం బాగోలేదు" గ్రౌండ్ కంట్రోలునుండి అరుపులు వినిపించాయి.

రాఘవ విని మౌనంగా వుండిపోయాడు.

"విన్నావా? మొండిగాపోకు. మన ప్రాణాలు పోతాయి" అన్నాను రాఘవతో.

"అదేనయం! దిగామంటే దేశద్రోహ నేరం క్రింద జీవితాంతం ఖైదులో వుంచుతారు" అన్నాడు రాఘవ స్పీడు హెచ్చిస్తూ.

విమానం సముద్రం మీదుంది. నేను కిటికీలోంచి చూస్తున్నాను. విపరీతంగా గాలి వీస్తున్నట్లుగా వుంది.

సముద్రంమీద వర్షం కురుస్తూండా లనిపించింది. రాఘవ పిచ్చిపట్టినట్లుగా కూర్చున్నాడు. నాకున్న అనుభవంలో అతను ఎంత ప్రమాదకరమైన వాతావరణంలోకి జారబడ్డాడో అర్థం చేసుకోగలిగాను.అతనికి తెలుసు. అయినా క్రిందకు దిగడం అతనికి ఇష్టంలేదు.

నాకెలాగైనా కట్లు విప్పుకుందామని వుంది. కానీ ప్రయత్నించి లాభంలేదు. మాటిమాటికీ అతను నాకేసి చూస్తూనే వున్నాడు. ఏదైనా విచిత్రం జరగాలి. అంతకు మించి నేను చెయ్యగలిగిందేమీ లేదు.

# 12

రాఘవకు టెన్షను ఎక్కువయినప్పుడల్లా ఫిట్సొస్తుంటాయి. అలాంటిదేదన్నా జరిగితే విమానం సముద్రంలో కూలిపోవటం తథ్యం. రోజాను గట్టిగా అరచి పిలిచాను. ఆమె వచ్చింది.

నా అనుమానం చెప్పాను. అంతలోనే రాఘవ తల వ్రేలాడేశాడు. రోజా నా కట్లు విప్పింది. లేచి వెళ్ళి అతన్ని పక్కకి లాగి నేను కూర్చున్నాను. విమానం వెనక్కి తిప్పుదామని కంట్రోల్సు మార్చబోయాను. రోజా ఆడ పులిలా రివాల్వర్ నాకు గురిపెట్టి కూర్చుంది.

"మిస్టర్ మోహన్! అక్కడున్న ఎయిర్ మాప్ లో మన మెక్కడికిపోవాలో మార్క్ వేసివుంది. ఆ రూట్ వెంటపోనీ" అరచింది.

విమానాన్ని ముందుకు పోనిస్తూనే ఆమెకు చెప్పాను అలా వెళ్ళడంలోవున్న ప్రమాదాల్ని.కానీ ఆమె వినిపించుకునేట్లులేదు.

లాభంలేదని బాగా ఎత్తుకు తీసుకువెళ్ళాను విమానాన్ని. రాఘవ స్పృహ లేకుండా పడివున్నాడు.

వెళ్ళి పరేఖ్ ను పిల్చుకొచ్చి రాఘవకేదన్నా మందిచ్చే

మార్గం చూడమన్నాను రోజాతో. ఆమె కదలకుండా కూర్చుంది. నోటికొచ్చినట్లు తిట్టాను. దానిక్కూడా ఆమె జవాబు చెప్పలేదు.

కేవలం అదృష్టమే విమానాన్ని తుఫానునుండి తప్పించింది.

మూడుగంటల కాలంలో మేమనుకున్న చోటకి చేరుకున్నాం. పైనుండి టెలిస్కోప్‌లో అక్కడున్న చిన్న ఎయిర్‌పోర్టును నిశితంగా పరిశీలించాను. తుపాకులు పట్టుకుని వందలమంది సైనికులు సిద్ధంగా కాచుకుని వున్నారు.

భజ్‌రంగ్ మా ప్రాణాలకు భయం లేదన్నాడు. కానీ ఇక్కడ ఏర్పాట్లు నాకలా కనిపించలేదు. మమ్మల్ని సగౌరవంగా ఆహ్వానించే మార్గం అది కాదనిపించింది. డాక్టర్ పరేఖ్‌ని చిక్కించుకొని వాళ్ళ రహస్యం ప్రపంచానికి చాటి చెప్పకుండా కాల్చిపారేసేందుకు వాళ్ళు వెనుదీయరని తోచింది.

రోజాను పిలిచి క్రిందున్న సీను చూపించాను. విమానాన్ని ఆ ఎయిర్‌పోర్టుచుట్టూ త్రిప్పసాగాను.

"ఏంచేద్దాం?" అంది రోజా.

"ఇక్కడ దిక్కులేనిచావు చావడంకన్నా మనదేశం జైల్లో శిక్ష అనుభవించడం నయం" అన్నాను.

ఆమె కేంచెప్పనూ పాలుపోలేదు. బాగా భయపడి పోయింది. వెళ్ళి పరేఖ్‌ను విప్పుకొచ్చింది.

రాఘవను చూసి జేబులోంచి రెండు టాబ్లెట్లుతీసి ఇచ్చాడు. రాఘవ వేసుకున్నాడు. అతనిలో చలనం కలిగింది.

"మిస్టర్ మోహన్! నాదగ్గరున్న ఫార్ములాలు నాలోనే అజ్ఞాతంగా వుండిపోతాయి. నేను ప్రాణంపోయినా

పొరుగు ప్రభుత్వాలవాళ్ళకు వాట్ని వివరించను. ఇవి నా దేశంకోసం, శాంతికోసం, ఇరవై రెండు సంవత్సరాలు పరిశోధనచేసి కనిపెట్టినవి. చావంటే నాకు భయంలేదు. నన్ను సురక్షితంగా చేర్చగలిగినపక్షంలో మీకు ఏవిధమైన శిక్షా పడకుండా ప్రభుత్వాన్ని ఒప్పించగలను. ఆలోచించుకోండి'' అన్నాడు.

ఆయన మాటలు నన్ను ఆనందంలో ముంచాయి. ఆయన్నెలాగైనా, నాదేశం చేర్చాలనిపించింది.

''మనం వెనక్కి వెళ్ళిపోదాం! మీరువెళ్ళి రెస్ట్ తీసుకోండి డాక్టర్. రోజాను కనిపెట్టి వుండండి''అంటూ నా దగ్గరున్న రివాల్వరు ఆయనపైకి విసిరాను. ఆయన దాన్ని అందుకుని వెళ్ళిపోయాడు.

రోజా వెనక్కి వెళ్ళడానికి లేచింది. నేను వినకుండా విమానాన్ని త్రిప్పాను. రివాల్వర్‌తో నా భుజంమీద కాల్చింది. మంట పుట్టింది. ఆమె వెనుక నేవున్న పరేఖ్ ఆమె వీపుపైన కాల్చాడు. కుప్పలా కూలిపోయింది.

అంతలోనే రాఘవకు స్పృహ బాగా వచ్చింది కాబోలు కళ్ళు తెరచాడు.చూశాను నేను.డాక్టర్ పరేఖ్ ను ఏదన్నా తాడు తెచ్చి అతన్ని కట్టెయ్యమన్నాను. ఆయన తాడు కోసం వెళ్ళాడు. రాఘవ బాగా లేచికూర్చున్నాడు. అతనికి రెండు నిమిషాల్లో జరిగింది అర్థమయింది.

పులిలాగా పైకి దూకాడు. నాదగ్గరనుండి కంట్రోల్సు లాక్కునేందుకు నన్ను లాగి పారవేసేందుకు ప్రయత్నించాడు. నేను కాక్‌పిట్‌కు అతుక్కుని వుండిపోయాను. విమానం మాత్రం స్పీడుగా పోతూనే వుంది.

నా చెంపలు వాయించాడు.ప్రక్కనున్న హాండ్ స్టిక్‌తో తలపైన మోదాడు. రక్తం చిమ్మింది. అయినా నేను లెక్కచెయ్యకుండా నాపనిలో నేనున్నాను. ఫ్యుయల్

రీడింగ్ చూశాను. దాదాపు విశాఖపట్నం చేరవచ్చు. అక్కడ విమానాన్ని దించగలిగితే చాలు. నా ప్రాణాలు పోతాయన్న భయం లేదు. డాక్టర్ పరేఖ్‌ను ఎలాగైనా నా దేశం చేర్చాలన్న ఆరాటం అధికమయిపోయింది.

మేమిద్దరం పెనగులాడుతూనే వున్నాం. మిసెస్ రీటా, పరేఖ్ ఇద్దరూ వచ్చారు. జరుగుతున్న గొడవ చూశారు. మిషన్‌గన్ తిరగత్రిప్పి మిసెస్ రీటా రాఘవ తలపైన బలంగా మోదింది.

"అమ్మో!" అంటూ గిరగిర తిరుగుతూ క్రింద పడిపోయాడు.

"అతన్ని దేంతోనైనా కట్టెయ్యండి!" అరచాను.

పరేఖ్ తను తెచ్చిన నైలాన్ తాడుతో కట్లు కట్టడం ప్రారంభించాడు. మిసెస్ రోటా వచ్చి నాకు దగ్గరగా కూర్చుంది. నెత్తురుముద్దలావున్న తలను తూట్లుపడి ఎర్రగా రక్తం కారుతున్న భుజాన్ని మార్చి మార్చి చూడటం గమనించాను. ఆమె కళ్ళు నీళ్ళతో నిండిపోవటం కూడా గుర్తించి "రోజా! అధైర్యపడకు. నాకేంకాలేదు. ఇలాంటివి మామూలే!" అన్నాను.

ఆమె చీరచెంగులతో తలంతా తుడిచింది. భుజానికి కట్టుకట్టింది.

"ఇంకెంతదూరం వుంటుంది."

"వంద కిలోమీటర్లుపోతే వైజాగ్ వస్తుంది" అన్నాను. అప్పుడే ఎర్రలైటు వెలిగింది.

"ఏమయింది?" అరిచింది మిస్ రోటా.

"ఫ్యుయల్ అయిపోయింది. మరో నాలుగు నిమిషాల్లో విమానం కూలిపోతుంది. ఈలోగా పేరాచూట్ ద్వారా డాక్టర్ పరేఖ్‌ను దూకెయ్యమందామా?" అన్నాను.

అక్కడికప్పుడే వచ్చిన పరేఖ్ "నో! చావు కానీ

బ్రతుకు కానీ అందరం ఒకటిగానే చవిచూద్దాం. డోంట్ వరీ మైబాయ్. యస్. ఓ. యస్. సిగ్నల్ పంపు. ఈ ప్రాంతంలో చాలా నౌక లున్నాయి. మన ప్రభుత్వపు సబ్ మెరైన్ కూడా వుండివుండాలి. ఎవరికి సిగ్నల్ అందినా మనల్ని రక్షిస్తారు'' అన్నాడు.

మనిషి ముసలి అయినంత మాత్రాన మనసు ముసలిది కాదనే దానికి పరేఖ్ ఆత్మస్థైర్యంకన్నా వేరే నిదర్శనం అనవసరమనిపించింది నాకు. ఆయన చెప్పినట్లు చేశాను.

ఆ తర్వాత రెండు నిముషాలు రెక్క తెగిన పక్షిలా, మా విమానం నిట్టనిలువుగా క్రిందకు రాలిపోయింది.

అందరం భగవంతుణ్ణి కడసారి తలచుకుని కళ్ళు మూసుకున్నాం. నీళ్ళపైన విమానం పడగానే స్ప్రింగ్ బాలులా ఒక్క వుదుటున పైకెగిరి మళ్ళీ పడింది. ఆ తర్వాత ఏమయిందో నాకు తెలీదు.

* * *

నాకు స్పృహ వచ్చేసరికి చుట్టూ తెల్లటి గోడలు కనుపించాయి. వొంటిపైన ఎర్రటి రగ్గుంది. కళ్ళు త్రిప్పి గదంతా వెతికాను. నర్సు కనుపించింది. ఆమెను పిలిచి అడిగాను.

సముద్రంలో కూలిపోయిన విమానాన్ని ప్రక్కనే వున్న జల ఉష అనే నౌకలోని వాళ్ళు చూశారనీ, మమ్మల్ని రక్షించేందుకు వచ్చారనీ, నన్నూ, పరేఖ్ ను తప్ప మరెవ్వరినీ వాళ్ళు దక్కించుకోలేకపోయారనీ చెప్పింది.

"డాక్టర్ పరేఖ్ ఎలా వున్నారు?"

"క్షేమంగా వున్నారు. నీకోసం ఆయన ఎదురు చూస్తున్నాడు. ఎలావుంది.''

"బాగుంది" చెప్పాను.

అంతలోనే డాక్టర్ పరేఖ్ లోనికొచ్చాడు. నన్ను ఘట్టిగా కౌగలించుకున్నాడు.

"మిసెస్ రోటా నన్ను ఎంతగానో ప్రేమించింది డాక్టర్. ఆమెను పోగొట్టుకున్నాను" అంటూ ఏడ్చాను.

"ఏడవకు. ఆ పుత్తులయొక్క ఆత్మీయత అలాంటప్పుడే అరమవుతుంది. ఆమె పేరు శాశ్వతంగా ప్రపంచంలో నిలిచిపోయేట్లు చేస్తాను" అన్నాడు పరేఖ్.

ఆయన దేశానికి సమర్పించిన ఫార్ములాలను, మిసెస్ రోటాకు అంకితం చేసినట్లు పేపర్లో వచ్చిన వార్తలను చదివి ఆనందించాను.

—: ఐ పో యిం ది :—

# పేయింగ్ గెస్ట్!

## కంచర్ల రమణ

రాత్రి పదిగంటలయింది.

ఏవేవో ఆ క్షణంవరకూ పిచ్చిగా ఆలోచిస్తున్న జగన్నాథం ఏదో ఒక నిశ్చయానికి వచ్చినట్లుగా మెల్లగా లేచాడు మంచంమీంచి.

జగన్నాథం యీ మధ్యనే రిటైరయ్యాడు. రిటైరయ్యాక పనేమీ లేకపోవటంతో వట్టిగా తిని కూర్చోవటంతో అతడికి జీవితం బోర్ కొట్టసాగింది. కాలాక్షేపానికి ఏదైనా వ్యాపకం కల్పించుకోవాలని తెగ ఆలోచించసాగాడు.

అతడి ఆలోచనలు కోమలి, కాంతారావుల పైకి మళ్లాయి.

తనను పేయింగ్ గెస్టుగా ఉంచుకుంటున్న కోమలి, కాంతారావుల మధ్య కలహం సృష్టిస్తే—? అదే అతడికి వచ్చిన ఆలోచన.

కోమలికి మొదట్నుంచీ తనంటే యెందుకో కోపం. ఏదో దూరపు బంధుత్వంకొద్దీ కాంతారావు తనను ఆదరిస్తున్నాడుకాని, నిజానికి అతడికికూడా తనంటే గొప్ప అభిమానం లేదు.

కోమలికీ, కాంతారావుకు పెళ్ళయి మూడేళ్ళు కావస్తోంది. ఇంకా పిల్లలు కలగలేదు వాళ్ళకు.

వాళ్ళిద్దరిమధ్య తను మనస్పర్థలు సృష్టించాలి!

కోమలి అంటే నెత్తిన పెట్టుకుని పూజించే కాంతారావుచేత ఆమెను చితక దన్నించాలి! ఆమెను వీధిలోకి గెంటించాలి!

అప్పుడుగాని, తనకు కోమలి చూపుతున్న అమర్యాదకు ప్రతీకారం జరుగుతుంది. తనకు బోలెడు కాలక్షేపమూ అవుతుంది.

వెంటనే తన పాత ట్రంక్ అడుగున వున్న పాత ఎక్సర్‌సైజు పుస్తకంలోంచి ఓ కాయితం చించి, ఎడం చేతి వ్రాతతో వుత్తరం రాయసాగాడు.

"డియర్ మిస్టర్ కాంతారావ్!

నేనెవర్నో అన్న అనవసరమైన ప్రశ్నతో బుర్ర పాడుచేసుకోకుండా, నేను నీ శ్రేయోభిలాషినే అన్న విషయం మాత్రం గ్రహించి, యిక్కడ నేను చెప్పిన విషయాలు మనస్సులో పెట్టుకుని నీ భార్యారత్నం ప్రవర్తనమీద ఓ కన్నేసి వుంచు. నిన్ను ఆరాధించి, పెళ్ళి చేసుకొన్న మునుపటి కోమలి అనుకున్నావేమో? చాలా మారిపోయింది.

పాపం! ఆవిడమాత్రం యేంచెయ్యగలదులే. నీ బ్రతు

కులో సగం ఆఫీసుకు అమ్ముడుపోతే, మిగిలిన సగం నాట కాలకు అంకితమయిపోయిందాయె. ఆవిడ సేవకు యేమి మిగిలింది?

అందుకేలే, వీధగుమ్మం అంటే, యెరుగనావిడ యిప్పుడు ముప్పొద్దులా అక్కడే గడుపుతోంది.

మగాళ్ళవుపిస్తే మొగమాటానికైనా వాళ్ళవైపు కన్నెత్తి చూడని ఆ యిల్లాలు యిప్పుడు, మగ పురుగు కనిపిస్తే చాలు అతడు కనుమరుగయ్యేంతవరకు ఆకలి చూపులు చూస్తోంది.

యీ సోదంతా వదిలి, అసలు విషయానికి వద్దాం. ఈ మధ్యనే, యీ వీధిలోకి సన్నగా, యెర్రగా, పొడుగ్గా వున్న ఓ కుర్రాడు వచ్చాడు. ఎవరో, ఏ వూరునుంచి వచ్చాడో నాకు తెలీదు. కాని, అతడ్ని చూపులతో పలకరించడంలోను, నవ్వులతో సత్కరించడంలోను మీ ఆవిడ లోకమే మరిచిపోతోంది.

పరిస్థితి చెయ్యిదాటి పోకముందే, యిల్లు దిద్దుకుంటా వన్న సదుద్దేశంతో యీ వుత్తరం రాయడం జరిగింది.

ఇట్లు
నీ శ్రేయోభిలాషి."

ఉత్తరాన్ని కవరులోపెట్టి అతికించేముందు రెండు సార్లు చదువుకున్నాడు జగన్నాథం, అది తను రాసేడని ఎవరయినా తెలుసుకోవడానికి అవకాశముందేమోనని.

అది తన దస్తూరి అని తెలుసుకోవడం బ్రహ్మరుద్రాదు లకు కూడా తెలీదు.

కాంతారావు మనసులో కోమలి గురించి అనుమాన బీజాలు నాటేందుకు, యీమాత్రం చాలు.

కాంతారావు మొదటి వుత్తరంలోని నిజానిజాల గురించి పరిశీలన మొదలుపెడతాడు.

అనుమానంతో చూసే కంటికి, యేదో ఒక ప్రవర్తన లోపం భార్యలో కనిపించక మానదు. దాంతో అసలు గ్రంథం మొదలవుతుంది. అంతవరకూ అతిసాధారణంగా అవుపించిన భార్య ప్రవర్తనలో కొత్త అర్థాలు అవుపిస్తాయి.

ఈలోపున అగ్నికి ఆజ్యం తోడుచేసినట్టు, తను ఒకటో రెండో యిలాంటి ఉత్తరాలే గుద్దితే, కోమలిని వీధిలోకి నెట్టుతాడు కాంతారావు.

జగన్నాథం తృప్తిగా వూపిరిపీల్చి, ఉత్తరాన్ని దగ్గరలోవున్న పోస్టుబాక్సులో వెయ్యడానికి లేచాడు.

# 2

ఉదయం పదకొండుగంటల ప్రాంతంలో పోస్ట్‌మాన్ వచ్చి ఓ వుత్తరం కోమలికి అందించి వెళ్ళాడు.

మేడమీద తన గది కిటికీలోంచి చూసాడు జగన్నాథం.

ఆ వుత్తరం తను రాసినదే! జగన్నాథం ఉత్తరాన్ని పోల్చుకొన్నాడు.

ఉత్తరం అందుకుని, కోమలి అటు యిటూ తిప్పి చూసింది, ఎక్కణ్ణుంచి వచ్చిందా అని.

ఫ్రం యెడ్రస్ లేకపోవడంవల్ల క్షణం నిరుత్సాహం పొందినా, ఆ తరువాత ఏదో కూనిరాగం తీయడం మొదలు పెట్టింది కోమలి.

ఆ యింటిలో ఒకరికొచ్చిన వుత్తరాలు రెండోవాళ్ళు విప్పి చదివే అలవాటులేదు.

అంచేత కాంతారావు ఆఫీసునించి వచ్చాక చదవడానికి, గదిలో టేబిలుమీద అవుపించేలా పెట్టివుంటుంది అనుకున్నాడు జగన్నాథం.

అతని గుండెలు ఉద్వేగంతో కొట్టుకో నారంభిం చాయి.

ఒకవేళ తనే ఆ వుత్తరం రాసాడని కాంతారావుకు తెలిసిపోతేనో?...

'తిన్నయింటి వాసాలు లెక్క పెడతావా ఖలుడా?' అంటూ తనని యింట్లోంచి బయటకు నెట్టేస్తాడు.

అప్పుడు తనకేది దారి?

జీవితం చరమదశలో ప్రశాంతంగా సాగిపోతున్న తన జీవనస్రవంతిలో కావాలని తనే కెరటాలు సృష్టించు కోవడం లేదుగదా?

ఏదో చెప్పలేని బాధతో అతని గుండె కలుక్కుమంది.

కాని, మరుక్షణం సమాధానం చెప్పుకున్నాడు తనకు తాను.

తను యేవేవో వూహించుకుని భయపడి చస్తున్నాడు గాని, ఆ వుత్తరం తనే రాసినట్టుగా కాంతారావు ఎలా వూహించగలడు?

దస్తూరి గుర్తించే అవకాశంలేకుండా ఎడమచేతితో రాసాడు. ఇహ, తన పేరు ఎలానూ రాయలేదు. అతడికి ఎందరో స్నేహితులు. వాళ్ళల్లో పైకి స్నేహితుల్లా నటిస్తూ కత్తులు గుండెల్లో బిగబట్టుకుని కూచుని తిరుగులేని దెబ్బ కాంతారావుమీద తీయడానికి మంచి అవకాశంకోసం యెదురుచూస్తున్న శత్రువులు, కొంతమంది ఉండివుంటారు. వాళ్ళమీదకు పోతుంది, అతడి అనుమానం కచ్చితంగా.

అయినా, తనమీద అనుమానబడ్డానికి, తనతో ఏం కక్ష ఉందనుకుంటాడు?

ఆ ఉత్తరం ఓ రసవత్తరమైన నాటకానికి నాంది. అర్థంలేని భయాల్ని గుండెల్లో పేరబెట్టుకుని అనవసరంగా తను పొందే ఆనందాన్ని పాడు చేసుకుంటున్నాడు.

జరగబోయే నాటకంలోని ప్రతి అంశాన్ని అతి దగ్గరలో ఉండి చూసి ఆనందించాలి.

సాయంకాలం అయిదు గంటలకు కాంతారావు ఆఫీసు నుంచి తిరిగి వచ్చేంతవరకూ ముళ్ళమీద కూచున్నట్టుగా గడిపాడు జగన్నాథం.

ఫలహారం తీసుకుని వెళ్ళమని, సాయంకాలం కోమలి రెండుసార్లు కేక వేసి పిలిచినా, "అబ్బాయిని రానియ్యమ్మా! వాడితో కలిసి తింటాలే" అని అన్నాడు.

ఉత్తరం చదువుతుండగా కాంతారావు మొహంలో రంగులు ఎలా మారుతాయో దగ్గరుండి చూడాలి తను!

కాంతారావు ఆఫీసునుంచి వచ్చాడు.

అతడు కాళ్లుచేతులు కడుక్కొని వచ్చేలోపల, పళ్లెల్లోకి ఫలహారం సర్దుతూ, కోమలి జగన్నాథాన్ని కేకేసింది, కిందికి రమ్మని.

బట్టలు వేసుకుని జగన్నాథం క్రిందికి వెళ్ళాడు. ఫలహారం అయ్యాక, బీచికి వెళ్ళాలని అతని ఉద్దేశం.

కాంతారావు టిఫిను తినడం ఆరంభించాడు. జగన్నాథంకూడా తల వంచుకుని, చెంచాతో టిఫిను నోట్లో పెట్టుకోసాగాడు.

"ఇదిగోండి. ఉదయం వచ్చింది" .అంటూ కోమలి కాంతారావుకు ఉత్తరం అందించింది.

టిఫిను తినడం ఆపి, కాంతారావు ఆత్రంగా అందుకున్నాడు ఉత్తరాన్ని. విప్పి చదవసాగాడు.

మామూల్గాలుగా అవుపించడానికి శాయశక్తులా ప్రయత్నిస్తూ, జగన్నాథం కాంతారావు మొహాన్ని పరిశీలించసాగాడు ఆసక్తిగా.

జగన్నాథం అనుకున్నట్టుగానే, తగలవలసిన చోట దెబ్బ తగిలింది, కాంతారావుకు.

కాంతారావు మొహం క్షణంలో మబ్బులు మూసిన ఆకాశంలా నల్లగా మారిపోయింది.

ఉత్తరం చదవడం పూర్తి చేసాడు కాంతారావు. మడిచి, జేబులో పెట్టుకుని, మవునంగా టిఫీను తినడం పూర్తి చేసాడు.

జగన్నాథంకూడా టిఫీను పూర్తిచేసి లేచి చెయ్యి కడుక్కున్నాడు.

"ఎక్కణ్నుంచండీ ఆ ఉత్తరం? ... ఎవరు రాసారండీ?" అడిగింది కోమలి; భర్త చేతులమీద చెంబుతో నీళ్లు పోస్తూ.

కాంతారావు తనంతట తాను ఉత్తరంలోని విశేషాలు చెప్తాడని అంతవరకూ ఎదురుచూసి, నిరాశ చెంది, ఉండలేక అడిగేసింది.

"అబ్బే! ఎక్కణ్నుంచీ లేదు" ఆమె మాటల్ని దాటేసాడు కాంతారావు.

"అదేమిటండీ. ఎక్కణ్నుంచీ లేదని అంటారేమిటి? ఉత్తరం చేతిలో పెట్టుకుని" మొగుణ్ని నిలవేసింది కోమలి.

కాంతారావుకు చిరాకెత్తుకొచ్చినట్టుంది.

"చెప్తుంటే నీకాదూ. ఎక్కణ్నుంచీ లేదని... పైగా నీతో చెప్పాల్సిన విషయాలైతే... నేనే చెప్తానుగా. నువ్వడగడం దేనికి?" కోమలిని కసిరేసాడు.

కోమలి మొహం మాడ్చుకుంది. మూతి బిగించేసుకుంది.

'మొదటి అంకంలోని మొదటి దృశ్యం అయిపోయింది' అనుకుంటూ, "అమ్మా! ఇవిగో నా గది తాళాలు. జాగ్రత్త పెట్టు" అని చెప్పి, బీచికి బయలుదేరాడు జగన్నాథం.

# 3

మర్నాడు ఉదయం లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, కాఫీకోసం దిగువకు వెళ్ళేసరికి, ఆ యింటి వాతావరణమే మారిపోయినట్టనిపించింది జగన్నాథానికి.

కోమలి వంటింట్లో నిశ్శబ్దంగా పని చేసుకుంటోంది. గిన్నెల చప్పుడుమాత్రం విన్పిస్తోంది.

ఆఫీసు పని చేసుకుపోతున్నట్టుగా, తన పనేమో, తనేమో అన్నట్టుగా ప్రవర్తిస్తున్నాడు కాంతారావు.

ఎంతో అవసరమయితే తప్ప కోమలితో మాట్లాడ్డం లేదు.

అదే మునుపైతే, కోమలిమీద కాంతారావు, కాంతారావుమీద కోమలి వేసే జోకులతో, వారి కలగాపులగపు నవ్వులతో ఇల్లు దద్దరిల్లిపోయేది.

చెప్పలేని ఆనందంతో పొంగిపోయాడు జగన్నాథం. తన ఉత్తరం తిరుగులేకుండా పనిచేస్తోంది, అనుకున్నాడు.

కొట్టవచ్చినట్టుగా మార్పు అవుపిస్తున్నా 'యేమిటమ్మా? అలాగున్నారేం?' అని అడగకపోతే వాళ్ళకి తనపైన అనుమానం కలిగే అవకాశం ఉందని అనుకుని "యేమిటిరా అబ్బాయ్! అలాగున్నరేం అమ్మాయ్?" అన్నాడు జగన్నాథం.

"అబ్బే! ఏంలేదు బాబోయ్! బాగానే వున్నామే" అన్నాడు కాంతారావు. కోమలిగూడా అలాగే అంది.

"అలాగంటే సరిపోతుం దనుకున్నారా! ఏదో కోల్డ్ వార్ జరుగుతోంది. నాకు చెప్పరా అదేంటో" అన్నాడు జగన్నాథం, తను ఆ తగువు ఏదో తెల్సుకుని తీర్చడానికి సిద్ధంగా ఉన్నట్టు.

"అదేంలేదు మావయ్యా!...నీకు గాకపోతే, యెవరికి చెప్పుకుంటాం, సమస్యలేవైనా వస్తే...అయినా నీ దగ్గర

రహస్యాలేమిటి మాకు'' అంది కోమలి.

సంతృప్తి పడ్డట్టుగా మొహంపెట్టి మేడెక్కాడు జగన్నాథం.

రెండు రోజులు గడిచాయి.

మూడో రోజున, మధ్యాహ్నం భోజనాలయాక, ఏదో పుస్తకం తీసి చదవ నారంభించాడు జగన్నాథం, కాలక్షేపం కోసం.

గంటసేపు చదివాక, విసుగు పుట్టింది. వీధివైపునున్న కిటికీ దగ్గరగా ఓ కుర్చీ లాక్కుని వీధిలోకి చూడసాగాడు.

కోమలి వీధి గుమ్మంలో నిల్చుంది. వీధిలోకి అటూ యిటూ తేరిపార చూస్తోంది.

పావుగంట గడిచింది. ఓ యువకుడు రోడ్డమ్మట పోతూ, కోమలివైపే రెప్పార్పకుండా చూసాడు.

కోమలికూడా తగ్గలేదు. అతడివైపే రెప్పార్పకుండా చూస్తూ ఉండిపోయింది. పైగా కిసుక్కున నవ్వింది.

ఆ యువకుడుకూడా సమాధానంగా నవ్వాడు. అంతే గాదు. పావుగంట పోయాక, ఏదో పనున్నట్టు, ఇంకో సారి ఆ రోడ్డమ్మటే, కోమలిని కళ్ళతో తినేస్తూ వెళ్లాడు.

అతడ్ని ప్రోత్సాహించడమే తన ధ్యేయమన్నట్టు, ఆమెకూడా అలాగే చూసింది. అతడు కనిపించినంత మేరా, మెడలు విరుచుకుని, అతనివైపే చూస్తూ ఉండిపోయింది.

సాయంకాలం వరకూ, ఆ యువకుడు అలా బీట్లు వేస్తూనే ఉన్నాడు. కోమలి వీధి గుమ్మాన్ని అంటిపెట్టుకునే ఉండిపోయింది.

జగన్నాథం ఆనందంతో వివశుడయ్యాడు.

'ఏవేవో ఊహించిరాసే బాధ తనకు తప్పింది. జరుగు తున్నది యథాతథంగా రాస్తే, తన ఆశయం నెరవేరు తుంది' అనుకున్నాడు జగన్నాథం.

కాంతారావు పేర్న ఆరాత్రే ఓ ఉత్తరం పోస్టుచేసాడు, అవాళ సాయంకాలం జరిగిందంతా పూసగుచ్చినట్టు రాసి.

# 4

ఆయువకుడు బిల్లు కొట్టడంతో ఆగలేదు. "హల్లో హౌ ఆర్ యూ?" అంటూనో "బావున్నారా" అంటూనో పలకరింపులు మొదలుపెట్టాడు కోమలితో.

కోమలికూడా వెనుకాడలేదు. చిరునవ్వులు చిలక రిస్తూనో, తమాషాగా జవాబులు యిస్తోనో, అతణ్ని మరింత కవ్విస్తోంది.

క్రమంగా పలకరింపుల స్నేహం, కబుర్లలోకి మారింది. అతడు రోడ్డుమీద, ఆమె వీధి గుమ్మంవద్ద నిల్చుని గంటల కొద్దీ కబుర్లతో కాలక్షేపం చెయ్యసాగారు.

ఒక్క వివరం పొల్లుపోకుండా ఎప్పటికప్పుడు చూసిం దంతా ఉత్తరాలద్వారా కాంతారావుకు చేరవేస్తున్నాడు జగన్నాథం.

నవ్వులతో, జోకులతో ఒకనాడు ప్రతిధ్వనించిన ఆ యిల్లు యిప్పుడు ప్రళయం ముందరి ప్రశాంతతవంటి నిశ్శబ్దంతో నిండి ఉంది.

ఎంతో అవసరముంటే తప్ప కోమలి, కాంతారావు ఒకరికొకరు ఎదురు రావడంలేదు.

ఆమె అంటూ ఒకర్తె అయింట్లో ఉందన్న విషయం మర్చిపోయినట్టు ప్రవర్తించసాగాడు కాంతారావు.

ఎవరివల్ల ఏ తప్పు జరుగుతుందో, ఎవరివల్ల ఏ సంక్షోభం లేస్తుందో అన్న భయంకొద్దీ ఒకర్నొకరు తప్పించుకు తిరుగుతున్నట్టు వ్యవహరించ సాగారు.

జగన్నాథానికి మహదానందంగా ఉంది. ఆ యింట్లో జరుగుతున్నదంతా తనవల్లనే!

కోమలి, కాంతారావులమధ్య భయంకరమైన మవునం రాజ్యం చేస్తోంది.

వారంరోజులు గడిచాయి.

'తను ఆశించింది యింతేనా? కేకలు, కొట్లాటలు మచ్చుకన్నా జరగటంలేదు' అని అనుకుంటుంటే, జగన్నాథం కడుపు పొంగు తీరేలా పెద్ద దెబ్బలాట జరిగింది.

జరిగింది పెద్ద దెబ్బలాటే అయినా, దానికి కారణం మాత్రం అతిచిన్నది.

ఆయింట్లో వాడుకోవడానికి రెండు దువ్వెనలున్నాయి. అందులో ఒకటంటే కాంతారావుకు యిష్టం. కోమలికి ఆ పట్టింపు లేదు. అవుపించిన దువ్వెనతో తల దువ్వేసుకుంటుంది.

అవాళ, కాంతారావు ఎప్పుడూవాడే దువ్వెన అగపడలేదు. ముందు వెతకాల్సినచోటల్లా వెతికాడు. కాని లాభంలేకపోయింది.

"దువ్వెనుండాలి. యెక్కడా కనపడదేం?" అడిగాడు కాంతారావు.

"ఇదుగో. ఇందండి" అంటూ రెండో దువ్వెన అందించింది కోమలి.

"అది కాదు నా దువ్వెన" అని పళ్లు కోపంతో నూరుతూ,కోమలి అందించిన దువ్వెన్ని మూలకు విసిరేసాడు.

కోమలి మాట్లాడలేదు. తనుకూడా భర్తకు కావల్సిన దువ్వెనకోసం యిల్లంతా వెదికింది. ఫలితం శూన్యం.

ఓ ప్రక్క ఆఫీసుకు టైం అయిపోతోంది. చిందులు వేయసాగాడు కాంతారావు.

"ఇప్పటికి యిది వాడండి. తరువాత మీ దువ్వెన వెదికి

జాగ్రత్తచేస్తాను" అంటూ మూలనుంచి దువ్వెనతీసి మళ్లా భర్తకు అందించింది.

కాంతారావుకు రక్తం మరిగిపోయినట్లయింది.

"యీ దిక్కుమాలిన దువ్వెన నాకు చూపించకు" అని గట్టిగా అరిచి, కోమలి అందించిన దువ్వెన్ని రెండు ముక్కలుగా విరిచేసి, ఆమె మొహంమీద కొట్టాడు.

కాంతారావు ఎన్నడూ అంత మూర్ఖంగా ప్రవర్తించ లేదేమో, కోమలికి కూడా కోపం పొడుచుకు వచ్చింది.

"ఏదో బంగారం పోయినట్టుగా రెచ్చిపోతారెందుకు? అదే దొరుకుతుంది. సాయంకాలం దొరక్కపోతే, కొత్తది కొందాం" అంది విసురుగా కోమలి.

దాంతో కాంతారావు కోపం తారాస్థాయి చేరుకుంది. "ఏమిటే ఆ సమాధానం? ఏమిటా తలపొగరంట? పోతే కొత్తదొస్తుందా? యివి సంసారి ఆడే మాటలేనా?" యిల్లు అదిరిపోయేలా అరిచాడు కాంతారావు.

"ఎందుకా అరుపులు? నేనేం చేసానని? మనస్సులో ఏవేవో కుళ్లు పెట్టుకుని ఏసాకు దొరుకుతుందా, దెబ్బలాటకు దిగుదామా అని చూసేవాళ్ళకు ఏం చెప్పగలం?"

"ఏమిటే, ఊరుకుంటుంటే మరీ పేట్రేగి పోతున్నావ్? అయితే నేను కుళ్ళు మనిషినటే" అంటూ ఒళ్ళు తెలియని ఆవేశంతో కాంతారావు కోమలి కొప్పు పుచ్చుకుని వంచి, వీపుమీద నాలుగు బాదాడు.

జరుగుతున్న రభస తెలిసికూడా భార్యాభర్తల మధ్య సామరస్యం కోసం ప్రయత్నించకపోతే, వాళ్ళు తన నే విధంగా అనుమానిస్తారో అన్న భయంతో "ఒరేయ్! కాంతారావ్! ఏమిట్రా అఘాయిత్యం? ఆడకూతుర్ని అలా బాదుతున్నావేంరా? ఆడది కంట నీరుపెడితే అశుభంరా" అంటూ దిగువకు వచ్చాడు జగన్నాథం.

"బాబాయ్! నీకేం తెలీదు ఊరుకో. దీనికీ మధ్య మదం ఎక్కువయిందిలే. మొగుడంటే లక్ష్యం లేకుండా జవాబులిస్తోంది. దీన్ని వాళ్ళ చంపి పాతర వేసేంతవరకూ నాకు కసితీరదు" అంటూ జగన్నాధాన్ని దగ్గరకు రానివ్వ లేదు కాంతారావు.

కోమలి శోకాలు మొదలుపెట్టింది. నూతిలో పడిపోతా నంది. ఉరిపోసుకుంటానంది. నెత్తిమీద కిరసనాయిలు పోసుకుని అంటించుకుని ఛస్తానంది.

కాంతారావు మెత్తబడలేదు.

పెడసరంగా జవాబులిచ్చాడు. "కోమలి చచ్చాక నెల తిరక్కుండానే పెళ్ళిపీటలమీద కూచుంటాను. నాకేం?" అన్నాడు. ఆమె యెప్పుడు ఛస్తుందా? అని యెదురు చూస్తున్నానన్నాడు.

నిజంగా తను అంత రోషంగలదైతే, చేసి చూపాలిగాని మాటలు అనడందేనికని సవాలుచేసి మరీ ఆఫీసుకు వెళ్ళాడు కాంతారావు గంట ఆలస్యంగా.

కోమలి యే అఘాయిత్యానికి ఒడిగడుతుందేమోనని ఆ రోజంతా భయంభయంగానే గడిపాడు జగన్నాధం.

నిజంగా, ఆమె అన్నట్టుగా, ఆమె యే సాహసానికో పూనుకుంటే?

ఆ పాపం తనని చుట్టుకుంటుంది.

జగన్నాధం మనస్సు అంతులేని దిగులుతో బరువెక్కి పోయింది.

## 5

కోమలి యే అఘాయిత్యానికీ పాల్పడలేదు. రెండు రోజులు పోయాక జగన్నాధం మామ్మూలు మనిషయ్యాడు. భయంతో దడదడలాడిపోయిన గుండె కుదుటబడింది.

అయితే, అవాల్టి దెబ్బలాట ధర్మమా అని, వీధి

గుమ్మంలో నిల్చుని, పరాయి మొగాడితో రోజూ జరిగే కోమలి బాతాఖానీ మాత్రం ఆగిపోయింది.

ఆమెలో వచ్చిన హఠాత్పరిణామం చూసి ఆశ్చర్య పోయాడు జగన్నాథం.

కోమలి వ్యవహారం ఆశించని కొత్తమలుపు తిరగ్గానే ఖిన్నుడయ్యాడు జగన్నాథం.

రెండు రోజులు మతిపోయిన మనిషిలా అయిపోయాడు.

ఇలా వుండగా మూడో రోజు కోమలి మేడమీదకు వచ్చి "మామయ్యగారూ! అలా బజారుకు వెళ్ళివస్తాను. చిన్నపని ఉంది" అంటూ యింటి తాళాలు జగన్నాథానికి అందించి వెళ్ళిపోయింది.

జగన్నాథం మెదడులో చిన్న గంట మ్రోగినట్టయింది.

'తను ఆ కుర్రాడితో మాట్లాడుతున్న సంగతి ఎవరో కనిపెట్టి, తన భర్తకు చేరవేస్తున్నారన్న విషయం ఆమె గ్రహించి ఉంటుంది. అంచేత బజారు నెపం మీద, ఆ కుర్రాడ్ని రహస్యంగా కలుసుకోవడానికి వెళ్ళడం లేదుగదా కోమలి?' అనుకున్నాడు జగన్నాథం.

గబగబ తన గది తలుపులుమూసి, తాళాలు బిగించి వీధిలోకి వచ్చి బజారు ముఖం పట్టాడు.

కోమలి తనను చూడకుండా, ఆమెకు పాతిక గజాల దూరంలో ఆమెను అనుసరించసాగాడు జగన్నాథం.

ఆమె బజారు దాటిపోయింది. మరికాస్త దూరం పోయాక, ఆ కుర్రాడు కనిపించాడు.

తన అంచనా రైటయినందుకు పొంగిపోయాడు జగన్నాథం.

మొహమంతా నవ్వులు చేసుకొని, ఆ కుర్రాడు ఆమెను సమీపించబోయాడు.

కాని, ఆమె సైగ చేసింది. దాంతో ఆగిపోయాడు

బి తిరపోయి.

ఆమె ముందుకు సాగిపోయింది. నాలుగడుగులు ముందుకు పోయి, వెనక్కి తిరిగి, అతడ్ని తన వెనుక రమ్మని కళ్ళతో సైగ చేసింది.

అతడు ఆమె వెనకాలే నడవసాగాడు.

కొంతదూరం పోయాక, గ్రంధాలయం మేడ అవుపించ గానే అందులోకి దారితీసింది కోమలి. వెనువెంటనే వెళ్ళాడు కుర్రాడు.

కోమలి తెలివితేటలు మెచ్చుకోకుండా ఉండలేక పోయాడు జగన్నాథం.

ఏ పార్కులోనే, ఏ సముద్రపొడ్డునో, లేక యింకే రహస్య ప్రదేశంలోనో తామిద్దరూ కలిసి అవుపిస్తే, ఎన్నో అనుమానాలకు దోవతీస్తాయి. అదే లైబ్రరీలో అయితే, "నాకేం తెలీదు. కాకతాళీయం" అని దబాయించేయ వచ్చు.

జగన్నాథం కూడా మెల్లగా లైబ్రరీలోకి ప్రవేశిం చాడు. వాళ్ళను గమనించనట్టే వెళ్ళి, ఏదో పత్రికలు చూస్తున్నట్టు నటిస్తూ వాళ్ళవైపు చూపులు సారించాడు.

కోమలి, ఆ యువకుడు మేగజైన్ సెక్షన్ వదిలేసి బుక్ సెక్షన్‌లోకి వెళ్ళారు.

వాళ్ళు వెళ్ళాక, ఓ నిముషం పోనిచ్చి, జగన్నాథం కూడా అక్కడకు వెళ్ళాడు.

పుస్తకాలు యెంచుకునే నెపంమీద, కోమలి ఆ యువకుడు ఓ పుస్తకాల రేక్ వద్దకు వెళ్ళారు.

రేక్‌కు ఒకవైపు ఆమె, రెండోవైపు అతను నిల్చు న్నారు. ఒకర్నొకరు చూసుకోడానికి వీలుగా, మధ్య నున్న పుస్తకాలు కొన్ని తీసి చేతిలో పట్టుకుంది కోమలి.

చప్పుడు చెయ్యకుండాపోయి, ఆమె వెనుకనున్న

రేక్ను అడ్డంగా వుంచుకుని, వాళ్ళ సంభాషణ విన సాగాడు జగన్నాథం, వాళ్ళకు కనిపించకుండా.

"మీరీమధ్య మరీ నల్లపూసైపోయారు. గుమ్మంలో అవుపించడంలేదు బొత్తిగా" అన్నాడు ఆ కుర్రాడు.

"ఉష్! గట్టిగా మాట్లాడకు. గోడలకు కూడా చెవు లుంటాయి. మన విషయం మా ఆయనకు తెలిసిపోయిందని నాకు అనుమానంగా ఉంది. ముభావంగా ఉంటున్నా రంటే, అదీలేదు. మొన్న దువ్వెన దొరకలేదన్న సాకు క్రింద నన్ను పట్టుకుని చితకబాదారు" చెప్పింది కోమలి.

"అయ్యో! నావల్ల మీకెంత కష్టం వచ్చిందండీ" జాలి చూపాడు కుర్రాడు.

"నేను చచ్చిపోయినా ఫరవాలేదు. నిన్ను విడిచి పెట్టను. నా మనస్సుకు నచ్చిన పనిచేసి తీర్తాను" అంది కోమలి.

"నేనూ అంతే! మీ తోడిదే నా లోకం. ఇదిగో వాగ్దానం చేస్తున్నాను" అంటూ అతడు చెయ్యి అందించాడు.

అటూ యిటూ చూసి, కోమలి ఆ చెయ్యిని మెల్లగా స్పృశించి వదిలేసింది.

రెండు నిముషాలు ఒకర్నొకరు చూసుకుని గడిపాక "రేపొకసారి యింటివైపు రండి" అంది కోమలి.

"యేం? యెందుకు?"

"చెప్తాను."

"ఎన్ని గంటలకు?"

"మధ్యాహ్నం పన్నెండు గంటలుదాటాక."

"అలాగే!"

"తలుపుతీసి ఉంచుతాను. తిన్నగా తలవంచుకుని వచ్చెయ్యి."

"మీ ఆయన ఉంటారేమో?"

"ఆయన ఉండరు. ఆఫీసులో ఉంటారు. అందుకే రమ్మంటున్నాను."

"మీ మేడమీదాయన ఉంటాడేమో?"

"మధ్యాహ్నం తిండి తిన్నాక, కునుకుతియ్యడం అలవాటు ఆయనకు. సాయంకాలం నాలుగువరకూ మరి లేవడు."

"అలాగే వస్తాను."

"ఒట్టు."

"ఒట్టుదేనికి? తప్పక వస్తాను."

చేతిలో పట్టుకున్న పుస్తకాలు తిరిగి రేక్‌లో పెట్టింది. గబగబా అక్కడ్నుంచి బయటకు వచ్చేసింది కోమలి.

ఆమె వెనుకే, ఆ కుర్రాడు కూడా బయటకు జారుకున్నాడు క్షణంపోయాక.

ఇంకో నిముషంపోయాక, తనూ బయటపడి, అడ్డు త్రోవగుండా యింటికి చేరుకుని, కోమలి వచ్చే సమయానికి ఎప్పటిలా గదిలో కూచున్నాడు జగన్నాథం.

## 6

మర్నాడు ఆ కుర్రాడ్ని కోమలి యెందుకు రమ్మందో జగన్నాథానికి తెలుసు.

అయినా, కళ్ళారా చూసి, వాళ్ళమధ్య సాగుతున్నది పచ్చిరంకుతనమని నిర్ధారించుకున్నాక, కాంతారావుకు ఉత్తరం రాయాలి, అని అనుకున్నాడు.

మర్నాడు మధ్యాహ్నం పన్నెండు అయ్యేంతవరకూ తమాయించుకోలేనిఉద్వేగానికి లోనయ్యాడుజగన్నాథం.

కోమలి చెప్పిన సమయానికి తను నిద్రపోకుండా మేల్కొని ఉంటే, ఆ కుర్రాడ్ని గుమ్మం వద్దనుంచి అలాగే పొమ్మంటుందేమోనని, ఉదయం కాఫీకోసం

దిగివచ్చినపుడు "రాత్రి ఒక్క పిసరుకూడా నిద్రపట్ట లేదనుకో" అంటూ గట్టిగా ఆవలించాడు.

పదింపావుకు భోజనానికి వచ్చి, చేసాక వెళ్తూ "అబ్బ! రాత్రి నిద్రలేదేమో, కళ్ళు కూరుకుపోతున్నాయ్" అని, జోగుతూ మేడెక్కాడు.

తన నటన ఫరవాలేదనుకుని తనను తాను మెచ్చుకుంటూ, తన గదిలోకి వచ్చి, తలుపులు బిగించి, వీధివైపు కిటికీవద్ద మాటువేసి కూచున్నాడు జగన్నాథం.

ఆ కుర్రాడు టంచనుగా పన్నెండు దాటాక, తలవంచుకుని నేరుగా యింట్లోకి గబగబా నడిచి వచ్చేసాడు.

వెంటనే లేచి దిగువకుపోయి చూద్దామన్న కోరిక కలిగింది జగన్నాధానికి. కాని అణుచుకున్నాడు.

'తనను చూసారంటే పిట్ట యెగిరిపోతుంది. కాస్త సమయం గడవనివ్వాలి'అని అనుకుంటూ అయిదు నిముషాలు ఆగి నిశ్శబ్దంగా తలుపులు తెరిచి దిగువకు వెళ్ళాడు.

గది తలుపులుమూసి వున్నాయి అనుకున్నట్టుగానే. దగ్గరలో వున్న కిటికీ వద్దకు కదిలాడు. అదికూడా మూసి వుంది.

లోకుల కంటిలో పడకుండా మంచి జాగ్రత్తే తీసుకున్నారు అనుకుంటూ వాకిలివద్దనే తచ్చాడాడు కాసేపు.

పావుగంట గడిచాక మేడమీదకు వచ్చాడు. ఇంకో పావుగంటపోయాక, ఆ కుర్రాడు చెదిరిన జుత్తుతోటి వాడిన మొహంతోటి బయటకు నడిచాడు తొందరగా అడుగులేసుకుని.

కాంతారావు కాపురంలో కలతలు లేపడానికి చిన్న అపవాదు లేవదీద్దామనుకున్నాడు, నిరాధారమైనది అయినా.

ఇపుడు తనకు అపవాదులతో పనిలేదు.

కోమలికి ఓ ప్రియుడున్నాడు. మొగుడి కళ్ళు గప్పి, ఆఫీసుకు వెళ్ళిన అదను చూసుకుని, యింకో మొగాడి కవుగిల్లో నలుగుతోంది.

అవాళ జరిగిందంతా కాంతారావుకు తను రాసిన ఆకాశరామన్న ఉత్తరంలో రాసాడు జగన్నాథం.

## 7

జగన్నాథం రాసిన ఉత్తరం రామబాణంలా పని చేసింది. కోమలి,కాంతారావుల మధ్య టెన్షన్ పెరిగింది.

ఏదో నెపంమీద, కూరలో ఉప్పు యెక్కువైందని ఓ రోజు, తక్కువైందని ఓ రోజు, కోమలిని తిట్టడం ఆమె ఊరుకోక పెడసరంగా జవాబులు చెప్తే, దేహశుద్ధి చెయ్యడం అరంభించాడు కాంతారావు.

రోజుకో వింత, పూటకో విశేషంగా ఉంది కాంతారావు యింటి వ్యవహారం.

ఇప్పుడు కథ యింకో మలుపు తిరిగింది.

కాంతారావు ఆఫీసుకు వెళ్ళాక, జగన్నాథాన్ని పలకరించాలన్న నెపంమీద, మెల్లగా మేడమీధకు వస్తుంది.

"ఏంటమ్మా? అలాగున్నావ్? అబ్బాయి యేమైనా అన్నాడా?" అంటూ జాలిగా పలకరించుతాడు జగన్నాథం.

అంతే!

కాలవగేట్లు యెత్తేసరికి, పొర్లుకుంటూపోయే నది నీరులా తన గుండెల్లో ఉన్న బాధంతా ఏడుపు కన్నీళ్ళరూపంలో వెళ్ళగక్కుస్తుంది అతనిముందు.

ఏవేవో అనునయ వాక్యాలు పలికి ఆమె దుఃఖాన్ని కాస్త ఉపశమింపజేసి పంపుతాడు జగన్నాథం.

తన మనస్సులో పేరుకొన్న బాధను జగన్నాథంతో చెప్పుకుని ఓదార్పు పొందాలని ఆశించేది, ఒక్క కోమలే

గాడు, కాంతారావుకూడా.

"అలా బజారుకు పోయివద్దాం. రాకూడదు బాబాయ్" అంటూ జగన్నాథాన్ని తనతో తీసుకెళ్ళి, కోమలి ఇప్పుడెంత నీచంగా ప్రవర్తిస్తున్నదో చెప్పసాగాడు కాంతారావు.

అలాంటి సమయాల్లోనే ఓసారి మెరపులాంటి ఆలోచన వచ్చింది జగన్నాథానికి.

భార్యాభర్తలిద్దరూ ఒకరికొకరు తెలియకుండా తమ బాధలు తనతో చెప్పుకుంటున్నారు. వాళ్ళమధ్య కక్షలు మరింత పెరగడానికి, ఆ అవకాశాల్ని ఎందుకు వినియోగించుకోగూడదు?

ఏవేవో సానుభూతి వాక్యాలు చెప్పి పంపే పద్ధతి మార్చేసాడు జగన్నాథం.

ఇప్పుడు కోమలి వచ్చి మాట్లాడితే "వాడి సంగతి నాకు వేరే చెప్పాలిటమ్మా?...భ్రష్టుడు...వాడినాన్నను నువ్వెరగవుగాని...వాడి బుద్ధులు పుణికి పుచ్చుకున్నాడు. యేమిటో తల్లీ! నీ బాధలు చూస్తుంటే నాగుండె బ్రద్దలయిపోతోంది. ఒక్క మాటమ్మా! నిన్ననే తెలిసింది... వాళ్ళ ఆఫీసువ్యక్తే ఒకాయన నాతో మాటల్లో అన్నాడు. మన వాడికి...ఆఫీసులో ఎవరో అమ్మాయితో చాలా చనువుగా ఉంటున్నాడుట. ఇహ నాటకాలాడ్డానికి వచ్చే ఆడవాళ్ళతో సంబంధం ఉందట.

తల్లీ! ముసలివాడ్ని. నీ మేలుకోరేవాడ్ని. వాచాలత్వం వల్ల ఉండబట్టలేక వాగేస్తున్నాను. మీ ఆయనతో పొరపాటునైనా నోరుజారేవుసుమా. నా కొంప మునుగుతుంది" అంటూ ఆమెతో కాంతారావుమీద కసి, కోపం పెరిగేలా ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పసాగాడు.

కాంతారావు వచ్చి మాట్లాడితే "నేనూ చూస్తున్నా

నురా అబ్బాయ్! ఇంతకుముందిలా వుండేదికాదు. తల బిరుసెక్కువైపోయిందిమధ్య. ఆడదన్నది అణిగి మణిగి ఉండాలి. ఆఖరుకు మగాడు చేసిందాంట్లో తప్పొన్నా సరే ఎదురు జవాబీయకూడదు. నువ్వు మంచివాడివి కాబట్టి దెబ్బలతో ఊరుకుంటున్నావు. ఇంకో మగాడయితేనా నరికి పోగులు పెట్టడూ'' అంటూ కోమలిమీద అతడికోపం సెగలు పొగలు కక్కేలా చేసాడు.

దాంతో కోమలి, కాంతారావుల మధ్య అగాధం మరింత పెద్దదయ్యింది. ఆ ఇల్లు ఓ చిన్న రణరంగంగా మారిపోయింది.

# 8

కాంతారావు చేతిలో చచ్చేటట్టుగా దెబ్బలుతింటున్నా కోమలి రహస్యంగా తన ప్రియుడ్ని ఎక్కడో కలుసుకుని రావడం, ఒక్కోరోజు ఇంటికే రప్పించి ఆనందించడం మానలేదు.

ఎప్పటికప్పుడు సమాచారాన్ని తన ఉత్తరాలద్వారా కాంతారావుకు తెలియజేస్తున్నాడు జగన్నాథం.

ఒకరోజున కోమలిని వెంబడించి, ఆమె, ఆమెప్రియుడు రహస్యంగా మాట్లాడుకున్నప్పుడు జగన్నాధానికి తెలియ వచ్చిందేమంటే, నాలుగు రోజుల తరువాత, కాంతారావు ఊరు కెళ్తాడు కేంపుమీద. కాంతారావు పై ఊళ్ళోవున్న వారంరోజులూ, కోమలి యింటివద్ద రాత్రి పదిగంటల తర్వాత కలుసుకోవడానికి నిశ్చయించుకున్నారు, కోమలి, కోమలి ప్రియుడు.

ఆ వార్త తెలియడంతోటే, జగన్నాథం మెదడు చురుకుగా పనిచేయడం మొదలుపెట్టింది.

ఇంతవరకూ తను జరిగిపోయిందే ఉత్తరాలద్వారా తెలియజేసాడు.

ఇప్పుడు కోమలి వేసుకొన్న పథకం గురించి కాంతా రావుకు తెలియజేస్తే, అతడేం చేస్తాడో చూడాలి.

కోమలి, కోమలి ప్రియుడు, ఒంటరిగా, నగ్నంగా ఒకరి కౌగిట్లో ఒకరు నలిగిపోతూ, కాంతారావు పడక గదిలో కాంతారావు కళ్ళకు అగపడితే గొప్ప డ్రామా జరుగుతుంది!

కోమలిని, కోమలి ప్రియుడ్ని చావబాదుతాడు కాంతా రావు.

ఆ దెబ్బతో కోమలికి విడాకులు ఖాయం!

జగన్నాథం ఓ కాయితంతీసి యెప్పటిలా ఎడంచేతితో రాయడం ఆరంభించాడు.

"బదుద్దాయి కాంతారావ్!

మీ ఆవిడ పెద్ద ప్లానులోవుంది. నువ్వు అటు కేంపుకు వెళ్ళగానే, ఇటు తనూ, తన ప్రియుడూ రాత్రి పది గంటలనుంచి తెల్లవారేవరకు తమ కోరికలకు హద్దులేమిటో తేల్చుకోవడానికి నిశ్చయించుకున్నారు. మీ ఆవిడ్ని పట్టి తగినట్టు బుద్ధి చెప్పడానికి అనువైన సమయం యిదే. ఉపయోగించుకో.

ఇట్లు
నీ శ్రేయోభిలాషి."

# 9

రాత్రి పదిదాటి యిరవై నిముషాలయ్యింది. గదిలో దీపం ఆర్పేసి, చీకట్లో కిటికీకి దగ్గరగా కుర్చీ వేసుక్కూచుని వీధివైపు చూస్తున్నాడు జగన్నాథం.

అవాళ ఉదయమే కాంతారావు వారంరోజుల కేంపు మీద ఊరికి వెళ్ళాడు.

కోమలి, కోమలి ప్రియుడు అనుకొన్న ప్రకారం అవాళ రాత్రి ఆ యింట్లో కలుసుకోవాల్సివుంది.

అరగంట గడిచింది. జగన్నాథానికి విసుగు కలగ నారంభించింది.

'వాళ్ళు తమ ప్లాను మార్చుకోలేదుగదా?' అని అనుకుని, జగన్నాథం నిద్రపోవడానికి లేద్దామనుకుంటుంటే, ఆ కుర్రాడు చప్పుడు చెయ్యకుండా వీధితలుపులు తెరుచుకుని యింట్లోకి ప్రవేశించాడు.

గదిలో కోమలి అతడికోసమే సిద్ధంగా కాచుకుని కూచున్నట్టుంది.

అతడు గదిలోకి వెళ్ళిన మరుక్షణం దభేలుమంటూ మూసుకున్న తలుపుల చప్పుడు విన్పడింది క్రిందనుంచి.

ఆ తరువాత కిటికీలు మూతబడినట్టు చప్పుడయ్యింది.

జగన్నాథం మనస్సు ఏవేవో వూహించుకోసాగింది.

ఆ కుర్రాడు గదిలో కెళ్ళగానే, కోమలిని యెలా కౌగిలించుకుంటాడో, ఆమె తిరుగ అతడ్నించి చిక్కని ఆనందం పొందడానికి అతడ్ని యెలా కవ్విస్తుందో ఓ బొమ్మ అతని కళ్ళముందు ఆడసాగింది.

అరగంట గడిచింది. గంట అయింది. అలా కిటికీ లోంచి చూస్తూ, ఆలోచనల్లో తేలిపోతూ కూచున్నాడు జగన్నాథం.

వీధి తలుపులు ఒక్కసారిగా తెరుచుకున్నాయి.

లోనికి అడుగుపెట్టిన వ్యక్తిని చూడగానే, జగన్నాథం గుండెలు ఆవేశంగా కొట్టుకోసాగాయి.

ఆ వ్యక్తి కాంతారావు!

అతని జుత్తు రేగివుంది. బట్టలు బాగా నలిగిపోయి అస్తవ్యస్తంగా ఉన్నాయి. చూపులు తీక్షణంగా వున్నాయి.

కాంతారావు లోనికివచ్చి "కోమలీ! కోమలీ!" అంటూ ముందు మెల్లగా తట్టాడు.

కోమలి బదులు, యివ్వలేనట్టుంది. ఇంకోసారి మళ్ళా పిలిచాడు. కాని, ఈసారి కాస్త గొంతు పెంచాడు.

అయినా, ఆమె జవాబివ్వలేదు.

కాంతారావుకు కోపం వచ్చినట్టుంది. తలుపులు గట్టిగా బాదాడు.

గదిలో ఉన్న ప్రియుడ్ని ఎక్కడ దాయాలో, ఎలా బయటకు దాటెయ్యాలో, యేం చెయ్యాలో అర్థంగాక కోమలి సతమతమైపోతూ ఉండవచ్చు.

అందుకే, కాంతారావు పిలవగానే తలుపు తియ్యలేదని ఊహించాడు జగన్నాథం.

ఆఖరుకు కోమలి తలుపు తెరిచినట్టుంది. భళ్ళున తలుపుల శబ్దం అయింది.

"ఏమిటి సంగతి? మరీ అంత ఒళ్ళు తెలియకుండా నిద్ర పోతున్నావా?" కాంతారావు కంఠం కరుగ్గా మోగింది.

"అబ్బే...మస్తుగా నిద్రపోయాను...పిలుపు వినబడ లేదు" కోమలి తడబడి పోతోంది. ఆమె కంఠంలో వణుకు, తొట్రుపాటు స్పష్టంగా తెలిసిపోతోంది.

కాంతారావు లోనికి వెళ్ళి, తలుపు ధన్ మనిపిస్తూ మూసేసి గడియలు బిగించాడు.

తలుపులు తెరిచివుంటే, కోమలి ప్రియుడు బయటకు దూకేస్తాడేమో? కాంతారావు ఆలోచన అయ్యుండ వచ్చుననుకున్నాడు జగన్నాథం.

'ఇప్పుడు పెద్ద డ్రామా జరగబోతోంది. యెలా తెలుసుకోవడం?'

అటు యిటూ ఆరాటంగా తిరిగాడు జగన్నాథం.

దిగువకు పోయి తలుపుల వద్దనుంచి విందామను కున్నాడు. కాని మనసు మార్చుకున్నాడు.

ఎవరైనా చటుక్కున తలుపులు తెరిస్తే, తను వింటున్నట్టు తెలిసి పోతుంది.

ఆఖరుకు ఓ ఆలోచన వచ్చింది.

గది మధ్యకు వెళ్ళాడు. నేలమీద పరచిన తివాసీ ప్రక్కకు లాగేసాడు.

చెవి నేలకు బాగా ఆనించి వినసాగాడు.

జగన్నాథం ఉంటున్న గదికి సరిగ్గా క్రిందనే, కాంతారావు పడక గది వుందేమో, అక్కడ జరుగుతున్న దంతా శబ్దాల రూపంలో తెలియవస్తోంది జగన్నాధానికి.

"ఒరేయ్! ఎవడ్రా నువ్వు? ఇక్కడ నీకేం పనిరా?" కాంతారావు కంఠం కర్కశంగా మ్రోగింది.

కోమలి ప్రియుడు కాంతారావుకు దొరికి పోయాడు మొత్తం మీద, అనుకున్నాడు జగన్నాథం.

"ముందు మర్యాదగా చొక్కా వదులు" అన్నాడు ఆ కుర్రాడు.

ఆ తరువాత కాంతారావు ఆ వ్యక్తిని కొట్టినట్టు న్నాడు. ఫట్ ఫట్‌మని దెబ్బలు తగిలినట్టు శబ్దం వినబడింది.

సన్నని మూలుగుతో ఆరంభమయిన కోమలి రోదన తీవ్రమైంది. వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆమె కంఠం ఒక ప్రక్క విన్పడుతోంది.

కొంపదీసి, యీ కొట్లాట హత్యకు దారి తియ్యదు గదా?

ఆ ఆలోచన రాగానే, జగన్నాథం గుండె నిలిచి పోయినట్టయింది.

ఇలాంటి సందర్భాల్లో, ఒళ్ళు మరిచిపోయి, మొగాళ్లు ఒకళ్ళ నొకళ్ళు కొట్టి చంపుకొన్న కేసులు అనేకం

ఉన్నాయి.

అదే సమయంలో క్రిందనుంచి పెద్ద కేకలు విన్పడ్డాయి. అవి, కాంతారావువి.

"అమ్మో! బాబోయ్! తల పగిలిపోయింది. రక్తం... రాక్షసీ! నీ రంకు మొగుడిచేత చంపిస్తున్నావే... నేను చచ్చిపోతాను... కానీ... మిమ్మల్ని వదలను. దయ్యమై మీ యిద్దర్నీ వెంటాడి వెంటాడి... చంపుతాను. నా కసి తీర్చుకుంటాను. చచ్చి సాధిస్తాను. అమ్మా... అయ్యో... అమ్మా!" అంటూ చివర్న పెద్ద కేక పెట్టాడు కాంతారావు భయంకరంగా.

అది ఖచ్చితంగా చావుకేక అన్నది అర్థం చేసుకొన్నాడు జగన్నాథం. చేతులూ కాళ్లూ ఆడడం మానేసాయి. గుండెల్లో వణుకు ఆరంభమయింది.

"రాజూ!... రాజూ... యెంతపని చేశావు రాజూ!" ఆవేశంగా అరిచింది కోమలి.

"నన్ను క్షమించు కోమలీ! ఆవేశంలో ఒళ్ళు తెలియ లేదు. టేబిలు మీద రూళ్ళ కర్ర చూడగానే నేనేం చేస్తున్నానో తెలియకుండా పోయింది" రాజు కంగారుగా మాట్లాడాడు. కోమలి గోడిస్తూనే ఉంది.

కాస్సేపయ్యాక రాజు స్థాయిన పడ్డట్టున్నాడు.

"కోమలీ! గడిచిన దానికి విచారిస్తూ లాభం లేదు. ముందీ శవాన్ని యెలాగో లాగు వదిలించుకునే యేర్పాటు చెయ్యాలి" అన్నాడు రాజు.

"నాకేం చెప్పాలో, యేం చెయ్యాలో తోచడం లేదు. నువ్వే ఏదో చెయ్యి ఆలోచించి," అంది కోమలి యింకా యేడుస్తూనే.

"ఇప్పుడు యేం చెయ్యడానికీ లాభం లేదు. రేపు రాత్రి వరకూ ఎలాగో యీ శవాన్ని దాచిపెట్టామంటే,

రేపు దీన్ని వదిలించుకునే ఏర్పాట్లు చేస్తాను."

"అయితే దీన్ని ఎలా దాచిపెట్టడం?"

"పెద్ద పెట్టె ఏదన్నా ఉందా?"

"ఉంది. ఇదిగో."

కోమలి పెట్టె చూపినట్టుంది. అది చూసి "బావుంది. నువ్వు కాళ్ళు పట్టుకో...యెత్తి పెట్టెలో పడేద్దాం" అన్నాడు రాజు.

ఆ తరువాత కాంతారావు శవాన్ని యెత్తి పెట్టెలో పడేసి, తాళాలు వేసినట్టుగా చప్పుడయింది.

అయిదు నిముషాలు పోయాక-"బక్కెట్టుతో నీళ్ళు, గుడ్డ పట్టా...యీ రక్తం కడిగి పారెయ్యాలి," అన్నాడు రాజు.

స్నానాల గదిలోంచి కోమలి నీళ్ళు తెచ్చినట్టుగా శబ్దం అయింది.

ఆ తరువాత, నేలంతా తుడిచినట్టుగా చప్పుడయ్యింది.

"ఆఁ... ఫరవాలేదు. ఇప్పుడు పొడి గుడ్డతో వత్తెయ్" చెప్పాడు రాజు.

అతడు చెప్పినట్టుగా కోమలి చేసాక, "ఇహ... నేను వస్తాను జాగ్రత్త" అన్నాడు రాజు.

"అదేమిటి రాజూ? నువ్వెళ్ళిపోతే యెలా? నన్ని స్థితిలో వదిలేసి వెళ్ళి పోతావా?" యేడుపు గొంతుకతో అంది కోమలి.

"అలాగంటే యెలా? రేపు నన్ను యెవరైనా ఇక్కడ చూస్తే యేమనుకుంటారు?" అన్నాడు రాజు.

"యేమనుకున్నా సరే నువ్విక్కడే ఉండు. ఏదో ఒకటి చెప్పకోవచ్చు. అంతగా యెవరైనా అడిగితే,ఏదో బంధుత్వం చెపుతాను."

రాజు చివరకు ఉండడానికే నిశ్చయించుకున్నట్టు

న్నాడు. "సరే" అన్నాడు.

ఆ తరువాత సన్నగా కోమలి యేడుపు, ఆరాటంగా అటూ యిటూ పచార్లు చేస్తున్న రాజు పాదాల చప్పుడు విన్పడసాగాయి.

# 10

తూర్పున వెలుగు రేకలు విచ్చుకున్నాయి.

జగన్నాధం రాత్రి క్షణంసేపు కూడా నిద్ర పోలేదు. కాంతారావు హత్య గురించిన ఆలోచనలతోనే గడిపాడు.

దిగువకు పోయి సంగతేమిటో కనుక్కొని రావాలను కున్నాడు గాని, ఆ కోరికను బలవంతంగా అణుచు కున్నాడు.

కాంతారావు హత్యా రహస్యం తనకు తెలిసిందన్న కక్షతో, తనను కూడా వాళ్ళు చంప ప్రయత్నిస్తే?

అసలు రాత్రి యేం జరిగిందో తనకేమీ తెలియనట్లు, తెల్లవారాక వెళ్ళి, కాంతారావు శవం యెక్కడుందో కనిపెట్టి, పోలీసు రిపోర్టు యివ్వడమే సరైన మార్గం అను కున్నాడు జగన్నాధం.

ఎప్పటి వేళకు అంటే ఉదయం ఏడున్నర దాటాక, కాఫీ కోసం దిగువకు వెళ్ళాడు.

రాజు ముందర యెదురయ్యాడు. అతడ్ని చూసి జగ న్నాధం సీరియస్‌గా మొహం పెట్టాడు.

"సిస్టర్! వీరేనేమిటి మీ పేయింగ్ గెస్ట్?" అని అన్నాడు రాజు నవ్వుతూ.

వార్ని జగన్నాధం మనసులో యీసడించుకొన్నా, మొహంలో మాత్రం ఆ భావం కనబడనీయలేదు.

పైగా, తనూ మొహం మీద నవ్వు మొలిపించుకుంటూ "ఆ... నేనే బాబూ! అమ్మాయ్! యీ కుర్రాడు?" అన్నాడు జగన్నాధం, కోమలి నుద్దేశించి.

"మీకు తెలియదులే మామయ్యా! మా పెద్దనాన్న కొడుకు. పెంపకం యిచ్చారులే..యిదే మనవూరు రావడం మొదటి సారిగా" అంది కోమలి.

'ఇంత చాతుర్యం ఎప్పుడు నేర్చుకొన్నావో గాని నువ్వు చాలా ఘటికురాలవమ్మా!' అనుకున్నాడు జగన్నాథం మనస్సులో.

జగన్నాథానికొకటి, రాజుకొకటి కాఫీ గ్లాసు అందించింది కోమలి.

కాఫీ తాగుతూ, అటూ యిటూ పచార్లు చేస్తూ, కాంతారావు పడకగదిలోకి చూసాడు జగన్నాథం.

అప్పుడే కడిగి, శుభ్రం చేసినట్టుగా ఉంది నేల.

"అబ్బాయి రావడానికి వారం రోజులు పడుతుంది గదూ?" అడిగాడు జగన్నాథం, కాళీగ్లాసు కోమలికి అందిస్తూ, అదే సమయంలో, ఆమె మొహంలోని భావాల్ని చదవ ప్రయత్నిస్తూ.

కాసేపు ఆమె మొహంలో నీడలు ముసిరి, మళ్లా ప్రసన్నమైంది.

"అవును మామయ్యా! అలాగన్నారు మరి, ఎప్పుడొస్తారో యేమో?" అంది కోమలి.

కాంతారావు శవం యెక్కడ దాచారో తెలుసుకొని పోలీసు రిపోర్టు యివ్వాలి అనుకున్నాడు జగన్నాథం.

"ఏమీ తోచక ఛస్తున్నానమ్మా. ఏవైనా పుస్తకాలు తీసుకొంటాను" పైకి అంటూ కాంతారావు పడకగదిలోకి అడుగుపెట్టాడు జగన్నాథం.

కాంతారావు టేబిలుమీద రూళ్ళకర్రవుంది. రాత్రి దాంతోనే దిక్కుమాలిన చావు చచ్చాడు కాంతారావు అనుకొన్నాడు జగన్నాథం.

రూళ్ళకర్ర శుభ్రంగా తోమి కడిగినట్టు తళతళ మెరు

స్తోంది.

గదిలో ఓ మూలనున్న పుస్తకాల బీరువావద్ద నించుంటూనే, గది నలుమూలలా చూపు సారించాడు జగన్నాథం.

ఇంకో మూలనుండి కర్రపెట్టె. తాళంవేసివుంది.

ఆ పెట్టెలోనే కాంతారావు శవంవుంది. జగన్నాథం గుండెలు ఆవేశంగా కొట్టుకోసాగాయి.

అదేసమయంలో గోడని వేళ్ళాడుతున్న తాళంచెవి కన్పించింది.

పెట్టెతెరిచి ఒక్క క్షణం కాంతారావు శవాన్ని చూడాలన్న కోరిక అణుచుకోలేకపోయాడు.

అటు ఇటు చూసి, ముందుకు కదిలాడు. తాళంచెవి అందుకొన్నాడు. పెట్టెవద్దకు వెళ్ళాడు.

వంగి, తాళం తీయబోతుంటే, మెడమీద చల్లగా ఇనపముక్క తగిలినట్టు అనిపించి, తలత్రిప్పి చూసాడు.

జగన్నాథం గుండాగిపోయింది.

"ఏరా ముసలినక్కా! ఇందుకా ఇక్కడికొచ్చావ్! సరే! కాంతారావు హత్య చేయబడ్డట్టు నీకు తెలిసిందన్నమాట" జగన్నాథం మెడమీద పిస్టల్ మొన ఆనించి అన్నాడు రాజు.

"అబ్బే! అబ్బే! యేంలేదు" కంగారుగా అన్నాడు జగన్నాథం. ఒళ్ళంతా ఒహాటే చెమట్లు పోయసాగాయి అతనికి.

అతడి చేతిలోంచి తాళాలు లాక్కొని, జేబులో వేసుకొన్నాడు రాజు.

"కాంతారావు నన్ను రెచ్చగొట్టాడు. అందుకేచంపేసాను. మా రహస్యం నీకు తెలిసింది. నువ్వూరుకోకపోతే నీకూ అదేగతి పడ్తుంది. ఏమంటావ్?" రాజు గొంతు కర్కశంగా విన్పించింది జగన్నాథానికి.

తడారిపోయిన గొంతుకతో "అలాగే! నేను చచ్చినా సరే ఈ రహస్యం ఎవరికీ చెప్పను. ఒట్టు, ఏ ఒట్టు వెయ్యమంటే ఆ ఒట్టే వేస్తాను. నేను చచ్చినంత ఒట్టు" అన్నాడు జగన్నాథం.

"సరే! అయితే నీ గదికి పో. రెండురోజుల వరకూ బయటికి రాకు. ఎవరితోనూ మాట్లాడకు. తెలిసిందా?" అన్నాడు రాజు, పిస్టల్ తిరిగి తన జేబులో ఉంచుకొంటూ.

"తెలిసింది తెలిసింది" అంటూ మరబొమ్మలా తలాడించి 'బ్రతుకుజీవుడా!' అనుకొంటూ మేడమీదకు ఒక్క పరుగులో వచ్చి పడ్డాడు జగన్నాథం.

జగన్నాథం గుండెల్లో దడ, వణుకు తగ్గలేదు ఎంత సేపయినా.

వెంట్రుకవాసిలో తను మృత్యుముఖంలోంచి తప్పించుకొన్నాడు.

తను చెయ్యగూడని సాహసమే చేసాడు.

హంతకుడు తనమీద ఓ కన్నేసి వుంచాడనీ, సమయం కనిపెట్టి మీద బడ్తాడనీ ఊహించలేకపోయాడు.

కాంతారావు హత్య చెయ్యబడ్డాడన్న విషయం తనకు తెలుసన్న సంగతి వాళ్ళకు తెలుసు.

వాళ్ళేం చేస్తారో తనను!

అనవసరంగా తన ప్రాణాల్ని యిరకాటంలో పెట్టుకొన్నాడు.

'ఇదిగో శవం! ఇడుగో హంతకుడు!' అంటూ పోలీసులకు చెప్పి హంతకుల్ని పట్టిద్దామనుకున్నాడు. కాని బెడిసికొట్టింది.

ఏమీ ఎరగనట్టు, అలా షికారుకుపోయినట్టు పోయి పోలీసు రిపోర్టు యిచ్చివుంటే, పోలీసులే అన్ని సంగతులూ

చూసుకొని వుండేవారు.

కాంతారావు శవం చూడాలనుకొని తను చాలా పెద్ద తప్పు చేసాడు.

మధ్యాహ్నం భోజనానికి వేళ అయినా ఆకలికాలేదు. దిగువకుపోలేదు.

ఒంటిగంట ప్రాంతంలో రాజు పైకివచ్చి "దిగువకు వచ్చి మాట్లాడకుండా భోంచేసి మేడెక్కు" అన్నాడు కోపంగా కళ్ళు పెట్టి.

'ఆకలిగాలేదు. భోంచెయ్యను' అని అంటే, యేం ప్రమాదమో అని నిశ్శబ్దంగా దిగువకుపోయి, అరగంటలో భోంచేసి మేడెక్కాడు జగన్నాథం.

జగన్నాథం గదిలోకి వెళ్ళగానే, తలుపులుమూసి, బయటినించి గడియబెట్టి వెళ్ళిపోయాడు రాజు.

నోటమాట ఉడిగి స్థాణువులా వుండిపోయాడు జగన్నాథం.

# 11

కిటికీలోంచి వీధిలోకి చూస్తూ కూచున్నాడు జగన్నాథం.

మధ్యాహ్నం మూడవుతుండగా, రాజు ఎక్కడికో వెళ్ళాడు బయటికి.

రాత్రి ఎనిమిది కావస్తుండగా తిరిగొచ్చాడు. వస్తూనే మేడమీదకు వచ్చి గదితలుపులు తెరిచి "అరగంటలో భోంచేసిరా, మధ్యాహ్నంలాగే" అన్నాడు రాజు.

రాజు ఆజ్ఞాపించినట్టుగా, తొందరగా భోజనంముగించి మేడమీదకు చేరుకొన్నాడు జగన్నాథం.

మళ్ళా గడియపెట్టి వెళ్ళిపోయాడు రాజు.

రాత్రి ఒంటిగంట దాటింది.

ఎంత ప్రయత్నించినా నిద్రరాలేదు జగన్నాథానికి.

కిటికీలోంచి అలాగే వీధిలోకి చూస్తూ కూచున్నాడు.

రెండు కావస్తుంటే, ఓ కారు ఇంటిముందాగింది. దాని కున్న మైలో మీటరు చూసి అది టాక్సీ అని గ్రహించాడు జగన్నాథం.

టాక్సీలోంచి ఓ వ్యక్తి బయటకువచ్చి, వీధిలో అటూ ఇటూ కాసేపుచూసి, ఇంట్లోకి ప్రవేశించాడు.

పావుగంట గడిచాక, ఆ వ్యక్తి, రాజు కలసి, ఉదయం జగన్నాథం చూసిన పెట్టెను బయటకు మోసుకొచ్చారు.

అతికష్టంమీద దాన్ని కారు డిక్కీలోకి చేర్చారు.

రాజు, టాక్సీమనిషి లోనికిపోయి కూర్చోగానే టాక్సీ బయలుదేరింది.

కాంతారావు శవాన్ని ఆనమాలుకూడా మిగలకుండా ఎక్కడో పాతిపెట్టయ్యడానికో, ఏ నదిలోనో, చెరువులోనో విసిరెయ్యడానికో తీసుకెళ్తున్నారు. నేరస్తులు చేయిజారిపోతున్నారు.

ఏం చెయ్యడం తనిప్పుడు? తను యీ గదిలో బంధింపబడ్డాడు.

జగన్నాథం పిచ్చివాడిలా గదంతా తిరిగాడు. జుత్తు పీక్కున్నాడు.

తనిప్పుడు గదిలోంచి బయటపడి, వాళ్లెక్కడ శవాన్ని పారేస్తున్నారో తెలుసుకోవాలి.

తలుపు రెక్కలు రెండూ పట్టుకుని ఒక్కసారి గుంజాడు. ఆశ్చర్యం! తలుపులు వచ్చేశాయి.

రాజు బయట గడియలు సరిగ్గా పెట్టలేదు అనుకున్నాడు.

గబగబా వెలుపలకి వచ్చి రోడ్డుమీద పడ్డాడు. అదే సమయంలో అటువైపుగా ఓ కాళీ ఆటోరిక్షా వచ్చింది.

దాన్ని ఆపి, అందులోకి దూకి "నేను చెప్పిన చోటుకు

పోనీ. మీటరు రీడింగు మీద అదనంగా పది రూపాయలు యిస్తాను" అన్నాడు డ్రైవరుతో.

"అలాగే సర్" అంటూ జోరుగా లాగించాడు డ్రైవరు ఆటోని.

ఆ పెట్టెను యేం చేస్తారు? ఎక్కడకు తీసుకుపోతారు? ఆలోచించసాగాడు జగన్నాథం.

శ్మశానంలోకి తీసుకెళ్ళలేరు. అక్కడ శవాన్ని పాతి పెట్టనివ్వరు. శ్మశానం కాపలాదారు ఉంటాడు.

అలాగే నూతిలోనో, గోతిలోనో శవాన్ని తోసెయ్యలేరు. ఎంచేతంటే, ఆ పెట్టె ఎవరికో ఒకరికి అవుపిస్తుంది. పెట్టె వల్ల హంతకుల ఆచూకీ తెలిసిపోతుంది.

కాబట్టి ఎక్కడో రహస్యంగా ఓ బయలు ప్రదేశంలో ఆ పెట్టెను పాతిపెట్టేస్తారు.

మధ్య మధ్య టాక్సీ గురించి భోగట్టా చేస్తూ, ఆటో రిక్షా మీద ఊరు చివరవరకు వచ్చాడు జగన్నాథం.

మరి కాస్త దూరం పోయాక, రోడ్డు వారగా, చెట్ల నీడల్లో ఆపిన టాక్సీ అవుపించింది.

ఆటోని బాగా ముందుకు పోనిచ్చి, అక్కడ దాన్ని ఆపించమని చెప్పి, డ్రైవర్ని తోడు తీసుకుని, టాక్సీ వద్దకు వచ్చాడు జగన్నాథం.

టాక్సీని జాగ్రత్తగా పరిశీలిస్తూ సమీపంలో ఉన్న తుప్పల్లో దాక్కున్నారు, జగన్నాథం, ఆటో డ్రైవరు.

"థేంక్యూ! ఇవిగో అయిదొందలు. శవాన్ని మనం యిక్కడ పాతిపెట్టినట్టుగా పిట్టమనిషికి కూడా తెలియ కూడదు" అది రాజు గొంతు.

"అలాగే!" అన్నాడు రెండో మనిషి.

ఆ యిద్దరూ టాక్సీ యెక్కి తిరిగి ఊర్లోకి బయలు దేరారు.

'అంతే, యిక్కడే యెక్కడో ఆ శవాన్ని పాతి పెట్టారన్న మాట' అనుకున్నాడు జగన్నాథం.

తుప్పల్లోంచి వెలుపలికి వచ్చి, ఆటో డ్రైవరు సాయంతో ఆ చుట్టుప్రక్కలంతా గాలించాడు, శవాన్ని పాతిపెట్టిన చిహ్నాల కోసం.

అయిదు నిముషాల్లో వాళ్ళ శ్రమ ఫలించింది.

ఒక చోట, ఏదో కప్పి పెట్టినట్టుగా, కొత్త మట్టి అవుపించింది.

'ఇక్కడన్న మాట శవాన్ని పాతిపెట్టారు' అని అనుకుంటూ, మర్నాడు ఉదయం ఆ స్థలాన్ని పోల్చుకోడానికి వీలుగా నాలుగు రాళ్ళు వరుసగా నేలలో గుచ్చి రోడ్డు మీదకు వచ్చాడు.

ఆటోరిక్షా యెక్కి తిన్నగా పోలీసుస్టేషనుకు పోనిమ్మన్నాడు జగన్నాథం.

## 12

జగన్నాథం చెప్పిందంతా విని, "ముందు శవాన్ని ఎక్కడ పాతిపెట్టారో చూపండి," అంటూ ఇన్‌స్పెక్టర్ సీతాపతి నలుగురు పోలీసులను తీసుకొని బయలుదేరాడు.

జగన్నాథం దోవ చూపిస్తుంటే, పోలీసువేను నిర్ణీత స్థలానికి వచ్చి చేరుకొంది.

దగ్గరలో ఉన్న పసులకాపర్ల సాయంతో ఇన్‌స్పెక్టరు సీతాపతి జగన్నాథం చూపించిన స్థలం తవ్వించాడు.

ఎంత లోతుకు పోయినా, జగన్నాథం చెప్పిన పెట్టె గాని, శవం గాని కన్పించలేదు.

జగన్నాథం బిక్కమొహం వేసాడు. ఇన్‌స్పెక్టరు సీతాపతి ఆశ్చర్యానికి అంతులేదు. అతనికి కొంచెం కోపం కూడా వచ్చింది.

"కొంపదీసి, రాత్రి మీరు కల గాయలేదు గదా?"

వేళాకోళంగా అన్నాడు సీతాపతి.

"యేటండీ పోలీసు డిపార్టుమెంటంటే అంత యేలా కోలంగా ఉందేటి?" అన్నాడు ఒక పోలీసు.

"లేదండీ నా కళ్ళారా చూసాను. అలాంటి పొరపాటు జరగకుండా ఉండాలనే, గుర్తుగా రాళ్ళు కూడా పెట్టాను" సంజాయిషీగా చెప్పుకున్నాడు జగన్నాథం.

"నేనో విషయం అడుగుతాను చెప్పండి" అన్నాడు సీతాపతి ఓ క్షణం ఆలోచించాక.

"చెప్పండి" అన్నాడు జగన్నాథం.

"వాళ్ళు శవాన్ని ఇక్కడ పాతి పెడ్తుండగా మీరు కళ్ళారా చూసారా?"

"అవును. లేదు."

"మరి శవాన్ని యిక్కడే పూడ్చిపెట్టినట్టుగా యెలా అనుమానించారు?"

"అప్పుడే పెళ్ళగించి కప్పిన కొత్తమట్టినిబట్టి."

"చీకట్లో ఏంజూశారోయేమో చుట్టుపట్ల వెతకండి. శవాన్ని ఇంకెక్కడో పాతి, ఇక్కడ పాతినట్టుగా ఛోకాయిచ్చారేమో?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సీతాపతి.

జగన్నాథం చుట్టుపట్ల అంతా వెతికాడు, అతి జాగ్రత్తగా.

శవాన్ని పాతిపెట్టినట్టు అనుమానించదగ్గ ప్రదేశమేదీ కన్పడలేదు యెక్కడా.

జగన్నాథం ఆశ్చర్యానికి అంతులేదు.

"ఇప్పటికీ పరిస్థితి చెయిదాటిపోలేదు. హంతకులు యింటిదగ్గర ఉన్నారు. నాలుగు గట్టిగా అంటిస్తే, వాళ్ళే చెప్తారు శవాన్ని యెక్కడ పాతిపెట్టారో" అన్నాడు జగన్నాథం, రెండు నిముషాల తర్వాత ఆశ్చర్యంలోంచి తేరుకుని.

"సరే! పదండి" అంటూ వేను ఎక్కాడు సీతాపతి. అందర్నీ ఎక్కించుకుని, వేను ఊర్లోకి బయలుదేరింది.

జగన్నాథం చూపిన యింటి ముందు పోలీసు వేను ఆగింది.

జగన్నాథం లోనికి దారితీయగా, వెంట ఇన్‌స్పెక్టరు సీతాపతి, పోలీసులు వెళ్ళారు.

"యేమిటి మామయ్యా? యేంజరిగిందేమిటి? పోలీసులున్నారేమిటి నీ ప్రక్క?" అడిగింది కోమలి మొహం మీద ఆశ్చర్య ముద్రతో.

"ఇదిగో యీవిడా, యీవిడ ప్రియుడూ కలసి కాంతారావును హత్యచేశారు" అని ఆమెవైపు తిరిగి "యేడీ ఆ రాజుగాడు?" అని అడిగాడు జగన్నాథం.

"యేమిటి మామయ్యా? రాత్రి కలగాని కనలేదు గదా... రాజేమిటి? నేనేమిటి? మా ఆయన్ని హత్య చెయ్యడమేమిటి?" అంది కోమలి, యింకా ఆశ్చర్యం మొహంలో కన్పరుస్తూనే.

కోమలితో యింకేమీ మాట్లాడ్డం యిష్టంలేక సీతాపతి వైపు తిరిగి "మెత్తగా అడిగితే చెప్పరులెండి. నాలుగు తగల్నియ్యవలసిందే," అన్నాడు జగన్నాథం.

సీతాపతి ముందుకు వచ్చాడు.

"చూడమ్మా! మీరూ, మీ ప్రియుడు రాజు కలిసి మొన్నరాత్రి మీఆయన కాంతారావుగార్ని హత్యచేసారని ఈయన కంప్లెయింట్ ఇచ్చాడు మాకు. నిజానికి పాతిపెట్టిన జాగా చూపారు గాని, చీకట్లో చూడ్డం వల్లనో యేమో, సరైన జాగా చూపలేక పోయారు. అయినా, హత్య జరిగితే హంతకులు యెక్కడకు పారిపోగలరు? శవాన్ని యెక్కడ మాయం చెయ్యగలరు? మీరు నిజం చెప్పేసి, మాపని సులువుచెయ్యడం మంచిది"

అన్నాడు ఇన్‌స్పెక్టర్ సీతాపతి.

"ఏమిటి సార్! ఏమిటి జరిగింది?" అంటూ రాజు లోపల్నుంచి గదిలోకి వచ్చాడు.

అతడ్ని చూస్తూనే "వీడే సార్! హంతకుడు. కాంతా రావును యూళ్ళకర్రతో తలబ్రద్దలు కొట్టి చంపింది వీడే సార్!" అన్నాడు జగన్నాథం ఆవేశంగా.

"మిస్టర్ రాజూ! యు ఆర్ అండర్ అరెస్ట్" అని రాజుతో చెప్పి, పోలీసులవైపు తిరిగి "అరెస్ట్ హిమ్" అని ఆజ్ఞ జారీచేశాడు సీతాపతి.

చేతులకు అరదండాలు తగిలించడానికి పోలీసులు ముందుకు కదులుంటే "ఏమిటి సార్! గొడవ?" అంటూ కాంతారావు అక్కడకు ప్రవేశించాడు.

అతడ్ని చూస్తూనే జగన్నాథం మొహం పాలి పోయింది.

"ఒరే! నేను చూస్తున్నది కలా? నిజమా? కాంతా రావ్! నువ్వు బ్రతికే వున్నావురా" అంటూ అతడ్ని సమీపించాడు జగన్నాథం.

"వాట్ మీరా కాంతారావు! మీరు చచ్చిపోయా రనేగా ఈ ముసలాయన రిపోర్టిచ్చింది?" అంటూ అమితాశ్చర్యం ప్రకటించాడు ఇన్‌స్పెక్టర్ సీతాపతి.

"యస్ సర్! నేను హత్య చెయ్యబడ్డాననే యీ ముస లాయన రిపోర్టు యిచ్చింది" చెప్పాడు కాంతారావు.

"ఎలా జరిగిందంతా? మీరందరూ కలిసి మా డిపార్టు మెంటుని ఆటలు పట్టించాలనుకోలేదు కదా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సీతాపతి, కోపంతో అందరివైపు చూసి.

"దయచేసి కాసేపు అలా కుర్చీలో కూచున్నారంటే మీకంతా చెప్తాను" అన్నాడు కాంతారావు, ఓ కుర్చీని సీతాపతికి చూపుతూ.

సీతాపతి కుర్చీలో కూర్చున్నాడు. కాంతారావు రెండు నిముషాలసేపు ఇంట్లోకి వెళ్ళి, చేతిలో ఉత్తరాలతో తిరిగి వచ్చాడు.

"ఇవి చూడండి. వీటిని ఈ ముసలినక్క నాకు రాసాడు," అంటూ సీతాపతికి ఉత్తరాలు అందించాడు కాంతారావు. వాటిని చూడగానే జగన్నాథం గతుక్కుమన్నాడు.

సీతాపతి ఉత్తరాలని చదివి తిరిగి ఇచ్చేస్తూ "కానీ వీటిని ఈయనే రాసాడని తార్కాణం యేమిటి?" అన్నాడు.

"అవన్నీ ఓ పాత ఎక్సర్‌సైజు పుస్తకంలోంచి చించి తీసిన కాయితాలు...ఒప్పుకుంటారా?"

"అవును" అంటూ తలాడించాడు సీతాపతి.

"అయితే మేడమీద జగన్నాథం గదిలో పాత ట్రంకులో ఓ పాత ఎక్సర్‌సైజు పుస్తకం వుంది. దాంట్లోవి ఈ కాయితాలు. కావలిస్తే చెక్ చెయ్యండి."

జగన్నాథం గదికి ఓ పోలీసుని పంపి, కాంతారావు చెప్పిన పుస్తకాన్ని తెప్పించి, అందులోని కాయితాలతో పోల్చి చూసాడు ఉత్తరాల్ని. సరిపోయాయి.

"కాని, మిస్టర్ కాంతారావ్! నాకో సందేహం. ఈ సంగతి యెలా కనుక్కున్నారు?"

"నా భార్యశీలాన్ని అనుమానాస్పదం గావిస్తూ, అతడు రాసిన ఉత్తరం అందగానే, నాకెందుకో అతడి మీదే అనుమానం కల్గింది. అతడు అలా షికారు కోసం బయటకు వెళ్ళగానే, మా యింట్లో ఉన్న అతడి తాళాల సాయంతో, అతడి గది తెరచి చూసాను. నా అనుమానం దృఢ పడింది. అయితే అంతటితో అతడ్ని వదిలివెయ్యడం నా కిష్టంలేదు. అతడు చేసిన పని యెంత ప్రమాదభరితమో

తెలియ జెయ్యాలనిపించింది.

"అలాంటి సమయంలోనే, ఊరినుంచి మా బావ వచ్చాడు. అతడు యెప్పుడూ మా యింటికి రాలేదు_ ముఖ్యంగా, జగన్నాథం మా పేయింగ్ గెస్ట్ అయ్యాక. అతన్ని రిసీవ్ చేసుకోవడానికి రైల్వేస్టేషనుకు వెళ్ళినపుడు నాకు క్రొత్త ఆలోచనలు పుట్టుకొచ్చాయి.

"అతడ్ని అలాగే హోటలుకు తీసుకు వెళ్ళాను. అతడు మా యింటికి వచ్చి ఆడాల్సిన నాటకం అంతా వివరంగా చెప్పాను. కోమలికి కూడా జరగ వలసినదంతా చెప్పాను.

"కోమలీ, నేనూ కాట్లాడుకుంటున్నట్టు రోజూ నాటకాలు ఆడాం. కోమలికి కూడా నాటకాల్లో అనుభవం ఉందేమో, తన నటనతో ఎంతో రక్తి కట్టించింది నాటకాన్ని.

"ఒకరి సంగతి ఒకరికి తెలియనట్టు, ఆయన దగ్గరకు పోయి మా గోడు వెళ్ళబోసుకుని, ఆయన సలహా అడిగే వాళ్ళం. మాలో మాకు కక్షలు యింకా పెరిగిపోయేటట్లు మా యిద్దరికీ సలహా లివ్వసాగాడు.

"ఆయన సలహా పాటించి మేమిద్దరం ఎలా బద్ధ వైరులుగా మారిందీ నటించాం.

"ఒక స్త్రీ శీలం మీద అనుమానం కలిగిస్తూ భర్తకి ఉత్తరాలు రాస్తే, పరిణామాలెలా వుంటాయో అతనికి తెలీదో, లేక తెలిసే చేసాడో నాకు తెలీదు.

"అందుకే నేను కేంపుకి వెళ్తున్నట్టు, రాజును యింటికి రమ్మన్నట్టు కోమలి చేత చెప్పించాను.

"ఆ రాత్రి మా యిద్దరికీ దెబ్బలాట జరిగినట్టు ఆ కొట్లాటలో నేను హత్య చెయ్యబడ్డటూ నాటకం ఆడాం.

"వెంటనే పోలీసుల్ని పిలుస్తాడను కున్నాంగాని, అలా జరగలేదు.

"అందుకే నాటకాన్ని యింకా పొడిగించాం. పెట్టెను ఊరవతలకు తీసుకుపోయి పాతిపెట్టడం వగైరా తమాషా చేసాం.

"జగన్నాథం మా నాటకంలో పడిపోయాడు. మిమ్మల్ని తీసుకొచ్చాడు," అంటూ ముగించాడు కాంతారావు.

"మిస్టర్ జగన్నాథం, మీరింత న్యూసెన్సుగా తయారయ్యారన్న మాట. ముందు స్టేషనుకు పదండి. కొన్నాళ్లు కటకటాలు లెక్కపెడితే బుద్ధి వంకర కాస్త తగ్గుతుంది" అంటూ జగన్నాథాన్ని వేను యెక్కించుకుని తీసుకుపోయాడు ఇన్స్పెక్టర్ సీతాపతి.

—:ఐపోయింది:—

# బలికోరిన డబ్బు!

## ముళ్ళపూడి నాగేశ్వరరావు

హోటల్ హిల్ మెన్ సాయంత్రం అయ్యేసరికి నీలం రంగును సంతరించుకుని నూతన శోభతో కళకళ లాడుతుంది.

ఆ హోటల్లో చాలవరకు ఇతర దేశాల్నించి వచ్చిన టూరిస్టులు, విశ్రాంతికై వచ్చిన ధనవంతులు నివశిస్తుంటారు. నగరంలో పనికోసం వచ్చిన వారెవరూ అక్కడ దిగరు. కారణం 'హిల్ మెన్' నగరంనుంచి విసిరివేయబడినట్టు నగరం చివర ఎత్తైన ప్రదేశంలో ఉంటుంది.

"అతను ఇంకా రాలేదేమిటి?" అసహనంగా కదిలింది రేఖ. ఆమె ముఖంలో విసుగు ఆత్రుత స్పష్టంగా కనిపిస్తోంది.

రేఖ చాలా అందమయిన యువతి. ఆమె వయస్సు దగ్గరలో ముప్ఫై వున్నా ఇరవైఏళ్ళ యువతిలా కనిపిస్తుంది. వేసుకొన్న బట్టల్లో దాగని ఆమె ఒంపు సొంపులు మగ వాళ్ళ మతులు పోగొడతాయి. ఆమె వేసుకొన్న పల్చటి నైలాను ఫ్రాకు ఆమె అందాన్ని రెట్టింపు చేస్తోంది.

శ్రీరామ్ చిన్నగా నవ్వేడు. కాలిపోయిన సిగరెట్టు బయటపడేసి కొత్త సిగరెట్ వెలిగించాడు.

గడియారం 6 గంటలు కొట్టింది.

"అతనికి మన రూం నెంబర్ చెప్పావా?"

చెప్పానన్నట్టు తల ఊపేడు శ్రీరామ్. శ్రీరామ్ వయసు ముప్ఫైరెండు సంవత్సరాలు. పచ్చని ఛాయ. మంచి పొడుగ్గా ఉంటాడు. ఆకర్షణీయమైన అతని కళ్ళు ఎప్పుడూ నవ్వుతూ ఉంటాయి.

తలుపుమీద ఎవరో మెల్లగా కొట్టిన చప్పుడైంది. రేఖ ముఖం వికసించింది. శ్రీరామ్ వెళ్ళి తలుపు తీశాడు.

"మీట్ మిస్టర్ వేణు," అంటూ రేఖకి పరిచయం చేసాడు.

"ఐయాం మిస్ రేఖ" తనని తనే పరిచయం చేసుకుంది రేఖ.

"గ్లాడ్ టు మీట్ యూ" అంటూ రేఖతో కరచాలనం చేసాడు వేణూ.

"ప్లీజ్ టేక్ యువర్ సీట్."

ముగ్గురూ కూర్చున్నారు.

శ్రీరామ్ సిగరెట్స్ తీసి మిగిలిన ఇద్దరికీ ఆఫర్ చేసాడు.

"శ్రీరామ్ డ్రింక్స్ ఆర్డర్ చెయ్యి."

డ్రింక్స్ వచ్చాయి. "తీసుకోండి" అంటూ ఓ గ్లాసు వేణూ ముందుకి తోసింది రేఖ.

"నా కలవాటులేదు," మృదువుగా తిరస్కరించేడు వేణు.

"మిమ్మల్ని ఏమైనా చేస్తామని భయమా?"

"నో అలాంటిదేమీ లేదు" అన్నాడు వేణు. అతని దృష్టి ముందు జరగబోయే సంభాషణమీదుంది.

"మీరేం చదివారు?"

"బ్రతకలేని అభాగ్యుడు."

"అదేమిటి?" ఆశ్చర్యంగా అడిగింది రేఖ.

"బి. య్యే" అన్నాడు వేణూ.

"ఇంతకుముందు ఎక్కడ పనిచేశారు?"

"చెప్పలేను. దాని అవసరం ఉండదన్నారు శ్రీరామ్."

"ఐయాం సారీ."

"నెవర్ మైండ్."

వాతావరణం నిశ్శబ్దం అయ్యింది. కొన్ని నిమషాలు ఎవరూ మాట్లాడలేదు.

"మీరు చెయ్యవలసినపని పెద్దదేగాని, చాల సులభమయినది" అసలు విషయాన్ని కదిపింది రేఖ.

"చెప్పండి."

"ఆ పని చేసినందుకు మీకు పదివేలిస్తాం. డబ్బు విషయంలో మనకు ఒప్పదం కుదిరితే తరవాత మిగిలిన విషయాలు మాట్లాడుకోవచ్చు," అంది రేఖ.

వేణు ముఖం వెలిగింది.

"ఒకే. నాకు ఇష్టమే చెప్పండి!"

రేఖ చేతులో ఉన్న సిగరెట్ విసిరేసి కొత్తది వెలిగించింది.

"మీకు లక్షాధికారి రామచంద్రం తెలుసా?"

వేణు తెలుసన్నట్టు తల ఊపేడు.

"మేము అతని ఇల్లు దోచుకుందామనుకుంటున్నాము.

మంచి ప్లానుకూడా వేసాము. ఆ ప్లాను ఫలించాలంటే మీరు ఏ పనిమనిషిగానో ఆ ఇంట్లో ప్రవేశించి, మాకు అక్కడ పని సానుకూలం చెయ్యాలి,'' ఆగింది రేఖ.

''నేనేం చెయ్యాలి?''

''మేము పద్దెనిమిదవ తారీకు రాత్రి 12 గంటలకి దొంగతనం చెయ్యాలనుకుంటున్నాము. కాబట్టి మీరు అక్కడున్న అడ్డంకుల్ని తొలగించాలి.''

''ఆ అడ్డంకులు ఏమిటి?''

''రామచంద్రం ఇంటిని ఒక నైట్ వాచ్ మెన్, ఒక అల్సేషియన్ కుక్క కాపలా కాస్తాయి. మీరా పద్దెనిమిదవ తారీకు రాత్రి ఆ ఇద్దర్నీ అక్కడనుంచి తొలిగించాలి. ఆ పని చేయగలరా?''

''చేస్తాను'' అన్నాడు వేణు.

''ఒకవేళ మీరు ఆ అడ్డంకుల్ని తొలిగించలేకపోతే మాకు ముందుగా ఫోన్ చేసి చెప్పండి.''

''అలాగే'' అన్నట్టు తల ఊపేడు వేణు.

''రేఖ ఒక విషయం చెప్పడం మర్చిపోయింది. అదేమిటంటే ఆ రోజు రాత్రి మీరు రామచంద్రం భోజనంలోను, అతని కూతురు భోజనంలోను మత్తుమందు కలపాలి. ఇదిగో ఆ మత్తుమందు''అంటూ ఒక పొట్లం అందించేడు శ్రీరామ్. వేణు తీసి జేబులో వేసుకున్నాడు.

''ఇదిగో మీ ఎడ్వాన్సు రెండువేలు'' నోట్లకట్టలు వేణువైపు తోసింది రేఖ.

''మీరు ఏ పరిస్థితుల్లోనైనా పోలీసులకి పట్టుబడ్డా మా విషయం చెప్పకూడదు,'' అని హెచ్చరించింది రేఖ.

''నాకు తెలుసు'' అంటూ చిన్నగా నవ్వాడు.

''నేనింక వెళతాను'' అంటూ లేచాడు వేణు.

''ఓకే, విష్ యు బెస్ట్ ఆఫ్ లక్,'' అంది రేఖ.

"సేమ్ టూ యూ."

## 2

నగరం కోలాహలంగా వుంది. వీధిలో ట్యూబ్ లైట్లు చీకటిని పారద్రోలుతున్నాయి. వేణు చురుకుగా నడుస్తున్నాడు. వీధిలైటు దగ్గిర ఆగి జేబులోంచి చిన్న అద్దం ముక్క తీసి ముఖం చూసుకున్నాడు. అతని పెదాలమీద సన్నటి నవ్వు విరిసింది.

అతని వేషమంతా మారిపోయింది. తైల సంస్కారం లేని జుట్టూ, దుబ్బుగా పెరిగిన మీసం, మోకాళ్ళవరకు కట్టిన పంచె, దానిమీద మాసిన తెల్లలాల్చీ, అచ్చం పల్లెటూరి గబ్బిలాయిలా ఉన్నాడు.

రామచంద్రం నౌఖరు వెంకయ్య గురించి వేణు చాల భోగట్టా సేకరించాడు.

రామచంద్రం ఇంటిముందున్న కిళ్ళీకొట్టు దగ్గిర ఆగి బీడీలు కొన్నాడు. కిళ్ళీకొట్టు దగ్గరున్న బెంచి మీద కూర్చుని రామచంద్రం ఇంటివైపే తదేకంగా చూడసాగాడు.

దాదాపు ఒక అరగంట గడిచిన తరవాత అతని నిరీక్షణ ఫలించింది. రామచంద్రం ఇంటి ముందుభాగంలో లైటు వెలిగింది. కారు స్టార్టు చేస్తున్న చప్పుడయ్యింది. వేణు మెల్లగా ఇంటివేపు వెళ్ళాడు.

"వెంకయ్యా, నే వెళుతున్నాను తలుపేసుకో!"

కారు వెళ్ళిపోయింది. రెండు నిమషాలయిన తరువాత వెంకయ్య ఇంట్లోంచి వచ్చాడు. వేణు వెంకయ్యకేసి చూడసాగాడు. వెంకయ్యకూడా వేణుకేసి చూసాడు.

"వెంకయ్యా," చిన్న కేక వేసాడు వేణు.

"ఎవరు!" అన్నాడు వెంకయ్య.

"నువ్వు కట్టెల సిమ్మాద్రి కొడుకు వెంకయ్యవేనా?"

"అవును. ఇంతకీ నువ్వెవరు?"

"నేను చంద్రాన్ని. ఈరయ్యతాత కొడుకుని," అన్నాడు వేణు.

"ఏటి చంద్రానివా? చాలా మారిపోయావ్," ఆశ్చర్యంగా అన్నాడు వెంకయ్య.

"మరీ చిన్నప్పుడు మనిద్దరం ఆడుకునేవాళ్ళంకదా."

వెంకయ్య సంతోషానికి పగ్గాలులేకపోయాయి. ఇన్నాళ్ళకి మళ్ళీ తన ఊరివాడిని చూడగలిగానని వాడు చాల ఆనందపడిపోయాడు.

"రారా, లోపలికి రా," అంటూ వేణుని లోపలికి తీసుకుపోయాడు.

ఆ రాత్రి వేణు వెంకయ్యతో భోజనం చెయ్యాల్సి వచ్చింది. భోజనం చేస్తున్నంతసేపూ వెంకయ్య ఒకటే కబుర్లు. చిన్నప్పటి విషయా లనేకం మాట్లాడేడు.

భోజనం అయిన తరవాత ఇద్దరూ వెంకన్న గదిలోకి వెళ్ళి పడుకున్నారు.

"నువ్వు చిన్నప్పుడే ఇంట్లోంచి పారిపోయావ్ గదా! ఇప్పుడేం చేస్తున్నావ్," అడిగాడు వెంకయ్య. వేణు దానికి సమాధానం సిద్ధంగానే వుంచుకున్నాడు.

"అదంతా ఒక పెద్ద కథలే."

"ఏంటో చెప్పు," ఉత్సాహంగా అడిగాడు వెంకయ్య.

"నే నింట్లోంచి పారిపోయానా! ఎక్కడికి వెళ్ళాలో తెలీలేదు. ఏదో కనిపించిన రైలు ఎక్కేశాను. ఒక నాలుగయిదు గంటలయిన తరువాత టికెట్ కలెక్టరు వచ్చి టిక్కెట్టడిగాడు. లేదన్నాను. అది ఫస్టుక్లాసుట. నలభై రూపాయలు కట్టమన్నాడు. లేవన్నాను. నన్ను బయటికి గెంటబోయాడు. అంతట్లోనే ఒక దొరబాబు ఆ డబ్బు తను కట్టి నన్ను తనతో రమ్మన్నాడు. దొర

అంటే సీమదొర. కాదుగాని శాన డబ్బున్నవాడు. ఈ బంగళాలాటివి నాలుగిళ్ళున్నాయి.

అక్కడ నా పనేమిటని అడగవేం? దొరకి వేటలో సహాయం చెయ్యడం. దొర వారానికొకసారి వేటకెళ్ళేవాడు. నా పనేమిటంటే ఒక తుపాకిని, ఒక వేటకుక్కని పట్టుకోవడం. ఆ తుపాకి నీ అంత బరువుండేది.

ఒకసారి ఏమైందంటే, వేటలో దొర ఒక పులిని గుండుతో కొట్టాడు. అది పులికి సరిగ్గా తగలక దొర మీద కురకబోయింది. దొర మళ్ళీ కాల్చేడు. అదీ తగల్లేదు. నేను ధైర్యంచేసి నన్ను పట్టుకోమని ఇచ్చిన తుపాకి దానిమీదకి ఇసిరాను. అది నాకేసి చూసింది. ఈలోగా దొర దాన్ని కొట్టేశాడు. అప్పుడు దొర నన్ను ఎంత మెచ్చుకున్నాడనుకున్నావు? అప్పట్నించీ దొర నన్ను ప్రాణంగా చూసుకునేవాడు.

అయితే, నా కర్మకొద్దీ అర్నెల్లక్రితం దొరని పోలీసులు పట్టుకుపోయారు. నాకు భయంవేసి పారిపోయొచ్చేసేను. అప్పట్నుంచి నౌఖరీకోసం వెతుకుతున్నాను."

వెంకయ్య వేణు కథంతా నమ్మేడు.

"నాకు మా వూరు ఎళ్ళాలని ఉందిరా," అన్నాడు వెంకయ్య.

"వెళ్ళు."

"ఎలాగ దొర ఒప్పుకోడు."

"నేనుంటాను నీ బదులు."

"నిజంగా?"

"నిజంగా."

* * *

రామచంద్రం పొగ గుప్పున వదిలాడు.

"ఏమిటి వెంకయ్యా నాతో చెప్పాలంటున్నావ్?"

"చిత్తం. తమరి దయ అయితే నేను మా ఊరోసారి వెళదామని."

"ఎలాగ వెంకయ్యా నువ్వు లేకపోతే ఇంట్లో ఏ పనీ జరగదే" ప్రశ్నార్థకంగా ముఖం పెట్టాడు రామచంద్రం.

"చిత్తం. అందుకే మా వోణ్ణోకణ్ణి కుదిర్చానండి. ఒరేయ్ చంద్రం ఇలారా," అంటూ వేణుని కేకేశాడు.

వేణు వచ్చి "గుడ్ మోర్నింగ్ సర్," అన్నాడు.

వెంకయ్య, వేణు గురించి అంతా చెప్పాడు.

"సరే అతనికి మన ఇంటి పన్లన్నీ చెప్పు" అని ఆజ్ఞాపించి వెళ్ళిపోయాడు.

పన్లు జాగర్తగా చెయ్యమని మరీమరీ చెప్పి వెళ్ళిపోయాడు వెంకయ్య.

# 3

ఆ రోజే పద్దెనిమిదవ తారీకు.

రాత్రి పదయ్యింది!

నైట్ వాచ్ మెన్ శ్రీరాములు ఆవలించి కూర్చున్న చోటినుంచి లేచాడు. నిక్కరు జేబులో చెయ్యెట్టి చూసుకున్నాడు. బీడీలయిపోయాయి. జేబులో డబ్బులు కూడా లేవు.

"ఛస్, ఎదవ బతుకు" అనుకున్నాడు శ్రీరాములు.

"ఏటిరా బాబూ అనుకుంటున్నావు," అంటూ అక్కడికి వచ్చాడు వేణు.

"ఏటి నువ్వు నిద్దరోలేదా?"

"అప్పుడే నిద్దరేటి?" అంటూ ఒక సిగరెట్ వెలిగించి శ్రీరాములుకోటిచ్చాడు. వాడు ఆత్రంగా తీసుకున్నాడు.

ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

"నీకు మందుకొట్టే అలవాటుందా?" అడిగాడు వేణు.

"అదిలేంది ఎవరికిలే," శ్రీరాములు పెదవి విరిచాడు.

"చూడు శ్రీరాములు, అలా ఈరయ్యగాడి కొట్టుకెళ దామా!"

శ్రీరాములు ముఖం వెలిగింది. కారణం అక్కడ ఒకటోరకమైన మందు అమ్మబడుతుంది.

"నా దగ్గర డబ్బులేవు" మొహమాటపడ్డాడు.

"పర్లేదులే! మనలో మనకేమిటి?" అంటూ లేచాడు వేణు.

ఇద్దరూ గేటుదాటి బయటకొచ్చారు.

"ఉండు. ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికెళ్ళాడు వేణు. కుక్కమందు మత్తుమందు కలిపిన బిస్కెట్లుపడేసి, పది నిముషాల్లో సారాకొట్టు చేరుకున్నాడు శ్రీరాములుతో.

## 4

శ్రీరామ్ ముఖం వెలిగింది. ఎదురుగుండా నోట్లకట్టలు ఒకదాని మీదొకటి పేర్చి ఉన్నాయి.

శ్రీరామ్ బ్రీఫ్‌కేస్ తెరిచి నోట్లకట్టలు పేరుస్తున్నాడు.

ఉలిక్కిపడ్డాడు శ్రీరామ్.

దబ్, దబ్ దగ్గరలోనే ఏదో పెద్ద శబ్దం వినిపించింది.

శ్రీరామ్ చటుక్కున ఐరన్ సేఫ్ మూసేసేడు.

దగ్గరలోనే ఎవరిదో అడుగులచప్పుడు. శ్రీరామ్ ఒక్కసారి కంపించేడు. మరుక్షణం తేరుకున్నాడు. జేబులోంచి కత్తితీసి పట్టుకున్నాడు.

అడుగుల చప్పుడు ఆగింది. తలుపు ఎవరో మెల్లగా తోసారు. ఎలక్ట్రిక్ లైటు వెలిగింది. గదిలో ఉన్న చీకటి పారిపోయింది.

ఎదురుగా ఉన్న ఆగంతకుణ్ణి చూసి అరవబోయాడు రామచంద్రం. శ్రీరామ్ ధైర్యాన్ని చిక్కబట్టుకున్నాడు. రామచంద్రానికి ఆ అవకాశం ఇవ్వలేదు. పులిలా ముందుకి దూకి కుడిచేత్తో నోరుమూసేడు. ఎడంచేతిలోని కత్తి

రామచంద్రం వీపులో దిగింది బలంగా. మెరుపు మెరిసి మాయమైంది.

రామచంద్రం నిర్జీవంగా నేలమీద పడిపోయాడు.

రక్తం. గ్లవుసెస్ నిండా రక్తం! శ్రీరామ్ వణికి పోయాడు.

## 5

ఆర్కెస్ట్రా మందంగా వినిపిస్తోంది. స్టేజిమీద రీటా అర్ధనగ్నంగా నాట్యం చేస్తోంది. అనేక జంటలు నృత్యం చేస్తున్నాయి.

రేఖ గ్లాసులోని విస్కీ అయిపోయింది. సీసాలోంచి గ్లాసులోకి వంచుకుంది. సోడా కలపలేదు. గటగటా త్రాగేసింది. శ్రీరామ్ గ్లాసులోని విస్కీని కొద్దికొద్దిగా రుచి చూస్తున్నాడు. కాని అతని దృష్టి అక్కడలేదు.

స్టేజిమీద నాట్యం తారాస్థాయి నందుకుంది. రీటా వంటిమీద దుస్తుల్ని ఒకదానితరవాత ఒకటి వొలిచేస్తోంది. ప్రేక్షకులు ఈలలువేస్తూ అరుస్తున్నారు.

"రామ్, డాన్స్ చేద్దాంరా" ఆహ్వానించింది రేఖ.

శ్రీరామ్ మాట్లాడలేదు.

లైట్లు డిమ్మయ్యాయి.

"ప్లీజ్!" రేఖ అభ్యర్థించింది.

"రేఖా! దయచేసి నన్ను బలవంతం పెట్టకు" విసుక్కున్నాడు శ్రీరామ్. రేఖ ఆశ్చర్యపోయింది.

"రామ్! ఏమిటంత డల్ గా ఉన్నావు?"

శ్రీరామ్ మాట్లాడలేదు.

"ప్లీజ్, నాతో చెప్పవూ!"

"రేఖా! నాకేదో భయంగా ఉంది."

"ఎందుకా భయం? పోలీసులు మనని చచ్చినా పట్టుకో

లేరు," శ్రీరామ్‌కి ధైర్యం చేకూర్చడానికి ప్రయత్నించింది రేఖ.

"పోలీసుల గురించి నా కెప్పుడూ భయంలేదు" అంటూ ఆగిపోయాడు శ్రీరామ్. ఇద్దరి మధ్య నిశ్శబ్దం రాజ్యం చేసింది.

"రేఖా! అనవసరంగా హత్య చేశానేమో?"

"డోంట్ బీ సిల్లీ రామ్! నువ్వనవసరంగా భయపడుతున్నావు."

"అనవసరం కాదు రేఖా! నా కిప్పుడు అనుమానంగా ఉంది. రామచంద్రాన్ని హత్య చేస్తున్నప్పుడు ఏవో లైట్లు వెలిగి ఆరేయేమోనని."

"అదంతా నీ భ్రమ. ఒకవేళ ఫోటోలు తీస్తే నువ్వప్పుడే గమనించేవాడివి."

శ్రీరామ్ మాట్లాడలేదు. అతనికి ధైర్యం చిక్కటంలేదు.

"రేఖా మన హోటల్‌కి పోదాం."

రేఖ మాట్లాడలేదు.

"ప్లీజ్. రేఖా."

"ఓ కే!"

ఇద్దరూ బయటికి వచ్చేరు. ఎవరూ వీరిని గమనించలేదు. గమనించినా పట్టించుకోలేదు.

పోర్టికో వివిధ రకాలయిన కార్లతో నిండి వుంది. నగరంలోని పెద్ద మనుషులు రాత్రి అయ్యేటప్పటికి అక్కడికి చేరుకుంటారు. శ్రీరామ్ నల్ల ఎంబాసిడర్ కారు తాళాలు తీసాడు.

శ్రీరామ్ కారు స్టార్ట్ చేస్తుంటే ఒక కుర్రాడొచ్చి ఒక కవర్ అందించాడు.

"ఎవరిచ్చారు?" కఠినంగా ప్రశ్నించాడు శ్రీరామ్.

"ఆ బాబెవరో ఈ కవర్ మీ కిమ్మని ఇచ్చారు"

భయంభయంగా చెప్పాడా కుర్రాడు.

"మమ్మల్నెలా గుర్తుపట్టావు" అడిగింది రేఖ.

"మీ కారు చూపెట్టి ఆ కారులో ఎక్కిన వారికిమ్మన్నాడా బాబు."

శ్రీరామ్ మాట్లాడకుండా కారుని ముందుకుపోనిచ్చాడు. కారు హోటల్ హిల్ మెన్ ముందు ఆగింది.

రూమ్ కెళ్ళిన తరువాత కవర్ తెరిచాడు శ్రీరామ్. తెల్లటి కాగితంమీద ఎర్రటి అక్షరాలు.

"మిస్టర్ శ్రీరామ్,

పిల్లి కళ్ళు మూసుకుని పాలుతాగుతూ ఎవరూ చూడ లేదనుకుంటుంది. నువ్వుకూడా అలాగే అనుకుని ఎవరూ చూడకుండా రామచంద్రాన్ని హత్య చేశావు. కొన్ని లక్షలతో పరారయ్యావు. నేరం దాగదు మిస్టర్ రామ్.

రామ్! నువ్వు హత్యచేసినట్టు నిరూపించటానికి నీకు పంపిన ఫోటోలు చాలు. బ్రతికి బయటపడాలంటే, ఒక లక్షరూపాయలు తీసుకుని వెంటనే స్మశానం దగ్గరలో ఉన్న దిబ్బ దగ్గరకి రా!"

క్రింద సంతకంలేదు. శ్రీరామ్ ముఖం పాలిపోయింది. ఉత్తరంతోపాటు రెండు ఫోటోలున్నాయి.

వాటిల్లో శ్రీరామ్ రామచంద్రాన్ని పొడుస్తున్నట్టు స్పష్టంగా ఉంది.

"బ్లాక్ మెయిలింగ్!" తనలో తాననుకున్నాడు శ్రీరామ్.

"ఓ మైగాడ్! ఇప్పుడేం చేసేది?" అంటూ తల పట్టుకుంది రేఖ.

శ్రీరామ్ మెదడు చురుకుగా పనిచేస్తోంది.

ఎవరీ బ్లాక్ మెయిలర్? ఎందుకు తనని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు.

"ఇదంతా ఆ వేణుగాడి పనే. రాస్కెల్! ఎంత ద్రోహం చేసాడు."

పళ్ళు పటపట కొరికాడు శ్రీరామ్.

"రామ్!వాడు కోరిన ఆ లక్షా ఇచ్చెయ్యి. పీడ వదులుతుంది," అంది రేఖ.

"రేఖా! ఒకసారితో వదరదు. వాడు నా జీవితాంతం నన్ను వేటాడతాడు. దీనికి ఏదో ఒక పరిష్కారం చూడాలి."

శ్రీరామ్ ఒక పావుగంటసేపు దీర్ఘంగా ఆలోచించాడు.

"రేఖా! ఆ బ్రీఫ్ కేసులో ఒక లక్షరూపాయలు సర్దు" అంటూ డ్రస్సువడం ప్రారంభించాడు.

# 6

శ్రీరామ్ పూర్తిగా నల్ల దుస్తుల్లో ఉన్నాడు. అతను చాల త్వరగా నడుస్తున్నాడు. ఒక చేతిలో బాటరీలైట్, ఇంకో చేతిలో బ్రీఫ్ కేస్.

ఊరు చివరికి వచ్చేశాడు. ఇంకో ఫర్లాంగు ఉంటుంది దిబ్బ. శ్రీరామ్ ఒక కొట్టుదగ్గర ఆగేడు. గోల్డ్ ఫ్లేక్ సిగరెట్లు రెండు కొని వాణ్ణి మాటల్లో దింపాడు.

"ఇంతకుముందు ఎవరేనా ఇలా వెళ్ళేరా?" అని కొట్టువాణ్ణి అడిగేడు శ్రీరామ్.

"వెళ్ళేరు బాబూ."

శ్రీరామ్ ముందుకి కదిలేడు.

చీకటి భయంకరంగా అల్లుకుని ఉంది. శ్రీరామ్ బాటరీలైటు దాన్ని సన్నగా చీలుస్తోంది. కీచురాళ్ళ రొద చిరాకు కలిగిస్తోంది. ఉండుండి నక్కల అరుపులు వాతావరణాన్ని మరింత భయంకరంగా చేస్తున్నాయి.

శ్రీరామ్ ఆగాడు. బ్రీఫ్ కేస్, బాటరీలైటు నేలమీద పెట్టి సిగరెట్ వెలిగించాడు.

ఎముకలు కొరికేలా చలి వేస్తోంది. శ్రీరామ్ ముందు జరగబోయే దానిగురించి ఆలోచిస్తున్నాడు.

ఎక్కడో అలికిడి అయినట్టయింది. శ్రీరామ్ బాటరీ లైటు అన్ని వేపులకి తిప్పాడు. ఏదో ఆకారం పొదల చాటుకి తప్పుకుంది.

గుండె దిటువు చేసుకుని ముందుకి కదిలేడు.

దిబ్బ ఎగుడు దిగుడులుగా ఉంది. శ్రీరామ్ జాగ్రత్తగా నేల చూసుకుంటూ నడుస్తున్నాడు. నేలమీద సగం కాలిన సిగరెట్ పీక పడిఉంది.

శ్రీరామ్ కళ్ళు చికిలించాడు. అతని ముఖం మీద బాటరీలైటు ఫోకస్ చెయ్యబడింది.

"వెల్ మిస్టర్ శ్రీరామ్!"

శ్రీరామ్ తలెత్తి చూసాడు. ముఖం మీద లైటు పడు తోంది. ఎదురుగా ఏముందో కనిపించడం లేదు.

"శ్రీరామ్ ఆ పెట్టె నేలమీద పెట్టి తెరు. పిచ్చిపిచ్చి వేషాలు వేశావంటే కాల్చేస్తాను," కరుగ్గా పలికింది వేణూ కంఠం.

"వేణూ, నన్నింత మోసం చేస్తావనుకోలేదు," పళ్ళు పట పట కొరికేడు శ్రీరామ్.

ఫక్కుమని నవ్వేడు వేణూ.

"నేరస్థులలో నిజాయితీ ఎలా ఉంటుంది శ్రీరామ్! ద్రోహం తప్ప," అన్నాడు వేణు.

"ఎంత డబ్బు దొరికింది ఐరన్ సేఫ్‌లో?" అడిగేడు మళ్ళీ వేణు.

"లక్ష."

"అబద్ధం" కరుగ్గా అన్నాడు వేణు.

"నన్ను నమ్మకపోతే నేనేం చెయ్యను."

"నీతో నాకు వాదనెందుకు రేపు పేపర్లో పడుతుందిలే"

అన్నాడు వేణు.

"రామ్! బ్రీఫ్ కేస్ తెరిచి బాటరీ లైటు అందులోకి ఫోకస్ చెయ్యి" ఆజ్ఞాపించాడు వేణు.

శ్రీరామ్ అలాగే చేసాడు.

వేణు దృష్టి రూపాయిల మీదుంది. అదే అదనని గ్రహించాడు శ్రీరామ్. చేతిలో ఉన్న బాటరీ లైటుని వేణు చేతిలోని పిస్టల్ మీదికి విసిరాడు.

పిస్టల్ ఎగిరి దూరంగా పడింది.

వేణు ఉలిక్కి పడ్డాడు. కాని అప్పటికే శ్రీరామ్ అతని మీదకి లంఘించాడు.

కాని వేణు వెంటనే ఎదురుదెబ్బ తీసాడు. బూటు కాలితో శ్రీరామ్ డొక్కలో తన్నాడు. శ్రీరామ్, వేణు మీద పడ్డాడు. ఇద్దరూ నేలమీద పడి దొర్లుతున్నారు. నేలంతా రాళ్ళమయమేమో ఇద్దరి వొళ్ళూ కూడా కొట్టుకు పోయింది. చివరికి శ్రీరామ్, వేణుని అదుపులో పెట్టాడు. వేణు గుండెల మీదకెక్కి కూర్చున్నాడు.

వేణు రొప్పుతున్నాడు. శ్రీరామ్ పిడికిలి బిగించి వేణు ముఖం మీద రెండు సార్లు గుద్దేడు.

వేణుకి స్పృహ తప్పింది.

శ్రీరామ్ టార్చ్‌లైట్ వెలగడం లేదు. కాని వేణు చేతిలోంచి క్రింద పడిన టార్చ్‌లైట్ మాత్రం వెలుగు తోంది. శ్రీరామ్ ఆ టార్చిలైట్‌ని తీసాడు.

టార్చ్‌లైట్ వెలుగులో చుట్టూరా పరిశీలించాడు. అతని కళ్ళు మెరిసాయి. వేణు పిస్టల్ నేలమీద పడి ఉంది. ఆ పిస్టల్‌ని తీసి ముందెట్టుకున్నాడు.

మరుక్షణం ఒక తుపాకి గుండు వేణు గుండెల్లో చోటు చేసుకుంది. చీకటిని చీల్చుకుంటూ రెండు మెరుపులు మెరి సాయి.

శ్రీరామ్ ఈసారి జాగ్రత్త పడ్డాడు. కాంతి వచ్చిన వైపుకు పిస్టల్ని గురిపెట్టి రెండు సార్లు కాల్చాడు.

'అమ్మా!' అన్న కేక వినిపించింది. శ్రీరామ్ వెంటనే ఆ కేక వినిపించిన పొదకేసి పరిగెట్టాడు. అక్కడ ఒక మనిషి నేలమీద పడి కొట్టుకొంటున్నాడు. శ్రీరామ్ ఆలస్యం చెయ్యకుండా అతని జేబులు వెతికాడు. పర్స్, జేబురుమాలు మాత్రం ఉన్నాయి.

పర్స్ తెరిచాడు. ఐదు చిల్లరనోట్లు, కొంత చిల్లర మాత్రం ఉన్నాయి. ఒక ఫోటో ఉంది. బ్యాటరీ లైటు వెలుగులో దాన్ని హతుడి ముఖంతో పోల్చి చూసాడు. రెండూ ఒకలాగే ఉన్నాయి. ఫోటో వెనుక ఎడ్రస్ ఉంది.

హతుడి పేరు సుధాకర్.

శ్రీరామ్ ఆ పర్సుని జేబులో వేసుకున్నాడు. కొంచెం దూరంలో కెమేరా పడి ఉంది. దానికి ముందున్న గాజు లెన్స్ బద్దలయిపోయి ఉంది. దాన్ని తీసి మెడలో తగుల్చుకున్నాడు.

శ్రీరామ్ మళ్ళీ వేణు శవం దగ్గరకి వచ్చి జేబులు వెతికాడు. రెండు ఫోటోలు మాత్రం ఉన్నాయి. అవి శ్రీరామ్ రామచంద్రాన్ని హత్య చేస్తున్నవి!

అవి తీసి జేబులో వేసుకున్నాడు.

శ్రీరామ్ ఆలోచిస్తూ నిలబడ్డాడు తన ఆధారాలు ఏమైనా అక్కడ ఉన్నాయేమోనని. ఏం ఫరవాలేదు అని గుండె దిటవు పరచుకున్నాడు. తనని ఎందుకు అనుమానిస్తారసలు?

వేగంగా ముందుకి కదిలాడు.

'వెధవలు ఇద్దరు చచ్చేరు. ఈ ఇద్దరూ కాదు మరో

పదిమంది వచ్చినా చచ్చి ఉందురు. రాస్కెల్స్! ఈ శ్రీరామ్‌నే మోసం చేద్దామనుకున్నారా?' జేబులోంచి పిస్టల్ తీసి ముద్దెట్టుకున్నాడు.

కెమెరాలోంచి రీలు తీసి జేబులో వేసుకున్నాడు. కెమెరా విసరగలిగినంత దూరం విసిరేశాడు.

# 7

శ్రీరామ్ చురుగ్గా నడుస్తున్నాడు. అతనిప్పుడు ప్రపంచ విజేతలా ఫీల్ అయ్యాడు.

ఏదీ తిరుగులేదు తనకి.

ఎవరూ అడ్డు రాలేరు.

అడ్డువస్తే ఛస్తారు.

ఇవి శ్రీరామ్ అభిప్రాయాలు.

ఊళ్లోకి ప్రవేశించాడు.

కిళ్ళీకొట్టువాడు చూస్తాడేమో? చూస్తే పోలీసులకి గుర్తు చెప్పచ్చు. చూస్తే కాల్చి పారెయ్యాలి. ఇప్పటికి ముగ్గుర్ని చంపేడు. ఇంకా ఎంత మందినైనా చంపెయ్య గలడు తను.

ఈ విధంగా సాగుతున్నాయి శ్రీరామ్ ఆలోచనలు.

కిళ్ళీకొట్టు వాడి అదృష్టమో, శ్రీరామ్ అదృష్టమో లేకపోతే పోలీసుల దురదృష్టమో గాని కిళ్ళీకొట్టు కట్టి వేసుంది.

శ్రీరామ్ చకచక నడుస్తున్నాడు. తొందరగా ఏదో ఒక టాక్సీ ఎక్కాలి. హోటల్ చేరుకోవాలి. స్మశానం నగరానికి ఒక చివర ఉంటే, 'హిల్ మెన్' రెండవ చివర ఉంటుంది.

శ్రీరామ్‌కి విసుగు పుట్టింది. అంతట్లోకే ఒక టాక్సీ వస్తూ కనిపించింది. అతని ముఖం వికసించింది. జేబు రుమాలు తీసి ముఖం తుడుచుకున్నాడు. నల్లని ఎంబాసిడర్

కారు చీకటిని చీల్చుకుంటూ వస్తోంది.

శ్రీరామ్ దానిని ఆపమని సంజ్ఞ చేస్తాడు. అది ఆగే ప్రయత్నమేమీ చెయ్యలేదు సరికదా, స్పీడు మరింత పెరిగింది. శ్రీరామ్ ఆశ్చర్యపోయాడు. మరుక్షణం అతని ముఖం ఎరుపెక్కింది. కారు అతన్ని దాటింది.

శ్రీరామ్ దాని బాక్ టైర్ గురిచూసి కాల్చాడు. సైలెన్సర్ అమర్చడం వల్ల శబ్దం కాలేదు. టైరు తుస్సుమంది. టాక్సీ ఆగింది.

దాంట్లోంచి ఒకతను గబగబా దిగాడు. అతడు నల్లగా పొట్టిగా ఉన్నాడు.కూలింగ్ గ్లాసెస్ పెట్టుకుని ఉన్నాడు. వళ్ళంతా చెమటతోటి ముద్దయి ఉంది. మెడలో నల్లటి జేబురుమాలు, దుబ్బ మీసం. చిన్నసైజు దయ్యంలా ఉన్నాడు.

"ఇది ఇప్పుడే చావాలా!" అని విసుక్కుంటూ టైరు మార్చేడు. టైరు మార్చడమయిపోయిన తరువాత కారు వైపు వెళుతుంటే ఏదో రాయి తగిలి క్రింద పడ్డాడు. శ్రీరామ్ నవ్వాడు. అపుడుకాని శ్రీరామ్‌ని చూడలేదు.

"ఎవరు నువ్వు?" కంగారుగా ప్రశ్నించాడు.

"మిస్టర్ నాకో సహాయం చెయ్యాలి," అన్నాడు శ్రీరామ్.

"ఏమిటి?" చిరాగ్గా ప్రశ్నించాడు ఆ మనిషి.

"నన్ను హోటల్ హిల్ మెన్‌కి తీసుకెళ్ళాలి."

అతను మాట్లాడకుండా లేచి బట్టలు దులుపుకున్నాడు.

"వంద రూపాయిలిస్తాను!"

"నాకు కుదరదు."

"పోనీ రెండొందలు."

"వందకాదు వెయ్యిచ్చినా నేనిప్పుడు నిన్ను తీసుకెళ్ళలేను. నాకు అర్జంటు పనిఉంది."

"మిస్టర్!" గర్జించాడు శ్రీరామ్.

అతను కారు తలుపు వైపుకు అడుగు వేశాడు.

శ్రీరామ్‌లో ఆవేశం పెరిగిపోయింది. అతని వేలు ట్రిగ్గర్ని అదిమింది. అతని గుండెల్లోంచి బుల్లెట్ దూసుకు పోయింది. దబ్బున్న నేలమీద పడ్డాడు. జేబులోంచి బాటరీ తీసి అతని మీదకు ఫోకస్ చేశాడు. జేబులు సోదా చేశాడు.

నల్లగా తళ తళ మెరుస్తున్న పిస్టల్!

ఆశ్చర్యపోయాడు శ్రీరామ్. మరుక్షణం తేరుకున్నాడు. ఎవడో దొంగల ముఠా వాడయి ఉంటాడు అనుకున్నాడు. అది తీసి జేబులో వేసుకున్నాడు.

ఆ మనిషిలో చలనం లేదు. శ్రీరామ్ బూటు కాలితో బలంగా తన్నాడు. అతడు దొర్లుకుంటూ రోడ్డు పక్కకు పడిపోయాడు.

మరుక్షణం నల్లని అంబాసిడర్ కారు తారురోడ్డు మీద దూసుకు పోయింది.

కారు ఆగిపోయింది. శ్రీరామ్ క్రిందకి దిగి కారుని పరిశీలించాడు. పెట్రోలు ఇంకా ఏభై మైళ్ళు ప్రయాణం చెయ్యడానికి సరిపడవుంది. శ్రీరామ్‌కి కారుగురించి అట్టే తెలియదు. ఇంజను పనిచేయటంలేదు. మళ్ళీ కారు ఎక్కి స్టార్టు చెయ్యడానికి ప్రయత్నించాడు. కారు స్టార్టు అవ లేదు.

కారు నాలుగు మూలలా పరికించేడు. ఒక పెద్ద పెట్టె మాత్రం వుంది. పట్టుకొని చూసాడు. చాలా బరువుగా వుంది. గాద్రేజ్ తాళం వేసివుంది. తాళం చెవి ఆ దగ్గర్లో ఎక్కడా లేదు.

'ఏ శవం ఉందో?' అనిపించిం దతనికి.

శ్రీరామ్ కారుదిగి చకచకా నడవసాగాడు. అతని

చేతిలో బ్రీఫ్ కేస్ వుంది.

అతని మనస్సు ఉరకలు వేస్తోంది. ఇంకా సుధాకర్ ఇంటికి వెళ్ళాలి. అక్కడ తనకి సంబంధించిన ఫోటోలను చేజిక్కించుకోవాలి. తరువాత ఎవరికీ తెలియని చోటికి వెళ్ళిపోవాలి.

అతని ఊహలు ఆగిపోయాయి. ఎదురుగుండా ఏదో వాహనం వస్తోంది. శ్రీరామే దాన్ని పోల్చుకున్నాడు. అది...

శ్రీరామ్ గుండెలు గుబగుబలాడాయి. పోలీసులకి తన గురించి ఎలా తెలిసింది? ఎవరో చెప్పి వుంటారు! రేఖ చెప్పిందా? ఇప్పుడు తనేం చెయ్యాలి?

గబుక్కున చేతిలోవున్న సూట్ కేస్ ను పక్కనేవున్న పెంటకుప్పలోకి విసిరేశాడు. వేన్ అతన్ని సమీపించింది. అతని దగ్గరకు వచ్చి ఆగింది.

# 8

"మిస్టర్" ఇన్ స్పెక్టరు కంఠం ఖంగుమంది.

"ఈ సమయంలో మీ రిక్కడెందుకున్నారు?" సూటిగా ప్రశ్నించాడు.

"ఓ గర్ల్ ఫ్రెండ్ దగ్గర్నించి వస్తున్నాను."

"మీ కేదేనా కారు ఎదురయ్యిందా?"

"లేదు" తడబడలేదు శ్రీరామ్.

"బాగా జ్ఞాపకం తెచ్చుకోండి. నల్లరంగు ఎంబాసిడర్."

"నో. నాకు బాగా జ్ఞాపకం ఉంది. నా కెలాంటి కారు ఎదురురాలేదు."

"మీ పేరు?" అడిగాడు ఇన్ స్పెక్టర్. అతని పక్కనున్న సబ్ ఇన్ స్పెక్టరు నోట్ చేసుకుంటున్నాడు.

"చంద్రమోహన్" బొంకాడు శ్రీరామ్.

"ఎడ్రస్."

నోటికి వచ్చినదేదో చెప్పాడు. వాళ్ళు నోట్ చేసుకున్నారు.

"రేపొకసారి స్టేషన్‌కి వచ్చి కనిపించండి."

శ్రీరామ్ తల ఊపాడు.

ఇన్‌స్పెక్టర్ వేన్ ఎక్కాడు.

కానిస్టేబిల్ చెయ్యిచాపాడు. శ్రీరామ్ రెండురూపాయిలు తీసి ఇచ్చాడు.

"ఎవరికోసం ఈ వేట?"

"ఎవడో బడా స్మగ్లర్‌ట. బంగారంతో పారిపోతున్నట్టు పక్కవూరునుంచి ట్రంకాల్ వచ్చింది. వాణ్ణి పట్టుకుందామని. తస్సాదియ్యా వాడిదగ్గర వంద కేజీల బంగారం ఉందట," కానిస్టేబుల్ చెప్పుకుపోతున్నాడు.

"టూనాట్ త్రీ!" వేన్‌లోంచి గద్దింపు వినబడింది.

"వస్తున్నా సార్," అంటూ పరిగెత్తేడు వాడు.

వాన్ కదిలిపోయింది.

శ్రీరామ్‌కి తనమీద తనకే చిరాకు వేసింది. ఛీ! ఎంత వెధవపని చేసాడు. ఆ పెట్టె తెచ్చి ఉండాల్సింది. దాన్నిండా బంగారం ఉందిట. అందుకే అంత బరువుగా వుంది.

మెదడంతా మొద్దుబారిపోయింది. శ్రీరామ్ మళ్ళీ తనను సమర్థించుకున్నాడు. ఒకవేళ ఆ పెట్టెకూడా మోస్తుంటే ఎక్కువదూరం రాలేక పట్టుబడే వాడేమో?

కాలవదగ్గరకు వెళ్ళి పెట్టె తీసుకున్నాడు. వళ్ళంతా చమటపట్టి తడిసిపోయింది. కోట్ తీసి భుజంమీద వేసుకున్నాడు. వేగంగా అడ్డత్రోవన నడుస్తున్నాడు. అతనిలో మునుపటి ధైర్యంలేదు. కాని ఏదో తెగింపు.

శత్రుసేనలు తన కోటను చుట్టుముట్టిన ప్రపంచ విజేత మనఃప్రవృత్తి ఎలా వుంటుందో అతని మనఃప్రవృత్తి

కూడా అలాగే వుంది.

హోటల్ 'హిల్ మెన్' దగ్గరకి చేరుకున్నాడు. హిల్ మెన్ బ్లాకలర్‌లో నిద్రపోతోంది.

హోటల్‌లోకి ఇప్పుడు వెళితే అందరూ తనని అను మానిస్తారు. హోటల్ వెనుకభాగం చేరుకుని నీటిగొట్టం పట్టుకుని పైకి ఎగబ్రాకి తన రూమ్ బాత్‌రూమ్‌లోకి చేరు కున్నాడు.

బాత్‌రూమ్ తలుపు సందులోంచి చూచాడు.

రేఖ నిద్రపోతోంది. రేఖని ఎలా నిద్ర లేపాలో అత నికి అర్థంకాలేదు. ఒకవేళ పిలిస్తే ఆమె నిద్ర లేచినా లేవకపోయినా, పక్కరూమ్‌ల వాళ్ళు లేస్తారు. అది మంచిది కాదు.

అతనికి ఒక చక్కని ప్లాన్ తట్టింది. సిగరెట్ వెలిగిం చాడు.దాన్ని తలుపు సందులో ఇరికించి వేగంగా వేలుతో కొట్టాడు. అది రేఖ మంచానికి ముందుగా పడిపోయింది. ఇలా నాలుగయిదుసార్లు ప్రయత్నిస్తే అది ఫలించింది. సిగరెట్ రేఖమీద పడింది. రేఖ ఉలిక్కిపడి లేచింది.

"నేను శ్రీరామ్‌ని. బాత్‌రూమ్‌లో ఉన్నాను. తలుపు తియ్యి" హెచ్చరించాడు శ్రీరామ్.

రేఖ తలుపు తీసింది.

"ఏంచేశావ్? డబ్బిచ్చేశావా?" ఆత్రుతగా అడిగింది.

"వాణ్ణి చంపేశాను."

"ఎలా చంపేవ్?" అడిగింది రేఖ ఆశ్చర్యంగా.

శ్రీరామ్ బాగా అలసివున్నాడు.

"వివరాలన్నీ తర్వాత చెపుతాను. ముందు నాకు ఏదేనా డ్రింక్ ఇయ్యి" అన్నాడు.

"సారీ. జిన్ ఉంది. తీసుకుంటావా!"

"నాకేం అభ్యంతరంలేదు!"

ఒక అరగంటలో శ్రీరామ్ రిలాక్స్ అయ్యాడు. రేఖకి జరిగినదంతా చెప్పేడు. మళ్ళీ ఉత్సాహం వచ్చింది. బట్టలు మార్చుకొన్నాడు.

"ఏమిటి మళ్ళీ ఎక్కడికి ప్రయాణం?" కంగారుగా ప్రశ్నించింది రేఖ.

"సుధాకర్ దగ్గిర బహుశా నాకు సంబంధించిన ఫోటోలుకాని, నెగిటివ్‌లుకాని ఉండవచ్చు. వాటిని హస్తగతం చేసుకోకపోతే మనకి ప్రమాదం!"

"నీ ఇష్టం!" ముభావంగా అంది.

శ్రీరామ్ రేఖ దగ్గిరగా వెళ్ళి ఆమె మెడచుట్టూ చేతులు వేశాడు.

"డార్లింగ్! నువ్వు నన్ను ఎంకరేజ్ చెయ్యాలికాని, డిస్కరేజ్ చెయ్యకూడదు" అన్నాడు.

"మళ్ళీ ఎంత సేపటిలో వస్తావ్?" గోముగా ప్రశ్నించింది రేఖ.

"వీలయినంత త్వరలో."

"అక్కడికి దేంట్లో వెళతావ్?"

"నడిచే వెళతాను. ఇక్కడికి దగ్గరేలే. నువ్వు నిద్రోయినా బాత్‌రూం తలుపు మాత్రం తెరిచి ఉంచు" అంటూ శ్రీరామ్ బాత్‌రూంవైపు నడిచేడు.

శ్రీరామ్ వెళ్ళిపోయిన తరువాత రేఖ మరో రెండు పెగ్గుల జిన్ తాగింది. ఆమె కళ్ళు అలసటగా మూతపడ్డాయి. లైట్ ఆర్పి బెడ్ మీద వాలింది.

ఆమెకు శ్రీరామ్ ప్రవర్తనపై అసహ్యం వేసింది.

"దుర్మార్గుడు! డర్టీ ఫెలో!! మనుషుల ప్రాణాలతో చెలగాటా లాడుతున్నాడు. ప్రాణం విలువ తెలియదా రాస్కెల్కి."

రేఖ నిద్రాదేవి ఒడిలోనికి జారిపోయింది.

# 9

శ్రీరామ్ సుధాకర్ ఇల్లు త్వరగానే కనుక్కున్నాడు. తలుపుకి తాళంవేసి ఉంది. మారు తాళాలతోటి తాళం తీసాడు.

గదంతా దుమ్ము కొట్టుకుపోయి ఉంది. దుమ్ముమీద అనేక అడుగుజాడలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. సుధాకర్ కి ఉన్న నిర్లక్ష్యం ఆ ఇంట్లో ప్రతి వస్తువులోను కన్పిస్తోంది.

ఒకమూలగా ఒక టేబుల్, కుర్చీ ఉన్నాయి. మధ్యగా ఒక చాప, దిండు, రెండు మాసిన దుప్పట్లు ఉన్నాయి. ఒకవారగా తోలుపెట్టె ఉంది.

శ్రీరామ్ ముందుగా దాన్ని సోదాచేశాడు. మూడు జతల బట్టలు, రెండు అండర్ వేర్లు, ఒక బనియన్, ఒక జేబురుమాలు మాత్రమే ఉన్నాయి.

వాటిని క్షుణ్ణంగా పరిశీలించాడు. ఒక చొక్కాలోంచి ఒక కవరు జారిపడింది. శ్రీరామ్ ముఖం టార్చిలైటులా వెలిగింది. మెల్లగా ఆ కవర్ విప్పి చూశాడు. రెండు ఫోటోలు ఉన్నాయి. రెండు కూడా ఎవరో స్త్రీ పురుషులు నగ్నంగాను, అర్ధ నగ్నంగాను వున్నాయి.

'వాడు నన్నే కాకుండా ఇంకా చాలమందినే బ్లాక్ మెయిల్ చేస్తున్నాడన్న మాట,' అనుకున్నాడు.

టేబుల్ మీద రెండు ఆల్బం లున్నాయి. వాటిల్లో చాలామంది స్త్రీ పురుషుల ఫోటోలున్నాయి. శ్రీరామ్ ఆ నెగటివ్ ల్ని పరీక్షించసాగాడు.

అంతలోనే...

"సుధా సుధా" అని ఎవరిదో స్త్రీ కంఠం వినిపించింది.

శ్రీరామ్ కోటు జేబులోంచి కత్తితీసి పట్టుకుని ఎడం

చేతో తలుపు తీసాడు.

"ఎప్పుడొచ్చావ్ సుధా! గదిలో లైట్ కనిపిస్తే వచ్చేను. ఇన్నాళ్ళు ఎక్కడ...?" అని తొందరగా మాటాడేస్తున్న ఆ అమ్మాయి, శ్రీరామ్‌ని చూడగానే అరవబోయింది.

"అరవకు చంపేస్తాను" అని బెదిరించాడు శ్రీరామ్.

"నీ పేరేమిటి?"

"సుభద్ర."

"ఇప్పుడు సుధాకర్ వచ్చేడని ఎలాగనుకున్నావ్?" శ్రీరామ్ గొంతుక కఠినంగా ఉంది.

"లైట్ చూసి. మాది పక్కిల్లే" సంజాయిషీ ఇచ్చింది. "నన్ను వదిలెయ్యండి. నేను వెళ్ళిపోతాను. మీ గురించి ఎవరికీ చెప్పను," భయంభయంగా అంది.

"సరే వెళ్ళు!"

ఆమె అడుగు ముందుకేసింది. శ్రీరామ్ కుడిచెయ్యి ఆమె నోరుమూసింది. మరుక్షణం కత్తి వెన్నులో దిగబడింది.

ఆమె నిర్జీవంగా నేలమీద కొరిగిపోయింది.

శ్రీరామ్ ఎడమ చెయ్యి గ్లవుస్ రక్తంతో తడిసి ఎర్రగా ఉంది. ఆమె శరీరంకేసి చూసి నిర్లక్ష్యంగా నవ్వేడు.

అతను ఉలిక్కిపడ్డాడు. అవును తను సుధాకర్ డైరీ గురించి ఆలోచించనే లేదు. దాంట్లో బహుశా, తన రహస్యం ఉండవచ్చు.

డ్రాయర్ సొరుగు తీశాడు. అందులో సుధాకర్ డైరీ ఉంది. తీసి జేబులో వేసుకున్నాడు.

డ్రాయర్‌లో ఉన్న నెగిటివ్‌లని కాల్చేసాడు. గ్లవుసెస్ తీసి జేబులో వేసుకున్నాడు. బయటకు వచ్చి తలుపు

తాళం వేశాడు.

"మిస్టర్ సుధాకర్!" ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు.

"మిస్టర్ సుధాకర్! మీరు రెండునెల్ల అద్దె బాకీ పడ్డారు. ఎప్పుడు వస్తారో, ఎప్పుడు వెళతారో తెలియదు. నా అద్దె ఇప్పుడిస్తారు?"

ఆ చీకటిలో ఇంటి యజమాని శ్రీరామ్ సుధాకర్ అనుకుని ఇంకా ఏదో అనబోతున్నాడు.

శ్రీరామ్ జేబులోంచి సైలెన్సర్ తీసి అతడికి గురిచూసి కాల్చాడు.

"కెవ్వు"మని అరుస్తూ అతను నేలకూలాడు.

శ్రీరామ్ చకచకా ముందుకి పరుగెత్తాడు.

# 10

"యూ డెవిల్! ఎంత పనిచేసావు నువ్వసలు మనిషి వేనా? ఒక ఆడదాన్ని చంపుతావా?" పిచ్చిగా అరిచింది రేఖ.

ఎదురుగుండా శ్రీరామ్ కూర్చుని ఉన్నాడు.

శ్రీరామ్ నిర్లక్ష్యంగా నవ్వేడు.

"శ్రీరామ్ నీకు ప్రాణం విలువ ఎంతో తెలియటంలేదు. దోమల్ని చంపినట్టు మనుషుల్ని చంపేస్తున్నావు. నువ్వు మనిషివి కాదు," అసహ్యంగా అంది రేఖ.

"అవును నేను రాక్షసుణ్ణే" క్రూరంగా నవ్వేడు.

"రేఖా! నేనెన్ని హత్యలుచేసినా నాకేం భయంలేదు. నన్ను ఎవరూ అనుమానించలేరు."

"యు ఆర్ రాంగ్ మిస్టర్ రామ్."

"ఎక్కడ పొరబడుతున్నాను," అసహనంగా అరిచాడు శ్రీరామ్.

"రామ్! నువ్వేదో చాలా తెలివైన వాడివనుకుంటు

న్నావ్. కాని నిన్ను దోషిగా నిరూపించే సాక్ష్యాలు చాలా వదిలేశావు!''

''ఏమిటవి?''

''రామ్ నువ్వు వేణు ఇల్లు సోదా చెయ్యలేదు. నువ్వు రామచంద్రాన్ని హత్యచేస్తున్న ఫోటోలు అతని దగ్గర ఉండవచ్చు.''

శ్రీరామ్ ముఖం పాలిపోయింది. శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడు.

''రేఖా! నువ్వు చెప్పింది నిజమే నేను చాలా తప్పటడుగులు వేశాను. నేను పోలీసులకి కనపడకుండా వెళ్ళి పోతాను. డబ్బు చెరిసగం పంచుకొని ఎవరిదారిన వాళ్ళం వెళ్ళిపోదాం!''

రేఖ వ్యంగ్యంగా నవ్వింది.

''ప్లీజ్ రేఖా! నా వాటా నాకిచ్చేయి. నేను వెళ్ళి పోతాను.''

''మిస్టర్ శ్రీరామ్! నీకొక్క చిల్లిగవ్వకూడా ఇవ్వను. అంతకీ పట్టుబడితే పోలీసులకి రిపోర్టిస్తాను..బి కేర్ ఫుల్. నువ్వు వేణు దగ్గర్నుంచి తెచ్చిన ఫోటోలు నా దగ్గర ఉన్నాయి. నువ్వు ఇక్కణ్ణించి వెళ్ళిపో!''అంటూ రివ్వున బయటకు వెళ్ళిపోయింది రేఖ.

శ్రీరామ్ అచేతనుడయిపోయాడు. బుర్ర పనిచేయడం లేదు. 'అనాలోచితంగా చేసిన ఒక హత్య అనేక హత్యలకు దారి తీస్తుంది' అన్న సూక్తి తనపట్ల పూర్తిగా నిజమయ్యింది.

తనెంత పొరపాటుచేశాడు! ఏ డబ్బుకోసమైతే తనిన్ని హత్యలు చేసాడో అది తనకి దక్కటంలేదు.

'అలా జరగకూడదు' అనుకున్నాడు శ్రీరామ్.

తల తిరిగిపోతోంది. ఏం చెయ్యాలి? ఇప్పుడేం చెయ్యాలి.

రేఖ అలా చేస్తుందని అతడు కలలో కూడా వూహించ లేదు.

టాక్సీని పిలిచి హోటల్ చంచల్ కి పోనివ్వమన్నాడు.

హోటల్ లో రూమ్ తీసుకొని ఆలోచించడం మొదలు పెట్టాడు. ఏంచెయ్యాలి? పోనీ రేఖని బ్రతిమాలితే? అదే మంచి పని అనుకున్నాడు. హిల్ మెన్ కి ఫోన్ చేసి రూమ్ వన్ సిక్స్టీన్ కి కనెక్ట్ చెయ్యమన్నాడు.

రేఖ ఫోన్ ఎత్తి "హలో!" అంది.

"హలో రేఖా!"

"ఎందుకు ఫోన్ చేశావ్?" చిరాగ్గా వుంది రేఖ కంఠం.

"పోనీ నాకొక లక్షరూపాయలు...?"

"షటప్!" ఫోను పెట్టేసింది.

"రేఖా!" పళ్ళు పటపట కొరికాడు శ్రీరామ్.

'ఈ రాత్రితో నీ పని సఫా!' అనుకున్నాడు.

అవును. ఈ రాత్రికే రేఖని హత్యచేసి ఆ డబ్బుతో పారిపోవాలి!

అదే అతని ఊహ.

# 11

రాత్రి పదిగంటలయింది. నగరంలో జనసంచారం పల్చబడింది.

శ్రీరామ్ హోటల్ చంచల్ నుండి బయటకు వచ్చాడు. దగ్గరలో ఉన్న కిళ్ళీకొట్టు దగ్గరకెళ్ళి విల్స్ సిగరెట్ పాకెట్ కొన్నాడు. సిగరెట్ వెలిగించి బస్ స్టాప్ దగ్గరకు నడిచేడు.

ఇప్పటికే తను చాలా తప్పులు చేసాడు. ఇంకముందరైనా జాగ్రత్తగా ఉండాలి అనుకున్నాడు. అందుకే అతను టాక్సీ ఎక్కలేదు. అలా వెళ్తే టాక్సీవాడి ద్వారా తన ఆచూకి తెలిసిపోవచ్చు.

రెండుమూడు బస్సులు వచ్చి వెళ్ళాయి. తర్వాత అతనికి కావలసిన బస్సు వచ్చింది. శ్రీరామ్ సిటీ బస్సు ఎక్కాడు. బస్ వేగంగా పోతోంది. జనం పల్చగా ఉన్నారు.

"హలో మిస్టర్ శ్రీరామ్" ఎవరిదో కంఠం వినిపించింది. తనని కాదేమో అనిపించింది. ఒకవేళ తననే అయినా వెనకకి తిరగకూడదు.

"హలో మిస్టర్ రామ్! హౌడుయూడూ" ఎవరిదో చెయ్యి భుజంమీద పడింది.

పాములు పాకినట్టనిపించింది శ్రీరామ్‌కి. వెనక్కి తిరిగాడు. అతని వయస్సు ముప్పై సంవత్సరాలుంటాయి. ఎర్రగా బొద్దుగా ఉన్నాడు. తలకి గోధుమ రంగు మఫ్లర్.

"నన్ను గుర్తుపట్టలేదా?" నవ్వుతూ అడిగాడు.

"ఐయాం సారీ మీరెవరో నాకు తెలియదు. నా పేరు శ్రీరామ్ కాదు," అన్నాడు శ్రీరామ్ కంగారుగా.

"ఓహ్!" నవ్వేడతను. ఆ నవ్వుచూస్తే శ్రీరామ్‌కి భయంవేసింది. చలిజ్వరం వచ్చినవాడిలా వణికాడు.

బస్ ఆగింది. ఆ వ్యక్తి దిగిపోయాడు.

శ్రీరామ్ గుండెలనిండా గాలి పీల్చుకుని సిగరెట్ ముట్టించాడు.

శ్రీరామ్ బస్ దిగేటప్పటికి అతనికి చాలా దాహంగా ఉంది. డ్రింక్ తాగుదామనుకుని మరుక్షణం ఆ ఊహని ఉపసంహరించుకున్నాడు. చిన్న సాక్ష్యంకూడ వదలకూడదు. అది అతని అభిప్రాయం.

శ్రీరామ్ తిన్నగా రేఖ రూమ్‌కి వెళ్ళాడు. తలుపు లోపలగడియ వేసివుంది. శ్రీరామ్ ఒక చాలా సన్నని ఇనుపరేకు తీసి తలుపుసందులోంచి బలంగా పైకి నెట్టాడు. తలుపు తెరుచుకుంది. తలుపు దగ్గరగా పెట్టాడు. గదంతా చిమ్మచీకటి. బాటరీలైటు వెలిగించి చెయ్యి అడ్డం

పెట్టాడు. వేళ్ళసందుల్లోంచి కాంతి ప్రసరిస్తోంది. రేఖ మంచం మీద పడుకుని ఉంది. పిస్టల్ తీసి గురి చూసాడు....

లైటు వెలిగింది!

గదంతా పాలనురగలాంటి వెలుతురు!!

"వెల్ మిస్టర్ రామ్! పిస్టల్ క్రింద పడెయ్యి!" అది రేఖ కంఠం.

శ్రీరామ్ ఉలిక్కిపడ్డాడు. పిస్టల్ వదిలేసి నెమ్మదిగా వెనక్కి తిరిగాడు. రేఖ పిస్టల్ పట్టుకుని ఉంది.

ఆమె నవ్వుతోంది.

"నాకు తెలుసు శ్రీరామ్. ప్రాణం విలువ తెలియని నువ్వు నా ప్రాణం తియ్యడానికి ప్రయత్నిస్తావని. అందుకే నేను బాత్ రూమ్‌లో ఉండి నా పెట్టెలు మంచంమీద పెట్టి దుప్పటి కప్పాను.

శ్రీరామ్ ఈ సారికి నిన్ను క్షమిస్తున్నాను. ఇంకెప్పుడు నాకు కనిపించకు. రేపటికల్లా ఊరెళ్ళిపో. లేకపోతే నిన్ను పోలీసులకి పట్టిస్తాను. బి కేర్."

"రేఖా ప్లీజ్ ఒక లక్షరూపాయి లియ్యి. నా దారిన పోతాను."

రేఖ వికటంగా నవ్వింది. "లక్షరూపాయిలు లేదు లక్ష పైసలుకూడా ఇవ్వను, గెటవుట్!" అరిచింది.

శ్రీరామ్ మౌనంగా బయటకి వచ్చేశాడు.

## 12

సముద్రపు అలలు తీరాన్ని ఢీకొంటున్నాయి. బీచిలో జనం ఎక్కువగా లేరు.

శ్రీరామ్ ఒకమూల ఇసుకపై వెల్లకింతలా పడుకుని వున్నాడు. అతని బుర్ర తీవ్రంగా పనిచేస్తోంది. అతనిలో నిరాశ పేరుకొని పోయింది.

రేఖను నిన్న చంపడానికి ప్రయత్నించి విఫలు డయ్యాడు. ఈ వేళనుంచీ కట్టుదిట్టంగా వుంటుంది.

పోలీసులు కూడా ఈపాటికి తనగురించి వేట ప్రారంభించి వుంటారు. ఏం చెయ్యాలి? ఆత్మహత్య ఒక్కటే శరణ్యం మనిపిస్తోంది శ్రీరామ్‌కి.

"హలో మిస్టర్ ర్యామ్!"

శ్రీరామ్ ఉలిక్కిపడ్డాడు. నిన్న బస్సులో పలకరించిన వ్యక్తి. అతను శ్రీరామ్‌కి నాలుగడుగుల దూరంలో నిల్చుని వున్నాడు.

"మిస్టర్ రామ్!" మళ్ళీ పిలిచాడతను. ఈసారి అతని కంఠంలో నవ్వు వినిపించింది.

"మీరెవరో నాకు తెలియదు. నా పేరు శ్రీరామ్ కాదు. మీరు నిన్నా అ పేరుతోనే సంబోధించారు."

"తొందరపడకు మిస్టర్ రామ్. తరువాత బాధపడతావు. నేనెవరో నీకు తెలియకపోయినా నీవు నాకు పరిచితుడివే."

"ఎలాగ?"

"ఫోటో ద్వారా"

"ఏ ఫోటోద్వారా?" కంగారుగా అడిగాడు శ్రీరామ్.

"లక్షాధికారి రామచంద్రం గుండెల్లో నీ కత్తి కసుక్కున దిగిన ఫోటో."

శ్రీరామ్‌కి మతిపోయినట్లనిపించింది.

"చూపించమంటావా?"

"అక్కర్లేదు పూర్వ మొకసారి చూసా!"

శ్రీరామ్‌లో మొండిధైర్యం ప్రవేశించింది.

"అది నీకు చాలా ప్రమాదకరమైనది!"

"ఫర్వాలేదు. పోలీసులకి పంపు. లేదా పేపర్లు కొట్టించి అమ్ముకో."

"ఆవేశపడకు శ్రీరామ్. నువ్వు రామచంద్రం ఇనప్పెట్టెలోంచి ఐదులక్షలు దొంగిలించేవు. అందులో నాకు రెండులక్ష లియ్యి, నాదారిన నే వెళ్ళిపోతాను."

"రెండులక్షలా! హహహ !!" బిగ్గరగా నవ్వేశాడు శ్రీరామ్.

"మిస్టర్ రామ్!" కంగారుగా పిలిచాడా వ్యక్తి.

"నా దగ్గర రెండులక్షలు లేదు గదా, రెండు పైసలు కూడా లేవు. నా పార్ట్నర్ నన్ను మోసగించింది మిస్టర్!"

"వరదన్."

"మిస్టర్ వరదన్ నీకు నిజంగా రెండు లక్షలు కావాలా? అయితే ఒక ఉపాయం వుంది."

"ఏమిటది?" వరదన్ చటుక్కున ముందుకి వంగాడు.

"చెప్తాను. కాని ముందు నీ గురించి నాకు కొంత ఇన్ఫర్మేషన్ కావాలి. నీ గురించి నేను విపులంగా తెలుసుకోవాలి."

"స్ట్రెన్లీ, నాకు ఈ కేసుకి వున్న సంబంధం గురించి చెపుతాను.

"నా పేరు వరదన్. స్టూడియో చిత్ర ఓనర్ని. బ్లాక్ మెయిలర్స్ అందరూ ఫోటోలు నా దగ్గిరే డెవలప్ చేయించుకుంటారు. వేణు నేను స్నేహితులం.

ఒకరోజు వేణు నా దగ్గరకి వచ్చి నా సహాయం కోరాడు. ఏమి టన్నాను. మీరిలా దొంగతనం చెయ్యబోతున్నట్టు చెప్పి, దొంగతనం చేస్తున్నట్టు ఫోటోలు తీయమన్నాడు. వాటి సహాయంతో మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చెయ్యొచ్చనీ, దానిద్వారా డబ్బు సంపాదించ వచ్చనీ, నాకు సగం వాటా ఇస్తానన్నాడు.

నేనప్పుడు ఇంకో ఉపాయం చెప్పాను. అదేమిటంటే రామచంద్రానికి మత్తుపదార్థం ఆహారంలో కలపవద్దని చెప్పాను. ఏదో ఓ విధంగా రామచంద్రానికి మెలుకువ వచ్చి నిన్ను చూస్తాడని అతన్నించి తప్పించుకోవడానికి నువ్వు చంపుతావని ఊహించాను. హత్య చేస్తున్నట్టు ఫొటో తీసేస్తే మాకింకా లాభం! వేణూ నాతో ఏకీభవించాడు.

వేణూ అన్నంలో మత్తుపదార్థం కలుపలేదు. రామచంద్రం నిద్రలో వుంటాడని ఊహించిన నువ్వు ధైర్యంగా దొంగతనం చెయ్యబోయావు. నేను కావాలని పెద్ద శబ్దం చేశాను! రామచంద్రం లేచాడు. స్ట్రాంగ్ రూమ్‌లో అలికిడి అవటంతో అక్కడకు వచ్చి నిన్ను చూసాడు. ఆ తరువాత సంగతి నీకు తెలిసినదే!

కొన్ని ఫోటో స్టాటులు నా దగ్గర వుంచుకుని మిగిలినవి వేణు కిచ్చాను. ఆ సంగతి వేణుకు తెలియదు. అయితే నాలో మరో ఊహ కదిలింది. ఒకవేళ వేణూని నేను బ్లాక్ మెయిల్ చేసి వాడిదగ్గర్నించి అంత డబ్బు లాగితే? అందుకే వేణూని అనుసరించి ఫొటోలు తీయమని నా అసిస్టెంటు సుధాకర్‌ని పంపేను. తర్వాత నీకు తెలిసిందే."

శ్రీరామ్ తల పంకించాడు.

"మిస్టర్ వరదన్! రేఖ దగ్గిర ఐదులక్షల రూపాయి లున్నాయి. వాటిని మనం రేఖ బ్రతికి ఉండగా పొందలేం!"

"రేఖ ఎక్కడ వుంటోంది?" చటుక్కున ప్రశ్నించాడు వరదన్.

"చెప్పతానుండు. రేఖ షీలా అనే పేరుతో హోటల్ హిల్ మెన్‌లో వుంటోంది. రూమ్ నెంబర్ 116. నువ్వు ఆమెని ఎలాగైనా హత్య చెయ్యాలి. ఆమె డబ్బు ఎక్కడ

దాచిందో నాకు తెలుసు. ఆ హత్య చేస్తే నీకు రెండు లక్షలు వస్తాయి."

శ్రీరామ్ ఒక్క విషయం మాత్రం అబద్ధం చెప్పాడు. అదేమిటంటే రేఖ డబ్బు ఎక్కడ వుందో తనకు తెలుసని. నిజానికి అది అతనికి తెలియదు.

"మిష్టర్ రామ్! మనిద్దరి మధ్యన అరమరికలు ఉండకూడదు. అందుకని కొన్ని ప్రశ్నలు వేస్తాను."

శ్రీరామ్ అడగమన్నట్టు తల ఊపేడు.

"రామచంద్రం స్ట్రాంగ్ రూమ్ రహస్యం మీకు ఎలా తెలుసు?

"రేఖ సంపాదించింది. రామచంద్రం కూతురితో బాగా స్నేహం చేసి రామచంద్రం డైరీ చేజిక్కించుకుంది. దాంట్లో ఐరన్ సేఫ్ తాళంయొక్క ఈక్వేషన్ వుంది."

"నువ్వు ఎన్ని హత్యలు చేసావ్!"

"మూడు."

"ఎవరెవర్ని."

"రామచంద్రం, వేణు, సుధాకర్."

"అబద్ధమాడకు, ఒక స్మగ్లర్ను, సుధాకర్ ప్రియురాలు సుచిత్రను, అతడుంటే యింటి యజమానిని కూడా చంపావు."

శ్రీరామ్ మాట్లాడలేదు.

"రేఖని నువ్వే చంపకుండా ఆ పని నా కెందుకప్పగించావ్?" సూటిగా అడిగాడు వరదన్.

"నేను నిన్న రేఖని చంపడానికి ప్రయత్నించి విఫలమయ్యాను. అందువల్ల రేఖ నానుండి జాగ్రత్తగా వుంటుంది. అంతేకాకుండా నా కిప్పుడో మనిషిని చంపే ధైర్యం లేదు."

"గుడ్ నేనింక వెళతాను. ఏ విషయం నీకు త్వర లోనే చెపుతాను."

# 13

"రూం నెంబర్ వన్ ట్వెంటీ ఫైవ్" అన్నాడు తాళాలు అందిస్తూ.

వరదన్ రూమ్‌కి వచ్చి స్నానంచేసి బట్టలేసుకుని మేనే జర్‌కి ఫోన్ చేసి, బోయ్‌ని పంపమన్నాడు.

ఐదు నిముషాల్లో వాడు వచ్చాడు. వాడికి పధ్నా లుగు సంవత్సరా లుంటాయి.

మెనూకార్డ్ చూసి ఏదో రెండు స్వీట్స్ ఆర్డర్ చేశాడు. స్వీట్స్ వచ్చాయి.

"అలా కూర్చోవోయ్" అన్నాడు వరదన్ కుర్చీ చూపిస్తూ. కాని వాడు కూర్చోలేదు.

"ఫర్వాలేదు కూర్చోవోయ్" అన్నాడు నవ్వుతూ. టిఫిన్ తిన్న తరువాత వాడికో అయిదు రూపాయి లిచ్చాడు.

"నాకొక సహాయం చెయ్యాలి."

"ఏమిటి సార్!" అన్నాడు వాడు ఉత్సాహంగా.

"నీకు రూమ్ నెంబర్ వన్ సిక్స్‌టీన్‌లో ఉన్న ఆవిడ తెలుసా?"

వాడు తెలుసు నన్నట్టు తల ఊపాడు.

"ఆవిడ ఎప్పుడేనా కాఫీ ఆర్డర్ చేస్తే ఈ పొట్లం కాఫీలో కలుపు. వెంటనే వచ్చి నాకు చెప్పు" అంటూ చిన్న పొట్లం, పదిరూపాయిల నోటు ఇచ్చాడు. వాడు అనుమానంగా వరదన్‌ని చూశాడు.

వాడి అనుమానం గ్రహించి "అదేం విషం కాదులే వోయ్. ఓ గంట మత్తు కలిగిస్తుంది" చెప్పాడు వరదన్.

"అలాగే సార్!"

వాడు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

## 14

రేఖ కళ్ళు తెరిచింది. ఏమిటి? తనిలా పడుకుంది? ఏం జరిగింది?

తల తిప్పి చూసింది. ఎవడో కూర్చుని ఉన్నాడు. రేఖని చూడగానే చిన్నగా నవ్వేడు.

"మిస్ రేఖా!"

రేఖ మాట్లాడలేదు.

"మిమ్మల్నే రేఖా!"

"ఎవరు మీరు? ఇక్కడెందు కున్నారు? నా పేరు రేఖ కాదు" అంది కంగారుగా.

"కంగారు పడకు రేఖ! నీ గురించి నాకంతా తెలుసు."

"ఏమిటి తెలుసు! పిచ్చివాగుడు వాగకు. ముందు ఇక్కడనుంచి పో," అరిచింది రేఖ.

"నీ దగ్గరున్న ఐదు లక్షల గురించి."

రేఖకు పిచ్చెక్కినట్టనిపించింది. అసలు తనెందుకు ఇలా పడుకుంది? రేపు ఇక్కణ్ణించి వెళ్ళిపోదామనుకొంటూంటే ఇంతలో వీడెవడు శనిలా దాపురించాడు.

"రేఖా! కావాలంటే నేనిప్పుడు నిన్ను చంపెయ్యగలను."

అతని చేతిలో రివాల్వర్ తళతళ లాడుతోంది. రేఖ వంటినిండా చెమటలు పట్టేసింది.

"ఎవరు నువ్వు?"

"చెప్తాను. నా పేరు వరదన్. ఫోటోగ్రాఫర్ని. రామచంద్రం హత్య ఫోటో నేనే తీసాను."

"నీకేం కావాలి? నన్నెందుకు బెదిరిస్తున్నావ్?" రేఖ పెదాలు వణుకుతున్నాయి.

"డబ్బు!" వికటంగా నవ్వేడు వరదన్.

"ఏ డబ్బుకోసం నువ్వు, శ్రీరామ్ కక్కుర్తిపడ్డారో, ఆ డబ్బు" మరోసారి నవ్వేడు.

"నా దగ్గర లేదు."

"మరెక్కడుంది?"

"శ్రీరామ్ దగ్గర."

వరదన్ మళ్ళీ నవ్వేడు.

"నువ్వలా కాలయాపన చేస్తే చంపెయ్యాల్సొస్తుంది."

రేఖ నోరు తడారి పోయింది.

"నన్ను నమ్ము," ప్రాధేయపూర్వకంగా అంది.

"పిచ్చి పిచ్చి కబుర్లు చెప్పకు రేఖా! నేను శ్రీరామ్ దగ్గిర్నుంచే వచ్చేను."

"అయితే?" ఏం తెలీనట్లు అడిగింది.

"ఏం తెలీనట్టు మాట్లాడకు రేఖా! నాకు చిరాకు ఎక్కువ. నీ దగ్గిర డబ్బుందని శ్రీరామ్ చెప్పాడు."

"శ్రీరామ్ నీకు అబద్ధం చెప్పాడు."

వరదన్ నవ్వేడు.

"ఎందుకలా నవ్వుతావు," కోపంగా ప్రశ్నించింది రేఖ.

"నువ్వు నన్నే మభ్యపెట్టాలని చూస్తుంటే నవ్వొస్తోంది."

"శ్రీరామ్ నీకు అబద్ధం చెప్పలేదని ఎందుకనుకుంటున్నావు?"

"రేఖా! ప్రతి మనిషి ప్రాణానికి అన్నిటికంటె ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాడు. ప్రాణం తీపి అటువంటిది. ప్రాణం విలువ వెలలేనిది. కాని శ్రీరామ్ ప్రాణం వది లెయ్యటానికి సిద్ధపడ్డాడు. దాన్నిబట్టి శ్రీరామ్ దగ్గిర డబ్బు లేదని తెలుసుకున్నాను."

రేఖ మాట్లాడలేదు.

"రేఖా నేను చాలా ఆలస్యం చేస్తున్నాను కదూ!"

"దేనికి?"

"నిన్ను చంపడానికి."

రేఖ మాట్లాడలేదు.

"నీకు బ్రతకాలని ఉందా!" కరుగ్గా ఉంది వరదన్ కంఠం.

రేఖ ఉందన్నట్టుగా తల ఊపింది.

"గుడ్! అయితే రెండు లక్షలు ఇయ్యి, నిన్ను వది లేస్తాను."

"రెండు లక్షలా! ఒక లక్షిస్తాను."

"వద్దు నీ దగ్గరే ఉంచుకో. శ్రీరామ్ నిన్ను చంపితే నాకు రెండు లక్షలిస్తా నన్నాడు."

"పోనీ నేనే ఇస్తాను ఆ డబ్బు!"

"దట్స్ గుడ్."

"నీ పేరు?"

"వరదన్!"

"మిస్టర్ వరదన్, మనం డబ్బు పంచుకున్నంతలో సరిపోదు. శ్రీరామ్ మనల్ని వదలడు కాబట్టి శ్రీరామ్‌ని మన దారినుండి తప్పించాలి."

"యూ ఆర్ కరెక్ట్! నేను అదే చెబ్దామనుకుంటు న్నాను. శ్రీరామ్‌ని సులభంగా మన దారిలోంచి తప్పించ వచ్చు," అన్నాడు వరదన్.

"నో నేను ఒప్పుకోను. శ్రీరామ్ చాలా తెలివైన వాడు. ఏదైనా పొరపాటు జరిగితే మన ప్రాణానికే నష్టం!"

"అది ఇదివరకటి శ్రీరామ్. ఇప్పుడు శ్రీరామ్ బుర్ర చెద పట్టి పోయింది. నువ్వు మోసం చెయ్యడంతో మతి పోయింది" అన్నాడు తాపీగా.

"అయితే శ్రీరామ్‌ని ఎలా హత్య చెయ్యచ్చు? శవం

మాయం చెయ్యడం ఎలా?"

"నువ్వు తొందర పడకు అన్నీ చెప్తాను. రేపురాత్రి నువ్వు శ్రీరామ్‌కి ఫోన్ చేసి మనసు మార్చుకున్నానని, ఇద్దరం కలిసి ఉండచ్చు రమ్మనమను. రాగానే పక్కనే ఉన్న పల్లెటూరికి వెళ్ళిపోదామని చెప్పు. నేనిక్కడ మారువేషంలో టాక్సీ డ్రైవరుగా క్రింద ఉంటాను. మీరు నా టాక్సీలో ఎక్కుతారు. కొద్ది దూరం వెళ్ళిన తరువాత నేను శ్రీరామ్‌ని కత్తితో పొడుస్తాను. తర్వాత మనం కారుని యీ కొండపైనుండి శవంతో పాటు లోయలోకి తోసెయ్యచ్చు."

"గుడ్ ప్లాన్!"

# 15

"రేఖా" అంటూ వచ్చి శ్రీరామ్ ఆమె భుజాన్ని నొక్కాడు.

"నాకు తెలుసు రేఖా! నువ్వు చాలా మంచిదానివని," అంటూ ముద్దెట్టుకోబోయాడు.

"ఉష్! ఏమిటా పని. మనం త్వరగా ఇక్కడనుంచి పక్క ఊరు వెళ్ళిపోవాలి. టాక్సీ పిలు!" అంది.

అంతట్లోకే వరదన్ టాక్సీ వచ్చి పక్కగా ఆగింది.

"టాక్సీ కావాలా సార్!"

"అవును. ప్రక్క ఊరికి వస్తావా?"

"ఎక్కండి."

శ్రీరామ్ బాక్‌డోర్ తియ్యబోయాడు.

"ఫ్రంట్ సీట్లో కూర్చోండి సార్. బాక్‌సీట్ బాగా లేదు," అన్నాడు డ్రైవర్.

వరదన్ పక్కన శ్రీరామ్, అతని పక్కన రేఖ కూర్చు న్నారు. శ్రీరామ్ మారువేషంలో వున్న వరదన్‌ని గుర్తు

పట్టలేదు. టాక్సీ 'హిల్ మెన్' దాటి కొంతదూరం వచ్చింది.

"సార్! సీటుక్రింద ఏదో వున్నట్టుంది. చూడండి," అన్నాడు వరదన్.

శ్రీరామ్ క్రిందికి చూడడానికి వంగాడు. మరుక్షణం... వరదన్ చేతిలోని కత్తి శ్రీరామ్ వీపులో దిగబడింది.

"అమ్మా!" పిచ్చిగా అరిచాడు శ్రీరామ్.

మరొకసారి పొడిచాడు వరదన్.

"చచ్చేడు," అన్నాడు వరదన్.

"వెల్ డన్" అంది రేఖ మెచ్చుకోలుగా.

శవం సీటుక్రిందకి జారుకుంది.

రేఖ క్రిందకు వంగింది.

"ఎందుకు?" అడిగాడు వరదన్.

"చూస్తున్నాను."

"ఏమిటి?"

"రక్తం వేడిగా ఉంది."

పెదగా నవ్వేడు వరదన్. మరుక్షణం కెవ్వుమన్నాడు. ఏ కత్తితోటి శ్రీరామ్‌ని పొడిచాడో ఆ కత్తే అతని గుండెల్లో దిగేసింది రేఖ. కసిదీరా పొడిచింది.

"ఇడియట్! మూడులక్షలు కావాలా? చావు!! మూడు కాదు ముప్పైసార్లు చావు" పిచ్చిగా అరుస్తోంది రేఖ.

స్టీరింగ్ వీల్ ముందు కూర్చుంది.

ఏక్సిలేటర్ బలంగా నొక్కింది. నిర్మానుష్యమైన రోడ్డు మీద, చిక్కటి చీకటిలో కొండ మలుపులు తిరుగుతూ కారు దూసుకుపోతోంది.

రేఖకు ఇప్పుడు చాలా సంతోషంగా వుంది. ఇక తన స్వేచ్ఛకు అడ్డంకులు ఏవీ లేవు. ఆ డబ్బుతో తను జీవి

తాంతం హాయిగా బ్రతకగలదు. మనస్సంతా ఊహాలలో తేలిపోసాగింది.

ఎదురుగా ఓ లారీ వేగంతో రాసాగింది. రేఖ కారు స్పీడు తగ్గించడానికి బ్రేకులు వేయసాగింది. కాని అవి పని చేయటంలేదు. కారు స్పీడు తగ్గలేదు. పైగా డౌన్‌లో కారు మరింత స్పీడుగా వెళ్ళసాగింది.

లారీ దగ్గరైంది. రేఖకు చెమటలు పట్టసాగాయి.

నేర్పుగా ప్రక్కకు కోసి లారీని దాటింది. కాని అంతలోనే కారు తాగినవాడికి మల్లే మెలికలుగా తిరిగి ప్రక్కనున్న లోయలోకి పడిపోయింది.

ఎర్రని మంటలు భగ్గున లేచాయి. ఆ మంటలలో రేఖ సజీవంగానే దహనమైపోసాగింది. ఆమె ఆర్తనాదాలు కొద్దిసేపు ఆ చీకటిలో ప్రతిధ్వనించి ఆగిపోయాయి.

మొత్తం తొమ్మిదిమందిని బలితీసుకొన్న ఆ అయిదు లక్షలు గూడా ఆ మంటలలో మసి అయిపోయాయి.

—: ఐ పో యిం ది :—




## ఎనిమిదవ భాగము

డెల్లా నిద్రపోయింది. గంటసేపు గడిచింది. ఇంకా ముందుకు కదిలిపోవడం మంచిదనిపించింది. మేము వచ్చిన హెలికాప్టర్ గుర్తొచ్చింది. అందులో ఇంకా గాసోలిన్ వుంది కొద్దిగా. అదే ఈ దీవినుండి తప్పుకునేందుకు మాకు శరణ్యం. దాంతో మళ్లా సముద్రంపైన పడదామనుకున్నాను. అదృష్టం బాగుండి ఏదైనా షిప్ కనుపిస్తే ఎలాగో తంటాలుపడి దాన్లో ఎక్కగలిగితే ఏదో ఒక దేశానికి చేరుకోవచ్చు.

డెల్లాను నిద్రలేపాను. కళ్ళు నులుముకుని లేచింది. వేళ్ళతోనే వెంట్రుకల్ని దువ్వుకొన్నట్లు సరిచేసుకుంది.

“ఏం చేద్దాం!” అడిగింది.

నా ఆలోచన చెప్పాను. ఆమెకూడా అంగీకరించింది.

ఇద్దరం మళ్ళీ నడక మొదలెట్టాం. ఎటుపోతున్నదీ మాకు అర్థంకావడంలేదు. మా హెలికాప్టర్ ఎక్కడుందీ

తెలియడంలేదు. ప్రొద్దు తరిగిపోతూ వుంది. చీకటి పడ్డాక మా ప్రయత్నం ప్రయోజనహీనమవుతుంది.

రాత్రిపూట హెలికాప్టర్‌లో సముద్రంపైకి వెళ్ళటం ప్రమాదం. క్రిందేముందో కనుపించదు. ఏదైనా షిప్ కనుపించినా మేము దాన్ని చేరుకోవడం కూడా కష్టమే. దానికి తోడు గాసోలిన్ ఎక్కువగాలేదు దానిలో.

కొంతదూరం పోయాక ఆగాం.

డెల్లాను తుపాకీ పట్టుకొని ఒక పొదవుపాటి చెట్టు దగ్గర నిలుచోమని చెప్పి, నేను పైకి ఎక్కాను.

దాదాపు ఫర్లాంగు ఎత్తుంది అది. కొమ్మలు లేవు. చెట్టు పైభాగాన గుబురులా వుంది. అది కొబ్బరిచెట్టు కాదు, తాటి చెట్టులాగలేదు. కానీ ఆ జాతికి చెందినదే.

నాకు ప్రాకుతూ చెట్లెక్కే అలవాటులేదు. పొట్ట భాగమంతా, మోకాలు ఒరుసుకుని చర్మం చిట్లి అక్కడక్కడా చిన్న గాయాలయినాయి. చేతులు దోక్కుని పోయాయి. అలాగే ఊపిరి బిగదీసుకుంటూ, క్రిందకు జారిపోకుండా, మెల్లగా, అంచెలంచెలుగా చెట్టు పై చివరకు చేరుకున్నాను.

అక్కడ్నుంచి చుట్టూవున్న ప్రదేశమంతా నాకు బాగా కనుపించసాగింది. మేము హెలికాప్టర్ ఆపిన ప్రదేశంకూడా, ఎడమవేపు దూరంగా కనుపించింది. కళ్ళతోనే ఎన్ని డిగ్రీలలో, ఏవైపున, ఎంత దూరంలో ఆ ప్రదేశం వుందో అంచనా వేసుకొన్నాను. మళ్ళా చుట్టూ ఎవరయినా మనుషులు కనుపిస్తారేమోనని చూశాను. ఎవ్వరిజాడలేదు. క్రిందికి దిగడం మొదలెట్టాను. చాలా సులభంగానే వుంది.

"బ్రతికి బయటపడే దారేదైనా దొరికిందా?" అడిగింది డెల్లా నిరాశగా, నిర్లిప్తతతో కూడుకున్న స్వరంతో.

"అలా బెంబేలుపడకు. మన హెలికాప్టర్ కనుపిం చింది. దానిదగ్గరకు వెళ్దాం" అన్నాను.

"కనుపించిందా అదున్న స్థలం?" అడిగింది ఉత్సాహంగా.

"ఆఁ! ఒక మైలు నడవాల్సి వుంటుంది" అన్నాను.

"పది మైళ్ళయినా నడుస్తాను" అంది ముందు కడుగు వేస్తూ డెల్లా.

ఇద్దరం ఒకరి వెనుక ఒకరం, చెట్లనడుమ, తీగలు తప్పుకుంటూ, దారి చూసుకుంటూ, చేసుకుంటూ నడిచాం. గంట తర్వాత అక్కడకు చేరాం.

నేను హెలికాప్టర్ వైపు చూశాను.

నా కళ్ళు తిరిగిపోయాయి. మొత్తాన్ని ముక్కలు ముక్కలుగా చేసిపెట్టారు. చక్రాలు దూరదూరంగా పడున్నాయి. లావుపాటి రాళ్ళు దానిచుట్టూ పడున్నాయి. దగ్గరగా వెళ్ళాను. వైర్లన్నీ లాగిపారేశారు. స్టీరింగ్ విరగ్గొట్టారు.

"ఇది దేనికీ పనికిరాదు. బలముండి మోసుకుపోతే పాత ఇనుపసామాను క్రింద అమ్ముకోవచ్చు" అంది డెల్లా.

"అవును! నిజమే!!" దానివైపు విస్మయంగా చూస్తూ అన్నాను.

"ఎవరు ఎందుకు ఇలా చేసివుంటారు?"

"ఏమో? మనల్ని బంధించిన రాబందులు ఈ ఘాతకం జరిపివుండాలి. ఎందుకలా చెయ్యవలసి వచ్చిందో అర్థం కాలేదు" అన్నాను.

"అయితే మన భావి కార్యక్రమమేమిటి?" అంది డెల్లా విచారంగా.

"ఆలోచిస్తున్నాను. ఏదిఏమైనా మన మీ ప్రాంతాల్లో వుండటం క్షేమంకాదు. ఏ క్షణంలోనైనా ఆ రాక్షసులు

మనల్ని వెతుక్కుంటూ ఇక్కడికొచ్చే ప్రమాదముంది. అందువల్ల దూరంగా అదుగో అటు సముద్రంవైపు పోదాం. ఆ ఇసకలోనే రాత్రికి వంతులవారీగా పడుకుందాం. తెల్లారాక ఏంచెయ్యాల్సిందీ తేల్చుకుందాం!'' అన్నాను.

''ఓ. కే!'' అంది డెల్లా.

అక్కడ్నుంచి ఇద్దరం బయలుదేరాం. సముద్రంవేపు నడక ప్రారంభించాం.

సముద్రపు ఒడ్డు చేరాం. చీకటి అప్పుడప్పుడే ముసురు కుంటూంది.

గడియారంకేసి చూసుకున్నాను. ఒంటిగంటయింది. అదే ఇండియా అయితే సాయంత్రం ఆరుగంటలయి వుండేది. అంటే మేము ఏడుగంటలు ముందున్నాం. దాన్ని బట్టి భూమధ్యరేఖకు ఎంత దూరంలో మేము ఉండి వుంటామో ఉజ్జాయింపుగా లెఖవేశాను. అమెరికాకు చుట్టుప్రక్కల దూరంగా ఎక్కడో వున్న దీవిలో వుండి వుండాలనిపించింది నాకు.

సముద్రపు గాలి ఉప్పగా తగిలింది నోటికి. అలలు హోరుమంటూ గోలచేస్తున్నాయి. మేము ఇసుకలో కూల బడ్డాం. డెల్లా లేచి సముద్రం దగ్గరకు వెళ్ళింది. తర్వాత ఐదునిముషాల్లో తిరిగొచ్చింది.

''ఏంచేశావ్?'' అడిగాను.

''కాస్త ఒళ్ళు, కాళ్ళు, చేతులు కడుక్కొని ఆ ఉప్పు నీళ్ళే రెండు గుక్కలు త్రాగాను. దాహం ఆగలేదు. ఇపుడు నీళ్ళు అంత ఉప్పగా లేవు'' అంది.

''ఉండవు. మనం మూడ్రోజులనుంచి ఈ ఉప్పుగాలి లోనే వున్నాంగా?'' అన్నాను.

ఇద్దరం సిగరెట్లు ముట్టించుకున్నాం. ఇసుకలోనే పడుకుని దమ్ముకొడుతూ ఆకాశంకేసి చూస్తూ ఒకరి

కొకరికి సంబంధం లేనట్లు ఆలోచనలు చేసుకుంటూండి పోయాం. అరగంట అలానే గడిచిపోయింది.

"డెల్లా!" పిలిచాను.

ఆమె పలుకలేదు. లేచి తలత్రిప్పి చూశాను.

మంచి నిద్రలో వుంది. నేను ఆలోచిస్తూ కూర్చున్నాను. ఒక గంట గడిచింది. దూరంగా ఏవో అరుపులు, కేకలు వినొచ్చాయి. తక్కున లేచి నిల్చున్నాను.

తుపాకీ పట్టుకొని చుట్టూ చూశాను. అంతా చీకటి. ఏమీ కనుపించలేదు.

డెల్లాను తట్టి లేపాను.

ఉలిక్కిపడి లేచి కూర్చుని "ఏమయింది?" అడిగింది.

కలకలం గురించి చెప్పాను. తను విని "అవును. దూరంగా ఎవరో అరుచుకుంటూ వస్తున్నారు" అంది.

"ఆ అడవి మనుషులై వుంటారు. గూడెం చేరాక మనం తప్పించుకుని పోయిన విషయం తెలిసుంటుంది. వెతుక్కుంటూ వస్తున్నారులాగుంది. మనమేం చేద్దాం?" అన్నాను.

"తుపాకీలున్నాయిగా? ప్రాణాలున్నంతవరకు యుద్ధం చేద్దాము?" అంది డెల్లా ధైర్యంగా.

"కానీ ఇక్కడుండి లాభంలేదు. మనం సముద్రంలోకి పోదాం. నీళ్ళల్లో నిలబడి పోరాడుదాం. వాళ్ళనుండి తప్పించుకునేందుకు వీలుంటుంది" అన్నాను.

నా సలహాకు సమాధానంగా తుపాకీ పట్టుకుని లేచింది.

ఇద్దరం వడివడిగా సముద్రంవేపు పరుగెత్తాం. ఒక పెద్ద బండరాయి చాటు నిల్చున్నాం.

మమ్మల్ని అంతకుముందు పట్టుకున్న గుంపే వచ్చింది.

వాళ్ళమీదకు గురిపెట్టి తుపాకీ పేల్చాను. గుంపంతా దూరంగానే నిలబడింది.

బాణాలు ఎక్కు పెట్టారు. అమ్ములు ముందుకు వచ్చి పడ్డాయి. బరిసెలు విసిరారు. మేము మోల్లోతు నీళ్ళల్లో నిలబడ్డాం. వాళ్ళు మొత్తం ఒడ్డుపైన వున్నారు. మేము మరో రెండు రౌండ్లు కాల్చాం.

వాళ్ళల్లో వాళ్ళు కాసేపు సంప్రదించుకుంటూండి పోయారు కాసేపు.

నలుగురు మనుషులు నీళ్ళవైపు పరుగెత్తారు.

ప్రాణాలు పోయినాసరే మమ్మల్ని పట్టుకునేందుకు వాళ్ళు సన్నద్ధులైనట్లుంది. వాళ్ళని దగ్గరకు రానియ్యడం నా కిష్టంలేదు. తుపాకీ గురిపెట్టి కాల్చాను. ఒకడి గుండెల్లోంచి దూసుకుపోయింది. పెద్ద కేకపెట్టి నీళ్ళల్లోనే పడిపోయాడు. అతని ప్రక్కనున్న ముగ్గురూ వెనుకంజ వేశారు.

డెల్లా తుపాకీ ఎత్తింది కాల్చేందుకు. నేను ఆమెను కాల్పులు ఆపమన్నాను. మా దగ్గరున్న మందు సామగ్రి కొద్దిపాటే. అనవసరంగా ఖర్చుపెట్టడం నా కిష్టంలేదు. వాళ్ళల్లో ఒక మనిషి చనిపోయాక భయపడి వెనక్కి వెళ్ళిపోతే, మిగిలిన కొద్దిపాటి అమ్యునిషనన్నా దక్కుతుంది. మరోమారు ఆపదలో అందుబాటుకొస్తుంది.

నేను వాళ్ళను గమనించసాగాను. వాళ్ళ నాయకుడు ఏదో చెప్పాడు. నీళ్ళల్లోపడ్డ మనిషి శవాన్ని లాక్కుని వెనక్కి వెళ్ళిపోయారు.

అందరూ సముద్రపు ఒడ్డుకు చేరారు.

నేనూ, డెల్లా వాళ్ళను గమనిస్తూ నీళ్ళల్లో నిల్చున్నాం.

వాళ్ళు అక్కడ్నుంచి ముందుకు రావడంలేదు. వెనక్కి వెళ్ళడంలేదు. ఏం చెయ్యాలనుకుంటున్నారో ఊహించలేకపోయాను.

అందరూ వరుసగా బరిశెలు చేత్తో పట్టుకుని ఒడ్డునే

లైనుగా నిలబడ్డారు.

"మనం నీళ్ళలోంచి వెలుపలికి రాగానే పట్టుకుందామని సిద్ధంగా నిల్చబడ్డారు" అంది డెల్లా.

"చంపారు. మనం ఇలా ఎంతసేపు నీళ్ళల్లో నిలబడతాం. వాళ్ళు వెనక్కి వెళ్ళకుంటే మనం ఇక్కడ సముద్ర జీవులకు ఆహారమైపోతాం" అన్నాను. చిన్న చిన్న జలచరాలు అప్పటికే మా కాళ్ళచుట్టూ చేరి రక్కటం, పీక్కుతినడం మొదలెట్టాయి.

"నాగరికత మాట ఎలావున్న వీళ్ళకు బుర్రలున్నాయి. అవి బాగా పనిచేస్తున్నాయి" అంది డెల్లా నమ్మలేనట్లు.

సముద్రం పైనుంచి దూరంగా ఎక్కడో ఏదో ఇంజన్ ఆడుతున్నట్లు శబ్దమైంది. వెనక్కి తిరిగి తదేకంగా ఆలకించి విన్నాను. డెల్లా కూడా గమనించిందా శబ్దం.

"ఏదో మోటారు బోట్ లాగుంది. దూరంగా ప్రయాణం చేస్తూంది" అంది డెల్లా నాకేసి ఆశగా, ఆనందంగా చూస్తూ.

"అవును. వాళ్ళు ఇటే వస్తారేమో" అన్నాను ఆశగా అటే చూస్తూ.

ఎక్సయిజ్ వాళ్ళ చేతుల్లో చిక్కింది మొదలుకుని నా బ్రతుకు ఇంతవరకు 'ఖైదీ'గానే గడిచిపోయింది. నా పేరు రాజా జాన్ అయినా నాకు యీ ఖైదీ జీవితం మాత్రం తప్పటంలేదు.

ఆ శబ్దం చాలా దగ్గరయింది.

"మనవైపే వస్తుందా బోటు" అంది డెల్లా సంతోషంగా అరుస్తూ.

మాకు వినిపించిన శబ్దం వాళ్ళకూ కూడా వినిపించినట్లుంది. పెద్దగా అరుపులు పెట్టడం కేకలు వెయ్యడం చేశారు. వాళ్ళ నాయకుడు కల్పించుకుని ఏదో చెప్పాడు.

తమాషాగా అందరూ గుమిగూడి వాళ్ళ గూడెంవేపు పరుగుతీశారు.

నాకు ఆశ్చర్యం వేసింది.

"ఎందుకలా వెళ్ళిపోతున్నారు?" అడిగింది డెల్లా.

"అదే నాకూ అర్థం కావడంలేదు. ఆ బోటు మహిమ వాళ్ళకు తెలిసినట్లుంది. అది వచ్చే టయిమ్‌కు ఇక్కడ వుండటం ప్రమాదమనుకున్నారేమో. వెళ్ళిపోయారు. అంటే ఆ బోట్‌లో వున్న వాళ్లెవరో చాలా దుర్మార్గులయి వుండాలి. ఇంతకుముందు ఆ గుంపు మనుషుల్నెవర్నో చంపి వుంటారు. అందుకే వాళ్ళు భయపడి వెళ్ళిపోయుంటారు" అన్నాను.

"అయితే మనం కూడా వాళ్ళకు దూరంగా వుండటం మంచిది" అంది డెల్లా.

ఆమె అభిప్రాయం నాకూ నచ్చింది.

ఇంజన్ శబ్దం మాకు బాగా దగ్గరగా వినవచ్చింది.

ఇద్దరం నీళ్ళలోంచి ఒడ్డుకి గబగబా నడిచి, అక్కడ్నుంచి దూరంగా వున్న చెట్లవేపు పరుగెత్తాం.

అక్కడెక్కడన్నా చెట్లలో ఆ గుంపు పొంచి వుందేమోనని తుపాకులు సిద్ధంగా పెట్టుకునే వున్నాం.

ఎక్కడా వాళ్ళ జాడ కనుపించలేదు. వెళ్ళి ఒక చెట్టు మొదట్లో కూర్చున్నాం.

అక్కడ్నుంచి సముద్రపు ఒడ్డు కనుపిస్తుంది కానీ, చీకటి కావడంవల్ల దృష్టి దోషంగా వుంది.

సముద్రంమీద లైటు కనుపించింది. ఆ బోట్‌కు పెద్ద లైటుబిగించి వుండాలనుకున్నాను. ఆ లైట్ బాగా కాంతివంతంగా వుంది. పదినిముషాల్లో అది సముద్ర తీరానికి వచ్చేసింది.

రెండు మానవాకారాలు అందులోంచి దిగి ఒడ్డుకొచ్చి

నట్లు లీలగా కనుపించింది. కళ్ళు చిట్లించి, చీకటిని చీల్చుకుంటూ ఏకాగ్రంగా చూడసాగాను. డెల్లా కూడా నాలానే చూచేందుకు తంటాలు పడసాగింది.

"ఎక్కువమంది లేనట్లుంది?" అంది.

"ఇద్దరున్నట్లున్నారు?" అన్నాను చూపు తప్పించకుండా.

"ఇద్దరయితే భయపడవలసిన పనిలేదు. మన దగ్గరెటూ గన్స్ వున్నాయి. వాళ్ళేమన్నా పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే కాల్చి పారేద్దాం. బోటు దొంగిలించుకుని వెళ్ళిపోదాం. అందులో బహుశా తినేందుకు, త్రాగేందుకు అన్ని వస్తువులు వుంటాయనుకుంటాను" అంది డెల్లా.

త్రాగేందుకు అన్న పదంమీద కాస్త ఒత్తిడిచేసి చెప్పడంతో, విస్కీకోసం డెల్లా తప్పించుకుపోతోందేమో ననుకున్నాను.

ఆమె ప్రశ్నకు జవాబు చెప్పకుండా చూస్తూనే వున్నాను సముద్రంవేపు. వాళ్ళు సిగరెట్లు వెలిగించారు కాబోలు, కాలుతున్న నిప్పురవ్వల్లా ఎర్రని సిగరెట్ మొదళ్ళు కనుపించాయి.

"ఈ దీవికి వాళ్ళెందుకొచ్చి వుంటారు?" అడిగాను నేను.

"ఏమో? స్మగ్లింగ్ వ్యాపారానికి పనికొచ్చే వస్తువు లేవన్నా ఈ దీవిలో విరివిగా దొరుకుతాయేమో?" అన్నాను.

"మనం ప్రొద్దుట్నుంచి తిరిగాంగా! గంజాయి చెట్లు నాకు ఎక్కడా కనపడలేదు. మరి వజ్రాలు, మొదలైన వేవన్నా దొరుకుతాయేమో మనకు తెలీదుగా!" అంది డెల్లా.

అటువంటిదేదో వుండాలి. లేకుంటే ఇంతదూరం మోటార్ బోట్‌లో రావలసిన అవసరం ఆ ఆగంతకులకు ఎందు కుంటుం దనిపించింది నాకు. అయితే వాళ్ళ కిక్కడ గుంపులతో బాగా పరిచయం వుండి వుండాలి, వాళ్ళ భాష కూడా కొంతకు కొంతన్నా తెలుసుం టుంది.

నాకు వాళ్ళను కలుసుకుని మా పరిస్థితి వివరంగా చెప్పి, సాయం అడగా లనిపించింది. కష్టాల్లో వున్న వాళ్ళంకాబట్టి ఆ మాత్రం సాయం ఖచ్చితంగా చేస్తారన్న నమ్మకం ఏర్పడింది నాలో. వెళ్ళి వాళ్ళను కలుసుకుందా మనిపించిందప్పుడే. నా అభిప్రాయం డెల్లాకు చెప్పాను. డెల్లా కూడా సరేనంది. ఇద్దరం అక్కడ్నుంచి లేచాం. కాస్త ముందుకు నడిచాం.

బోట్‌లోంచి దిగిన ఇద్దరు వ్యక్తులు కాలుస్తున్న సిగ రెట్లు ముందుకు కదలి వస్తున్నట్లున్నాయి. గమనించాను.

"వాళ్ళిటే వస్తున్నారు?" అన్నాను.

"బహుశా గూడెం వేపు పోతున్నారు కాబోలు" అంది డెల్లా.

"ఇప్పుడే కలుసుకుందామా?"

"వద్దు! వాళ్ళను వెళ్ళి రానిద్దాం. వచ్చేందుకు ఎట్మా రెండుగంటలు పడుతుంది. ఈలోగా బోట్‌లోకి వెళ్ళి ఏమైన తినేందుకుంటే ఆరగించి సిద్ధంగా కూర్చుందాం. వచ్చాక మాట్లాడుదాం. మనకు సాయం చేస్తామంటే సరే! లేకుంటే వాళ్ళను కాల్చయినా సరే మనం బోట్ దొంగిలించుకుని వెళ్ళిపోదాం!" అంది డెల్లా.

ఇద్దరం ఒక పొదచాటున నక్కి కూర్చున్నాము.

మాకు వందగజాల దూరంగా నడిచివెళ్ళారు. కాస్త చూడగలిగాను.దగ్గరగా వచ్చాక. నల్లటి సూట్లు తొడు

కున్నారు. ఇద్దరి దగ్గరా గన్స్ వున్నాయి. మంచి పొడవుగా వున్నారు. దగ్గరగా చూస్తే గానీ ఏ దేశం వాళ్ళయిందీ తెలుసుకోవడం కష్టం. మమ్మల్ని దాటి వెళ్ళిపోయారు. ఆ తర్వాత పదినిముషాలు మౌనంగా అక్కడే కూర్చున్నాం.

డెల్లా లేచింది. నేనుకూడా లేచాను. ఇద్దరం సముద్రంవైపు నడవసాగించాం. మధ్య మధ్య తల త్రిప్పి వెనుకకు చూస్తే మా వెనుక ఎవరూ రావడం లేదన్న విషయం ధృవపరచుకుంటూ వడివడిగా అడుగులేయటం మొదలెట్టాం.

ఐదు నిముషాల్లో బోటుదగ్గర కొచ్చాం. మామూలుగా ఉపయోగించే మోటార్ బోట్లకన్నా కాస్త పెద్దదిగా వుంది. నీళ్ళల్లో దిగి దాని దగ్గర కెళ్ళాం. వెనుకవేపునుంచి లోనికి ప్రవేశించాం. లోప లెవ్వరూ లేరు. రెండు కేబిన్స్ వున్నాయి. రెండిటికీ తాళాలు వేసి వున్నాయి. ముందువేపు ఇంజన్ రూం వుంది. అందులోకి వెళ్ళి చూచాం. అక్కడా ఎవ్వరూ కనుపించలేదు. కాల్చి పారేసిన సిగరెట్ పీకలున్నాయి కుప్పగా పడి.

మూడు నీళ్ళ డ్రమ్స్ వున్నాయి వెనుక వేపు. ఒకదాని పైని మూత తొలగించాం. ముప్పాతిక డ్రమ్ నిండా నీళ్ళున్నాయి. క్రింద పడున్న ప్లాస్టిక్ మగ్ తో ఇద్దరం చెరో రెండు మగ్గులు నీళ్ళు త్రాగాం. కడుపు నిండింది. త్రేనుపొచ్చింది.

నీళ్ళు త్రాగాక, మా ఒంట్లోకి క్రొత్త శక్తి, బలం, ఉత్సాహం ప్రవేశించినట్లు ఫీలయినాం.

"కాబిన్ లో సామాన్లు పెట్టి తాళాలు వేసుకొని పోయారు. తియ్యాలంటే పగలకొట్టాల్సిందే!" అన్నాను.

"అపనే చేద్దాం!" అంది డెల్లా.

తుపాకీ మడమతో తాళంకేసి ఘట్టిగా నాలుగైదు సార్లు కొట్టాను. ఊడలేదది! ఇంకా బరువైన సామాను ఏదైనా దొరుకుతుందేమోనని బోటంతా వెదికాను. లావు పాటి పెద్దబోల్టు కనుపించింది. చేతికి తీసుకున్నాను.

నేను వచ్చేసరికి డెల్లా తన దగ్గరున్న తుపాకితో రెండో కాబిన్‌కు వేసివున్న తాళం పగులగొట్టేందుకు ప్రయత్నం చెయ్యసాగింది.

"వచ్చిందా?" అడిగాను.

"రాలేదు!" అంది తన ప్రయత్నం విరమించకుండానే.

నా ప్రయత్నం ప్రారంభించాను. అరడజను దెబ్బలు 'దభీ' 'దభీ' మని తాళం కప్పపై వేశాను. ఊడి పోయింది. బోల్టు దూరంగా విసిరి, ఎడంచేత్తో కప్పను లాగిపడేశాను. గొళ్ళెం వెనక్కి లాగి తలుపులు తెరచాను. లోపలకు అడుగుపెట్టాను.

కాబిన్ వారగా సింగిల్ కాట్ వేసి వుంది. క్రింద మూడు నాలుగు ఇనుప పెట్టెలున్నాయి. ఒకమూలగా రెండు తుపాకీలు ఆనించి వున్నాయి. చిన్న టీపాయి మీద ఖాళీచేసిన విస్కీసీసా, గ్లాసువున్నాయి. అంతలో డెల్లా కూడా కాబిన్‌లో కొచ్చింది.

మంచం క్రిందున్న ట్రంకుపెట్టి వెలుపలకు లాగాను. దానికి తాళంలేదు. మూత తెరచాను. లోపల సీల్ చేసిన టిన్స్ వున్నాయి. నాలుగు టిన్నులను వెలుపలకు లాగాను. వాటిపై నున్న లేబుల్స్ కేసి చూశాను. అవి బాయిల్ చేసిన కోడిగుడ్ల టిన్నులని అర్థం అయింది.

పై మూతలు లాగి లోపలున్న గుడ్లను వెలుపలికి తీసి ఇద్దరం తిన్నాం. మంచంపైన కూర్చునే, రెండో పెట్టె లాగి చూశాను. దాన్నిండా విస్కీ బాటిల్స్ వున్నాయి. ఒకసీసా తెరిచి చెరిసగం త్రాగాం.

మా ఇద్దరికీ ఆకలి తీరిపోయింది. ఉత్సాహం ఉరకలు వేసింది. మూలనున్న తుపాకీల్ని చెరొకటి తీసుకుని మా దగ్గరున్న గన్సును ఆ స్థానంలో పెట్టాము.

"వాళ్ళను బోటుకు దూరంగానే వుంచాలి. మనకు సాయం చేస్తామని మాటిచ్చాకే లోనికి రానివ్వాలి. వాళ్ళు వచ్చాక కూడా మనం వెయ్యి కళ్ళతో వాళ్ళను కనిపెట్టుకొని వుండాలి. తెలిసిందా?" అడిగాను డెల్లాను.

"తెలిసింది" అంది మూతి తుడుచుకుంటూ.

ఇద్దరం మంచంపైనే కూర్చుని, కిటికీలోగుండా సముద్రపు ఒడ్డుకేసి చూస్తున్నాం. ఆగంతకుల జాడలేదు.

కాలం గడిచిపోతుంది. మేము బోటులోకి ఎక్కి అప్పుడే నాలుగుగంటలు దాటిపోయింది. నిద్ర ముంచుకొస్తూ వుంది నాకు. డెల్లా కూడా దాదాపు నా స్థితిలోనే వుంది.

"ఏమయినట్లు? వాళ్ళ జాడలేదే?" అంది డెల్లా విసుగ్గా.

"ఏమో?" ఏ ఆలోచన రాక అయోమయంగా చెప్పాను.

"నాకు నిద్ర వస్తూంది?" అంది డెల్లా.

"నువ్వు పడుకో! నేను మేలుకొనే వుంటాను. వాళ్ళు రావటం చూచాక లేపుతాను" అన్నాను.

డెల్లా తుపాకీ దూరంగాపెట్టి మంచంపైన పడుకుంది. మెత్తటి పరుపుమీద పడుకోగానే నిద్ర పట్టినట్లుంది. గురక రావటం ప్రారంభమైంది. నేను మాత్రం నిద్రను బలవంతంగా ఆపుకుంటూ, కిటికీ కేసి చూస్తూ కూర్చున్నాను.

అలా అరగంటకన్నా ఎక్కువసేపు కూర్చోలేక పోయాను. కళ్ళు బైర్లుక్రమ్ముకొచ్చాయి. విస్కీ త్రాగడం

పొరబాటయిందనుకున్నాను. దానివల్లే ఈ మత్తు పుట్టు కొస్తూందని అర్థమయింది.

ఇక లాభంలేదనుకుని లేచి కాబిన్ తలుపులు లోపల వైపునుండి మూసి, గడియపెట్టి, వచ్చి డెల్లా ప్రక్కనే పడుకున్నాను.

తుపాకీ చేతిలోంచి జారిపోయింది. శరీరం నిద్రలోకి ఒరిగిపోయింది.

'దబదబ' మంటూ తలుపులు బాదినట్లు లీలగా, దూరంగా, ఎక్కడో జరుగుతున్నట్లు వినిపించింది. లేచి చూద్దామనిపించింది. కానీ లేచేందుకు ఒంట్లో శక్తి చాలడంలేదు. కాళ్ళు ముడుచుకుని పడుకున్నాను.

మళ్ళా అదే శబ్దం! ఈమారు దగ్గరగా వినిపించింది.

నన్నెవరో పట్టుకుని ఊపినట్లయింది.

"రాజ్! రాజ్!" చెవిదగ్గర పిలుపు వినిపించింది.

కళ్ళు తెరచాను. ఎదురుగా డెల్లా నావైపు తిరిగి పైకి వంగి వుంది.

"ఏమిటి?" అన్నాను.

"వాళ్ళొచ్చినట్లుంది. తలుపులు కొడుతున్నారు" అంది భయంగా.

ఆ మాటలతో ఉలిక్కిపడి లేచి కూర్చున్నాను. మత్తు వదలింది. క్రిందకు జారిపోయిన తుపాకీని చేతికి తీసుకున్నాను. మంచం దిగాను. తలుపులవైపు నడిచాను. వెళ్ళి దగ్గరగా నిలబడ్డాను.

"హూ ఈజ్ దట్ ఇన్సైడ్! ఓపెన్ ది డోర్!" ఇంగ్లీషులో అధికారికంగా, పెద్దగా అరచాడు ఆగంతకుడు.

"ఫ్రెండ్స్! మా ప్రాణాలకు భయంలేదని హామీయిస్తే తలుపులు తెరుస్తాం!" అన్నాను.

"మీ రెంతమంది?"

"ఇద్దరం!"

"ఎనీ లేడిస్!"

"యస్. వన్ లేడీ!" అన్నాను.

"మీ దగ్గర ఆయుధాలున్నాయా?"

"మా తుపాకులు తీసుకొని సిద్ధంగా వుంచుకున్నాం. మమ్మల్ని మీతో బోట్‌లో తీసుకెళ్ళాలి! అందుకు ఒప్పుకుంటేనే తలుపు తెరుస్తాం" చెప్పాను గట్టిగా.

అవతలి వేపునుండి సమాధానం లేదు. బహుశా వాళ్ళిద్దరూ సమాలోచనలు జరుపుతూండడ వచ్చునని పించింది.

డెల్లా లేచి నా దగ్గర కొచ్చింది.

నా కుడికాలు తలుపుకేసి బలంగా నొక్కి పెట్టి వున్నాను. డెల్లా కూడా తలుపులకు ఆనుకుని నిలబడి, తన బలాన్నంతా వాటిపైకి మార్చి పళ్ళు బిగబట్టింది. అవతలి వేపునుండి తలుపు తెరిచేందుకు వాళ్ళకు వీలులేకుండా చెయ్యడమే మా ఉద్దేశ్యం.

"హాండ్సప్!" అంటూ వెనుకవేపునుండి పెద్దకేక వినిపించింది. ఇద్దరం తలత్రిప్పి చూశాం. మెషిన్‌గన్ కిటికీలోగుండా దూర్చి, మాకు గురిపెట్టి వున్నాడు ఒక ఆగంతకుడు.

చచ్చినట్లు చేతులు పైకెత్తాం.

"డ్రాప్ ది గన్" అరిచాడు మళ్ళీ.

తుపాకులు నేలమీదకు జారవిడిచాం.

"ముందుకు రండి. నాదగ్గరకు రండి!" అన్నాడు. తోలుబొమ్మల్లా అతను చెప్పినట్లు చేశాం.

"ఆ కిటికీ మూసి వుండవలసింది!" అంది డెల్లా మెల్లగా.

"అవును! ఆ హడావుడిలో నేను గమనించలేదు'

విచారంగా చెప్పాను.

మా వివరాలు తెలుసుకోకుండానే మమ్మల్ని విరోధులు క్రింద జమకట్టి, మాతో కయ్యానికి దిగిన ఆ ఆగంతకులను గురించి ఆలోచించాను. వాళ్ళకు ఇంగ్లీషు తెలుసు. దాన్ని బట్టి వాళ్ళు ఏ యూరోపియన్ లేదా అమెరికన్ దేశానికో చెందిన వాళ్ళయి వుండాలి.

దేశంకాని దేశంలో తమ తోటి నాగరికులను కలుసుకున్నందుకు సంతోషం కలగడం సామాన్యంగా జరిగే పని కానీ వీళ్ళు మమ్మల్ని శత్రువులుగా పరిగణిస్తున్నారు.

మమ్మల్ని అంతకుముందు బంధించిన గుంపు గుర్తొచ్చింది. ఈ బోట్‌లో వచ్చిన వాళ్ళకూ, ఆ గుంపుకూ ఏదో సంబంధముండి వుండాలి. వీళ్ళు బోట్ దిగి ఆ గుంపు దగ్గరకే వెళ్ళి వుంటారు. అక్కడే మేము వాళ్ళ చేతుల్లో చిక్కడం, తప్పించుకోవడం తెలుసుకొని వుంటారు. తిరిగి ఇక్కడకు రాగానే తమ బోట్ కాబిన్ తాళం పగులగొట్టి వుండటం గమనించాక, మమ్మల్ని శత్రువుల క్రింద జమకట్టి వుంటారనిపించింది.

మా వెనక, మేము మూసిన కాబిన్ తలుపులు తెరచేందుకు బ్రహ్మప్రయత్నం సాగుతోంది. దబదబమంటూ చప్పుడవుతూంది.

చెవులు గింగుర్లు ఎత్తేట్లు అరుపు వినిపించింది. వెంటనే తలుపులోంచి బరిసె ఒకటి దూరింది. అది నా వీపుదాకా వచ్చింది.

ఆ అరుపు నాకు పరిచయమైనదే! ఆ గుంపు వాళ్ళు కూడా ఇక్కడికొచ్చి వున్నట్లు అర్థం చేసుకున్నాను. ఇక మాకు చావు తప్పదు. కాళ్ళూ చేతులు వణకసాగాయి.

అంతకుముందు పడేసిన ఖాళీ టిన్నొకటి డెల్లా కాలికి తగిలింది. మెరుపులా తట్టిందామెకు ఐడియా.

ఎడంకాలితో ఆ డబ్బాను చాచి తన్నింది. అది మంచం క్రిందనుండి స్పీడుగా వెళ్ళి కాబిన్‌కు అమర్చిన రేకు గోడపైనపడి 'ధన్'మని శబ్దం చేసింది.

డెల్లా, రాజ్‌లపైన గురిపెట్టివున్న ఆగంతకుడు ఆ శబ్దం విని తలవెనక్కి త్రిప్పాడు. అదే అదనుగా ఇద్దరు మంచం క్రింద దూరాము. పాక్కుంటూ వెళ్ళి తుపాకీలు అందుకున్నాము.

ఆ ఆగంతకుడు మళ్ళా తలత్రిప్పి చూసేసరికి కాబిన్‌లో ఎవ్వరూ కనుపించలేదు. అదిరిపోయాడు.

"ఎక్కడున్నారు? పైకిలేవండి?" అరిచాడు.

కిమ్మనకుండా ఇద్దరం మంచంక్రిందే పడుకున్నాము.

"త్వరగా పైకి లేవకుంటే మంచంమీదకు కాలుస్తాను" అన్నాడు పెద్దగా.

ఇద్దరం నడుములు పైకెత్తాం ఒకేసారి. మాతోపాటు మంచంకూడా లేచింది. కిటికీకి అడ్డం వచ్చింది.

వెలుపలున్న వ్యక్తి 'ధన్, ధన్'మని నాలుగు రౌండ్లు ప్రేల్చాడు. గుండ్లు మంచంలోంచి దూసుకునిపోయి, ఎదురుగావున్న తలుపుల్లో రంధ్రం చేసుకుని, అటువైపు వెళ్ళాయి.

"అబ్బ!" అంటూ తలుపుల కటువైపు ఎవరో అరచారు.

"ఎవరికో గుండు తగిలింది. చచ్చినట్లున్నారు" అంది డెల్లా. నాకు నవ్వొచ్చింది.

"స్టాప్ ఫైరింగ్!" రెండో వ్యక్తి కాబోలు, మమ్మల్ని కవర్ చేస్తున్న వ్యక్తి దగ్గరకొచ్చి చెప్పటం మాకు వినిపించింది.

"ఏమయిందిి?" అడిగాడతను.

"ఒక నేటివ్ చనిపోయాడు. అదేంటి ఆ మంచం

అలా కిటికీకి అడ్డం వచ్చింది'' అడిగాడు.

అతను అందాకా జరిగింది చెప్పాడు.

"లోపలున్నవారు గుండెలు తీసిన మొనగాళ్ళలా గున్నారు. అలా ఎంతసేపని ఆ కాబిన్ లోపలుంటారు. వెలుపలికి రావాలిగా! వచ్చినప్పుడే వాళ్ళ పని పడదాం. ముందు మన బిజినెస్ పూర్తి చేసుకుందాం రా!'' అన్నాడతను.

"అంతేనంటావా?'' అడిగాడు మమ్మల్ని కవర్ చేస్తున్న వ్యక్తి.

"ప్రస్తుతానికంతే!'' అన్నాడు.

కిటికీ దగ్గరనుండి దూరంగా వెళ్ళిపోతున్నట్లు బూట్ల చప్పుడయింది. రెండునిముషాల్లో మంచం యధాప్రకారం వేసి, వెలుపలి కొచ్చాం ఇద్దరం. కిటికీ తలుపులు మూసి వేశాం. గడియలు పెట్టాం. లోపలంతా చీకటిగా వుంది.

తలుపులు తెరచే ప్రయత్నం కూడా మానేశాం. అంతకు ముందు అందులో గుచ్చిన బరిసెకూడా లాగేశారు. ఆ భాగంలో పెద్ద రంధ్రమయింది.

"అమ్మయ్య! కాస్త తెరిపిచ్చారు!'' అంది డెల్లా క్రింద నుండి విస్కీ సీసా అందుకుంటూ.

"మళ్ళీ తాగుతున్నావా?'' అడిగాను.

"ఆఁ! కాస్త వేసుకుంటే ఉషారుగా వుంటుంది. మనం యీ గదిలో ఖైదీలమయ్యాం. మనల్ని ఎలాగూ చంపుతారు వీళ్ళు. ఈలోగా హాయిగా తాగుదాం!'' అంది.

"పాపం నువ్వు ఇండియా చూడాలని బయలుదేరావు. అదేమో అసలు సాగలేదు! ఏమేమో చూస్తున్నావ్!'' అన్నాను సానుభూతిగా.

—(సశేషం)

## సప్లిమెంట్ పోటీ

1, 2, 0, 8, 9 అంకెలను తీసుకొని, మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళలో పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితంపై వ్రాసి, దానితో 75 పైసల పోస్టలు స్టాంపులు జతపరచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేర్చాలి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలువేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఒక ఏడాది పత్రిక లేదా సప్లిమెంట్ ఉచితంగా పంపుతాం. ఈ పోటీలో అందరూ పాల్గొనవచ్చు.

ఒక్కొక్కరు 3 కూపన్లకు మించి పంపకూడదు. ప్రతి కూపనుకు 75 పైసల పోస్టలు స్టాంపులు పంపాలి. ఫలితాలు మార్చి '75 నెల 'అపన'లో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికీ సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చును.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20-/లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్ డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులుకానివారు తమ సభ్యత్వ రుసుము పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో ప్రచురించబడతాయి.—ఎడిటర్.

## 44

ఒకడు:—నీ గుండు అష్టవంకరలు తిరిగిందేమిటోయ్?

రెండోవాడు:—ఉదయం మంగలి షాపుకు వెళ్ళాను. వాడి షాపులో ట్రాన్సిస్టర్ వుంది. వాడికి తబలా అంటే మహా ఇష్టంట. అందులోంచి తబలా మేళం వస్తుంటే, దానికి తగ్గట్టు నా బుర్రమీద వాడి చేతులు ఇష్టం వచ్చినట్లు— అబ్బ—లేవబోతే చెవులు పట్టుకున్నా చో పెట్టి—నారాయణ! ఏమి చెప్పమంటారు?

* * *

భార్య:—మన పెళ్ళయ్యాక మీరసలు తప్పే చేయ లేదన్నమాట?

భర్త:—లేదు. అదే ఆఖరు తప్పు!

* * *

తండ్రి ఫుల్‌గా తాగొచ్చాడు. ఆడుకొంటున్న కొడుకుని పిలిచి, "ఒరే! నీ పేరేమిట్రా?" అన్నాడు.

"కిచెన్" చెప్పాడు వాడు ముద్దుగా కిషన్ అనడం రాక.

"ఓహో! చికెనా? ఇవేళ బార్‌లో అది దొరకక మజాయే లేదు. పద! బార్‌కు పోదాం!!" అంటూ వాణ్ణి వెంటబెట్టు కొని తిరిగి బార్‌కు బయలుదేరాడు.

—యం. విద్యుల్లత, విశాఖపట్టణం.

## 45

"మా ఆయన్ని పిలవండి," అందొక యిల్లాలు ఫోనెత్తి.

"నంబర్ ప్లీజ్!" అడిగింది ఆపరేటర్ తియ్యగా.

"నంబరేమిటి? నాకున్న దొకదే మొగుడు" అందా యిల్లాలు.

* * *

టీచర్ :— చూడండి సార్! మీ అబ్బాయిని శివ ధనుస్సు విరిచిందెవర్రా అనడిగితే నేను కాదని సమాధానమిస్తున్నాడు.

తండ్రి :—నమ్మకండి మాష్టారూ! వాడే విరగ్గొట్టి ఉంటాడు వెధవ?

మాష్టారు:—అది కాదుసార్! అసలది విరగ్గొట్టింది రాముడు.

తండ్రి :—అయితే మరి యిక్కడికెందు కొచ్చారు? వాడి తండ్రి దగ్గరికే వెళ్ళండి!

* * *

"ఈ రోజునుంచీ నాకు చెడ్డ వార్తలేవీ చెప్పవద్దు. అన్నీ మంచి వార్తలే చెప్పాలి!" అని వార్నింగ్ యిచ్చి భర్త ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

సాయంత్రం యింటికి వచ్చేసరికి భార్య, "ఏమండోయ్! శుభవార్త! యివాళ మన ముగ్గురబ్బాయిల్లో యిద్దరి కాళ్లు విరగలేదు." అంది

—కెయస్వీ ఆంజనేయులు, ఏలూరు.

# 46

భార్య (భర్తతో):-ఏమిటండీ అలా మండిపడుతున్నారు?

భర్త (చిరాకుగా):-ఛీ! ఛీ! వెధవ కాలం! ఇందాక కాలింగ్ బెల్ వినబడితే ఎవరో వచ్చారనుకొని ఆత్రుతగా వెళ్ళి తలుపు తీసానా? ఎవరో బిచ్చగాడు నిర్భింతగా నిలబడి, "భోజనం ఉంటే పెట్టిస్తారా" అంటూ అడిగాడు.

* * *

"ఏయ్ మిస్టర్! ఆగు సైకిలు లైట్ లేకుండా తొక్కుతున్నావేం?" అంటూ అడ్డగించాడు పోలీస్.

"థాంక్స్‌సార్! రక్షించారు దయచేసి ముందు నా సైకిలు హాండోవరు చేసుకోండి. వెనకాల అప్పులాడు పరిగెట్టు కొస్తున్నాడు" అన్నాడు ఆ వ్యక్తి ఒగరుస్తూ.

*　　*　　*

"అదేమిటే! మీ ఆయనకు 'విస్కీ' త్రాగే అల వాటుందా?" అడిగింది గిరిజ విడ్డూరంగా.

"ముందు ఉండేది కాదే! నేను త్రాగడం చూపి నేర్చు కున్నారు" అంది వనజ నిదానంగా.

—ముద్దా సురేష్, కాకినాడ-2.

## 47

"ఏయ్! సర్వర్! ఇడ్లీలు కంపు కొడుతున్నాయ్!"

"మూడు రోజులప్పుడు రాకుండా మీరు ఈ రోజువస్తే కంపు కొట్టవా సార్?"

*　　*　　*

అల్లుడు:- మామయ్యా! మీ అమ్మాయి చిన్నపిల్ల. వంట చేసేది రాదట. కావున మీరు మీ అమ్మాయిని పెట్టుకొని, మా అత్తయ్యను నాతో కాపురానికి పంపేయండి.

*　　*　　*

సినిమా జోరుగా సాగుతోవుంది. హీరోహీరోయిన్‌ను ఇంటినుండి గెంటి వేస్తున్నాడు. ఆ సీను చూస్తూ భర్త, భార్యతో అంటున్నాడు.

భర్త:—మాడే! నిన్ను అలా గెంటితే. అప్పుడు నీకు బుద్ధి వస్తుంది!

భార్య:—అయ్యో! రామ! నన్ను గెంటి తర్వాత మీరు ప్రాణాలతో వుంటారా?

—జి. విజయలక్ష్మి, పుంగనూర్. ★

